# భారతి

[ సచిత్ర మాసపత్రిక ]

సంపాదకుడు:

శివలెంక శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము

మదరాసు.

సంపుటము 18] డిసెంబరు [సంచిక 12

1941



# విషయానుక్రమణిక

## డిసెంబరు, 1941




సంపుటము 18
సంచిక 12

# భారతి

వృష మార్గశీర్షము
1941 డిసెంబరు


# సంక్రాంతి!


= శ్రీ బంకుపల్లి రామజోగారావు =


౧

మిసిమి జవరాలి లేనవ్వు మెఱపుఁ జూచి - పొంగి యొక వింత బంతినై పోతిఁ గాని
అమవసదినంపు సాంధ్యరాగముగ దానిఁ - దెలియనైతిని క్రొంగ్రొత్త కళవళమున!

౨

సందె నును కెంపుఁ జాయలు జలధిఁ గలసె - తొలి దెసంగన ఘూకమ్ము పలుకరించె
తలలు వంచుచుఁ దలఁపులు చెలిమి వీడె - తళుకు మిణుగురు పుర్వులు పులకరించె!

౩

నిగ్గు కాటుక వానలో నిలువలేక - యెడఁద కంపించిపో దద్దరిల్లు నన్నుఁ
గనులు చిప్పిల గంభీర కాళరాత్రి - యినుప కౌఁగిట బిగియించి తనియఁజేసె!!

౪

నామురువు దావవహ్ని మంతనములాడె - నానగవు వేడికన్నీళ్ల నాట్యమాడె
కరఁడుగట్టిన కటిక చీఁకటులలోనఁ - గఱఁగి పోయెను నాయెద కానఁబడక!!

౫

చీఁకటి వెలుంగులో విరచించుకొన్న - నవ్య మధుగీతికా పరిణామ రవము
బడలి ఘూపించు శూన్య గర్భమ్ముఁ జించి - చిఱుతళుకు జుక్కనడి శ్రుతిచేసికొనియె!

---

# గానప్రశంస

= శ్రీ భమిడిపాటి కామేశ్వరరావు =

"దూరశ్రవణార్థి చెవిని ఘోరమైనట్టి...బలునా రవంబు పరపుకొని...యిష్టమొందు" అని శాసించి, అల్లా భౌతికంగా జరిగింపించి చూపించారు సూరన. ఈమాటలు తగిలే సందర్భంయొక్క చుట్టుపక్కలే కాకుండా అట్టడుక్కికూడా పరీక్షిస్తే, ప్రపంచంలో ఉండే శ్రవ్యవిషయం యావత్తూ గమనించాలంటే, చెవులు మూసేసుకోవాలని అతడనేది. గట్టిగా చెవులు మూసేసుకున్నప్పుడు నాదం వినబడితీరుతుందనీ, అదే ఓంకారమనీ అనే భక్తులుండగలరు. అది సూర్యప్రదక్షిణాలు చేస్తూండే గ్రహాల గమనఫలితం అనే శాస్త్రవేత్తలున్నారు. గ్రహచారం నియమిత మార్గాల్లో నియమితకాలాల్లో జరిగిపోతూండడంవల్ల లయసిద్ధి కలుగుతూంటుంది గనక, ఆ నాదమే ఖగోళగానమని కొందరు జ్ఞానుల మతం. వివిక్తప్రదేశంలో ఉన్నప్పుడు చెవులు తెరిచిఉంచినా, ఎక్కణ్ణించి వస్తోందో తెలియని నాదం వినిపిస్తూనే ఉంటుందని ఏకాకులు చెబుతారు. శూన్యత్వం నాదానికి వాహకంగా ఉండజాలదని నిర్ధారణ చేశారు. భూజలవాయువులు నాదాన్ని ప్రసరించగలవన్నారు. భూమిమీద కంటె జలంమీద నాదం ఎక్కువదూరం వినిపిస్తుంది. మనిషికేక పదిపన్నెండు మైళ్లదాకా వినిపించగలదనీ, జలంమీది యుద్ధంలో ఒక సందర్భంలో తుపాకీనాదం రెండువందల మైళ్లదాకా వినిపించిందనీ గుర్తించారు. రాయీ, కర్రాకూడా నాదాన్ని వ్యాపింపజేస్తాయన్నారు. రాయి కటువుగాని, కర్ర చాలా శ్రావ్యం గనక యంత్రాల్లో ఉండడానికి కారణం అన్నారు. భూగోళంయొక్క బ్రహ్మాండనాదాల్లో మొదటిది ఉరుము. అది వాయువులో కాల సంఘట్టనవల్ల జనించినా భయజనకంగా ఉండి, దూరంగా ఉంటూన్నకొద్దీ శ్రావ్యంగా ఉంటుంది. సముద్రతరంగాల హోరూ, జలపాతాలయొక్క స్వనమూకూడా మహానాదాలే. తుపాను చెలరేగే సమయంలో వాయువు భూభాగాన్ని కొట్టడంవల్లా, చుట్టుముట్టడంవల్లా బయల్దేరే నిర్ఘోషం కూడా విచారాన్ని శ్రావ్యంగా మారుస్తుంది. ౧౩౦౦ బి.సి.లో కట్టిన ఒక రాజుయొక్క గొప్ప విగ్రహం ౨౭ బి.సి.లో వచ్చిన భూకంపానికి దెబ్బతిని బీలకూలగా దాని రంధ్రాల్లోంచి వచ్చిపోతూండే గాలి వేడెక్కి ఒక శ్రావ్యరోదనం చుట్టుపక్కలకి వినిపిస్తూండేదనీ, మరి రెండువందలయేళ్ల తరవాత ఒక చక్రవర్తి ఆ శిథిల విగ్రహాన్ని బాగుచెయించగా ఆ రోదనం మళ్లీ వినిపించకుండా పోయిందనీ తెలుస్తుంది. సహారా ఎడారి జోలపాట అనీ, కలహారీ ఎడారి లాలిపాట అనీ, అరేబియా ఎడారి రోదనం అనీ, మరో యెడారి మూలుగుపాట అనీ, ఇంకో ఎడారి ఈలపాట అనీ ప్రసిద్ధికెక్కిన నాదాలున్నాయనీ, కోట్లాది ఇసకరేణువులూ, ఉష్ణరేణువులూ సంఘటితం అయినప్పుడు, మీటిన తంత్రి స్పందించేటప్పటి నాదంలాగ, అది సుశ్రావ్యమై ఉండడం యథార్థం అనీ శాస్త్రజ్ఞులు సెలవిచ్చారు. వృక్షాలయొక్క రూపాన్నిబట్టీ, పత్రాలయొక్క సాంద్రతనిబట్టీ వాటి ఊతం, మర్మరం ఉంటాయి. ఇటీవల దాన్ని పొయిలో పెట్టడం నేర్చి నప్పణ్ణించీ 'సరుగు' చెట్టు అంటున్నారుగాని, అసలు ఆ చెట్టుని చాలాకాలం తెలుగువాళ్లు 'సంగీతపు' చెట్టు అనేవారు. పాకే పురుగుల్లో మేటిగా గాలిమేసరి ఉండిగనక వాటి నాదానికిగాని, నాదప్రియత్వానికిగాని ఆక్షేపణ లేదు. ఎగిరేపురుగుల్లో తుమ్మెదజుమ్మ యతిప్రాసల్లోనే శిలసంతనా అయిపోయింది. పక్షుల నాదం అద్భుతం! అంధకారంలో మునిగిపోయిఉన్న జీవులకి కళ్లు తెరవడానికి దినమణి వస్తూన్నందుకు మానవులు తమలో కలవకపోతే తమకేం లోటని పక్షులు తమ కోటినిండా చేసే నిత్యప్రభాతనాదం సరేసరి. జీవరాసుల నవోదయం జరిగే వసంతసమయంలో

అని చేసే మధురనాదం దైవప్రేరితమూ అనిపించేటటువంటి నాటి ఆనందంయొక్క సూచన. పక్షుల్లో పికమయూరాలు నాదశాస్త్రాల్లోకే ఎక్కిపోయాయి. కుక్కుటధ్వని త్రిభంగిగా ప్రబంధింపబడింది. కాకిలాంటిదానికి అన్యాయం జరిగిపోయిందంటే ఏం చేస్తాం? అది బంధువు లొస్తారని వార్త చెప్పగలిగితేం, అశుద్ధమైన చచ్చినవాళ్లకూ కూడా తినిపెట్టగలిగితేం, రెండుమూడు వివాది శ్రుతులు కలిసి ముప్పేటగా, కరారావములాగ ఉండే కూత పాడుతూండడంవల్ల గావుకు దాని పని 'హుళాక్' అయింది. అందుకనే కాదూ "కాకేమి తన్నుదిట్టెనె" అన్నాడు కవి! ఇక జంతువుల్లో రాజై గర్జించే సింహం నాదశక్తివల్ల కట్టుబడగలదని తెలిసినా, ఋషభ గాంధారాలే పెద్దలచేత మన్నింపబడ్డాయి. కేవల హృదయపూర్వకమే కాక నాభిపూర్వకమైన నాదం చేసే మహిషమూకలకి మన్ననలేకపోయింది. ఇభశార్దూలాలు గానంలో సీటు దొరక్క కవిత్వంలో పడ్డాయి. శునకనాదం వికృతులతో మాసిఉండడంవల్ల తిరస్కరింపబడినా కొండొకచో రాత్రివేళ శృగాలానుకరణం చేసినా, మాహాత్మ్యం గలదే అని చెప్పడానికి భైరవం అయింది. ఒకానొకడు ఒక కుమ్ములీడులో అమావాస్యచీకట్లో దారితప్పి గిరగిరా తిరిగి పక్కనే రెండుమైళ్లలో ఉన్న ఊరు ఏదిక్కునో తెలియక తంటాలుపడుతూండగా, శునకనాదం వినిపించి దారిలో పడ్డట్టూనూ, వాడే పైవారితో చెప్పి దాని పేరు చరితార్థంచేయించినట్టూనూ చెబుతారు. శృగాలనాదం శ్రవప్రియత్వం స్ఫురించే దనడంవల్లా, కేవలరోదనం స్ఫురించే అతిదీర్ఘ వ్యాపారం అవడంవల్లా, భయాన్ని పెంపొందించగల అర్ధరాత్రివేళ జనించడంవల్లా పరపతి చెడగొట్టుకుంది. "అది పల్లిస్తే సంగీతం అవుతుంది, ఛీ" అనిపించేసి, స్వారస్యకవి అశ్వనాదంయొక్క గౌరవం ఖాయపరిచాడు. వీట్లకేంగాని, అన్నింటిలోకీ మిక్కిలి ఎక్కువ నిరసనకి పాలైంది ఖరస్వరం. ఒక ఆంగ్లరసజ్ఞ డీవిషయంలో చాలా వాపోయాడు: "అయ్యో! ఖరంయొక్క శ్రమ, ఓర్పు, మంచితనం, అమాయికత్వం, అమాత్సర్యం, ఓరూత్రపుదెబ్బలకి నిర్లక్ష్యం — ఇవన్నీ అల్లా ఉంచండి, దాని నాదం వినిపించుగోరే! దాని స్వరం ఎంత మధురం, ఎంత సమంజసం, ఎంత విళంబం! అది ఎంతెంత చెవులతో వినగల మోతాదులు మన కిస్తూంటుందీ! అమితమైన గానం వృత్తిగా చేసేవాళ్లల్లో చాలామంది దాని నాదం శ్రావ్యం కాదని ఏమొహం పెట్టుకుని అనగలరు! దాని నాదంలోంచి బయల్దేరేటన్ని శ్రుతులుగాని, స్థాయిలుగాని, అంతర శ్రుతులుగాని, వాది సంవాది వివాదులుగాని, ఆరోహణ అవరోహణలతో కూడిన మూర్ఛనరకాలుగాని, తాళాల మేళవింపుగాని, నాదపాత నాదవిజృంభణాలుగాని, బహుకంఠనాదస్ఫురణగాని ప్రయత్నం చేసి మరి యేఒకచోట ఉన్నట్టు కనిపెట్టగలం! యుద్ధసన్నద్ధులై ఉన్నవాళ్లకి ఉషార్ ఎత్తించడానికి నాదాలున్న సంగతి నిజమే, శత్రువుల్ని తారెత్తగొట్టే నాదాలుండడం నిజమే. కాని, ఒకానొక ఖరం తన ప్రియనాదం చేసేసరికి ఒక పటాలం పటాలం కూవత్తూ పటాపంచలై పారిపోయిన మాటకూడా సత్యమేట!" అని రాశాడు. ఏమైనా ఖరంయొక్క శత్రువు పేరట ఒక నాదానికి నామకరణం చెయ్యడంలో పెద్దలు ఖరాన్ని మరిచిపోలేకపోయారు. జంతువుల్లోకల్లా శ్రేష్ఠుడనబడే మానవుడు భూమిమీదఅవతరించడానికి పూర్వం బోలెడునాదం భూమిమీద ఉండిఉండాలి. మానవుడు నాదాన్ని చీల్చి రెండుభాగాలు చేశాడు. ఒక భాగాన్ని గాత్రానికి మాత్రమే వొదిలిపెట్టాడు, ఇతరప్రాణికోటికి మల్లేనే! రెండోభాగాన్ని గాత్రానికే కాకుండా నాలికకికూడా ముడిపెట్టి వస్తుసంబంధాలకి సంకేతాలు ఏర్పరిచి, ఆ సంకేతాల్ని మాటలని, వాటి వ్యవసాయంకూడా ప్రారంభించాడు. భాష అంటే అభినయంకూడానా కాదా, అనుకరణంవల్లే భాష పుట్టిందా అభినయసహితంగా నాదాలు చెయ్యడంవల్లనా, ప్రథమంలో ఉచ్చారణలో ఉన్నవి అచ్చులేనా వంటి సంశయాలు ఆపేద్దాం. ఆదిని నాదంలోంచి స్వరాలూ, వర్ణాలూ ఎప్పుడు ఎక్కడ ఎల్లా ఏర్పడ్డాయో తేల్చడం అసాధ్యం అంటాం, దేవుడివల్ల వినిపించబడ్డాయి అంటేంగాని, ప్రస్తుతం భూమిమీద దగ్గిరగా ఒక వెయ్యిభాషలూ, అయిదారువేల మాండలికభాషలూ ఉన్నట్టు శాస్త్రజ్ఞులు రాశారు. ఒక పదభాష మరో పదభాషవాడికి కేవలనాదం. పోనీ ఆ కొత్తభాషలో

ర, ల, మ, ద, న, స లాంటి ధ్వనులే ఎక్కువగా వస్తోచ్చినా, ఇటాలియన్, స్పానిష్, పోర్చుగీస్ భాషల్లోలాగ అది చెవికి ఇంపుగానే ఉంటుంది. వేర్వేరు భాషలవాళ్లు ఇద్దరు కలుసుకున్నప్పుడు హస్త, ముఖ, నేత్రసంజ్ఞలు కొంతవరకు పనిజరుపుతాయి. ఇవంతా నాలిక, దవడలు, దంతాలు, పెదవులు వీటి మద్దతుతో కంఠధ్వని సృష్టించగలమాటల సంగతి. మరి గాత్రానికే సంబంధించిన నాదం మాట! దాన్నిగురించికూడా మానవులు ఎవరిమట్టుకు వారు వ్యవసాయం చేసున్నారు. వీలైనంతమంది పశువుల హృదయాల్ని నిష్కారణంగా ఆకర్షించే నాదాన్ని గానమనీ, అట్లా చెయ్యజాలని నాదాన్ని చప్పుడు, అల్లరి, గోల, కోలాహలం అనీ విడదీసేశారు. 'కోలాహలం' అంటే 'కలిసిఉన్న పందుల్ని చెల్లాచెదరు చెయ్యడం' గావును, అసలు! హృదయాకర్షణచేసే గానంలో శ్రుతి, అవిచ్ఛిన్నత, వ్యక్తిత్వం, క్రమగతీ ఉంటాయనీ, తక్కిన నాదానికి ఉండవనీ కేటాయించారు. పై వాటిలో ఒకటిగాని, కొన్నిగాని, అన్నీగాని ఉంటూన్నకొద్దీ గానోద్రేకం మరీ పెరుగుతుం దన్నారు. ఎదైనా రైలు, మోటారులాంటి యంత్రాలకి ఒక్కొక్కప్పుడు క్రమగతిమాత్రం ఉండడంవల్లా, విమానం గాలిపటంలాంటివాటికి శ్రుతిమాత్రమే ఉండడంవల్లా, కొందరి వాచికంలోనే సరళతమాత్రం ఉండడంవల్లా గానస్ఫురణ అవుతుంది.

గానాన్ని అఖండులు స్తుతించారు. గానలోకం దేవలోకం అన్నారు. గానం భూమిమీద ఉండగల దివ్యత్వానికి పారం అన్నారు. పరిమితమైన మానవుడి భావన అనంతత్వంలోకి తొంగిచూసిరావడానికి సాధనం గానం ఒక్కటే అని ఓకవి అన్నాడు. సహజగానం గంభీరవిచారదాయకంగాని ప్రేమప్రేరకం కాదని కొందరు సెలవిచ్చారు. అది కరుణాసింధువు అని ఒక మతం. గానం అనంతప్రకృతియొక్క మధురనిశ్వాసం అని ఒకడు మెచ్చాడు. క్రూరజీవుల్ని సాధుగాచేసినా, రాతిని కరగజేసినా, ఇనుమునివంచినా, సింహాన్ని అటకాయించినా, పాముని కనుబామగలిగినా, శిశువుని మరిపించినా గానానికే చెల్లిందని ఒకడన్నాడు. నాదతరంగంలో ఉండే వాయుకేణువుల అత్యల్పహతం అనామకం అయినా, ఆ అల్పహతమే పెకనుకి కొన్నివందలసార్లు జరిగినప్పుడు అది పర్వతాన్ని ఊపజాలినంత ప్రబలం కాగలదని శాస్త్రజ్ఞులే పరిష్కరించారు. తంత్రీయంత్రం మేళవించి ఒక గాయకుడు సృజింపగలిగిన గానానికి రాళ్లు లేచివెళ్లి సర్దుకుని ఇళ్లు పట్నంగా ఏర్పడ్డాయని ఒక దేశంలో నమ్మేవాళ్లున్నారు. ఒక గాయకుడు గానం చేసి మేఘాల్ని రంజింపచేసి వర్షం కురిపించాడని నమ్మేజనం మనలోనే ఉన్నారు. ఇటలీలో (గావును) ఒకవిధమైన సాలీడు కుట్టినప్పుడు బాధ తగ్గించే మందు గానమేనని అంటారు. అనేకకళలతో కలిసిఉన్నప్పుడు తక్కినవాటికి తక్కువ మాన్యం పెట్టించి, వాటిని ఒక్కటూ గమనించలేని స్థితిలోకి జీవుల్ని తెచ్చి, వారి హృదయాల్ని వశ్యాలంగా తన పక్షానికి లాక్కోగల ఒంటెత్తుతనపు గుణమాహాత్మ్యం విషయంలో గానాన్ని చెప్పి మరోకళని చెప్పాలి. కళలన్నిటిలోకీ మిక్కిలి గంభీరం, మిక్కిలి అప్రాప్యం, మిక్కిలి వేగయుతం, మిక్కిలి చలనజనకం గానమే అని జ్ఞానుల అభిప్రాయం. ఒకానొక వంతెనమీద సిపాయిలు తాళయుతంగా నడిచేటప్పటి నాదానికి వంతెన ఊగడం మొదలెట్టగా (వాళ్ల బరువుమూలాన్ని కాదు!) అప్పట్నించి వంతెనమీద సిపాయిలు మార్చింగు చెయ్యవలసివచ్చినప్పుడు అక్కడక్కడ అడుగుమార్చాలి (తాళం చెడగొట్టాలి) అనే నిర్బంధన పుట్టినట్టు తెలుస్తుంది. పని అడ్డమండా వాసుకు లేకుండా చేసుకోడం నిమిత్తం కొన్ని యంత్రశాలల్లో గానం వినపడగా అక్కడ జీతాలు తక్కువైనా కూలీల సంఖ్య హెచ్చుతూనే ఉందని ఒకడు రాశాడు. కాఫ్యాలయాల్లో (వెనక ఒక గ్రామఫోను) ఇటీవల ఒక రేడియో పెట్టు వేయించడం కాఫ్యాదులు శ్రావ్యంగా తాగబడేనిమిత్తమే! ఐనా సరే గానం అంటే ఆకర్షణలేనివాళ్లూ, గానం అంటే ద్వేషంగలవాళ్లూ, గానం అంటే జబ్బుచేస్తుం దన్నవాళ్లూ గొప్పవాళ్లల్లోనే ఉండినట్టు చరిత్ర చెబుతుంది. అల్లానే, కవి కలలవాడైనట్టుగానే గాయకుడు తనేమి జేస్తున్నాడో తెలియని మత్తుడుగదా అని నిరసనచేసినవాళ్లూ లేకపోలేదు.

శ్రుతి గానానికి బజావాయే కాదు, శ్రుతే గానం! మా మేష్టరుగారు ఒకాయన ఒక రాత్రివేళ ఆనందంగా ఫిడేలు వాయించుకుంటూ ఉండగా పాము చక్కా వచ్చింది. ఆయన సత్కరింపబడి కచేరీచేసిన వాడూ కాదు, ఆ పాము అప్పట్లో వాయింపబడు తూన్న రాగం శంకరాభరణం కాదే అని పట్టింపు పడ్డట్టూ కనిపించలేదు. ఒక స్నేహితుడు రాత్రెళ్లు తన 'హార్మోనియం' కొయ్య తీసి శ్రుతి వెయ్యగానే (హార్మోనియం అంటే మంచి పేరు దాల్చి నాదాన్ని నరికి పోగులు పెట్టడానికి సిద్ధంగా వుండే అపాఘధూర్తి మేళం అయినప్పటికీ) పాము వస్తూండడంవల్ల అతడు ఆ వాయింపు నేర్చుగోనేలేకపోయాడు. ఈసంగతి ఒక నిఖారుసు తెలుగువాడు విని "అవును, వాక్ప్రజ్ఞ ఏముంది అందులో! ఆకట్టెలు అల్లాంటివి గావును!" అన్నాడు. అల్లాగ్గా, పోనీ చెప్పేదీ అప్పటి శ్రావ్యతే గాని ప్రజ్ఞ కాదు. అయినా ప్రజ్ఞ, పాండిత్యమూ, తరిఫీయతూ, కృషీ, ఈర్ష్యా, ఇంకా ఏమైనాసరే శ్రావ్యతను తీసుకు రాలేవు అని చెప్పడానికేకదా సూరన్న కథ రాశాడు! తిరిగితిరిగి, చివరికి చిరకాలం శ్రీకృష్ణకుటుంబందగ్గర శిక్షపొంది, ఎల్లాగైనాసరే తుంబురుణ్ణి నెగ్గాలని, నారదుడు బయల్దేరి, తుంబురుడి గ్రామం వెళ్లి తుంబురుడు తను తనవాయింపుకోసం అప్పుడే మేళవించుకున్న వీణ పీఠరుసుమీద పెట్టి పముండి ఒక్కసారి ఇంట్లోకి వెళ్లిన దోసందులో దైవాద్యా అతని అరుగు సమీపించి, అక్కడున్న వీణని ఓమాటు వేళ్లతో అనిపించిచూసి, ఆకీతిగా శ్రుతి భిగించడానికే తనకి అనేకజన్మలు పట్ట వచ్చునని గ్రహించి సిగ్గువదిలేసినవాడు కాకపోవడంవల్ల వీణ అక్కడ వదిలేసి, మరి తుంబురుడు ఇంట్లోంచి పైకిరాకుండా చూసుకుని, కాలికి బుద్ధిచెప్పి రోడ్డుచ్చుకున్నాడట! శ్రుతి అంతటి దయినా, కొన్ని గానాల్లో (అపశ్రుతి రాకుండా ఉండడానికట!) అసలు శ్రుతి లాగేశారు. మరికొన్నింటిలో శ్రుతివుందా లేదా అనిపించే టట్టు గొంతిక పిసికేస్తారు. 'శ్రుతి'అనేమాట మామూలు సంభాషణలో పైఅర్థంలో, అనగా గానానికి పునాదిగా ఉండగల శ్రావ్యనాదసంపుటి అనే అర్థంలో వాడతారు. కాని, పండితులు అల్లా అనరు. నాదం వాయుకణాల స్పందన మేగనక, స్పందనవిస్తీర్ణముబట్టి ఉండే జిగీ, స్పందనసంఖ్యనిబట్టి ఉండే స్థాయీ, స్పందన వైఖరినిబట్టి ఉండే వ్యక్తిత్వం — ఈమూడూ గల నాదాన్ని శ్రుతి అంటారు. అటువంటి శ్రుతికిదేనికైనా రెట్టింపుస్పందనసంఖ్య గలది హెచ్చుశ్రుతి. అటువంటి రెండుశ్రుతుల మధ్య ఉండగల నాదరంగం ఒకఅష్టకం అంటారు. దాన్లో మూలశ్రుతికి ఒకటిన్నర రెట్లు స్పందనసంఖ్యగల శ్రుతిని పంచమం అంటారు. ఇటువంటి గణితవ్యాపారంమాత్రమే ప్రపంచంలోని అన్ని జాతులవారి గానానికీ ఉమ్మడి. గణితపరమార్థం ప్రపంచంలో అందరికీ ఒకటే అయినా, మానాలూ, ప్రమాణాలూ, పరిమాణాలూ, సందర్భాలూ, అవసరాలూ, సంప్రదాయాలూ, సామగ్రులూ, కలాపాలూ, కొండలూ — వీటి అన్నిటిమీదా ఆధారపడి ఉండడం వల్ల గణితఫలితాలు వేర్వేరు అయినట్టే, పురుషార్థాలు తుల్యమైనా ఫలితాలు వేర్వేరు అయినట్టే గానఫలితాలుకూడాను! ప్రపంచగానంలో స — ప — సలు ఉమ్మడి కావచ్చు. ఒకే నాదాష్టకంలోని నాదాన్ని కొందరు ఎనిమిది శ్రుతులుగా, కొందరు పన్నెండు శ్రుతులుగా, కొందరు ఇరవై రెండుశ్రుతులుగా, కొందరు అసంఖ్యాకమైన శ్రుతులుగా కేటాయించుకున్నారు. రెండు పూర్ణాంకాలమధ్య అనంతమైన భిన్నాంకాలు ఉన్నట్టుగానే నిర్ణీతమైన రెండు శ్రుతుల సందున భిన్నశ్రుతులు ఉండగలవని గ్రహించారు. పైపై స్థాయిల్లో శ్రుతులు వ్యష్టిఅయినా, లోస్థాయిలో శ్రుతులన్నీ సమిష్టిశ్రుతులని నిరూపించారు. ఒక్కొక్కశ్రుతిలోనే రెండుమొదలు ఇరవై వరకూ అంతరశ్రుతు లుండవచ్చునన్నారు. వీటి సంఖ్యనుబట్టీ, క్రమాన్నిబట్టీ, ఊతాన్నిబట్టీ నాదంయొక్క విశిష్టత ఏర్పడుతుందని స్థాపించి, ఆరకాలు లక్షలాదిగా ఉంటాయని ప్రస్తరించి చూపించారు. లెఖ్ఖల్లో ఇటువంటి తేడా లుండవచ్చు గనక, అలవాటు, ఆచారం, ఆదరణ, అనుకరణ, అభిలాష, అభిరుచివంటివి సర్వసమం కాకపోవచ్చు గనక ఒకజాతికి శ్రుతి తియ్యంగా ఉండే నాదం మరో జాతికి కర్ణకఠోరంగా ఉండవచ్చు! ఒకజాతి గానం మరొకజాతికి రణగొణధ్వని కావచ్చు. పోనీ గానానికి అభినయం ఏమున్నా అక్కరకొస్తుందేమో అంటే, అది ఉన్న మతికూడా ఊడగొట్టేస్తుంది. పాశ్చాత్యుల గానం

కర్ణవిదారక కోలాహలం అని కొందరు ప్రాచ్యు లంటారు; ప్రాచ్యుల గానం ఒంటిమనిషి కసరత్ కుస్తీ అని ప్రాచ్యులు మెచ్చుకున్నారు. ఎవరి దృష్టి వారిది. కొందరికి నాదంయొక్క తూనిక ప్రధానం, కొందరికి స్వరం ప్రధానం, కొందరికి శ్రుతి ప్రధానం, కొందరికి లయ చాలు కడంవి వచ్చినాసరే, కొందరికి పీక ప్రధానం, కొందరికి సమ్మేళన ప్రధానం! ఒకరిలో ప్రత్యేక గాత్రవ్యవసాయజనక నాదమే గానం! ఇంకొకరిలో ఏకకాలంలోనే జంత్రగాత్రాల సంపూర్ణ విశేషమే సరియైన నాదం! జంత్రాలు మొదట కర్ర తోగాని, చేత్తోగాని, వేళ్లతోగాని వాకేవి, తరవాత నోటితో ఊదేవి, తరవాత వీటికే ఊగే తంత్రులవీ జనించాయని ఒక జ్ఞాని అన్నాడు. మరికొందరిలో అనేకులు - ఒక్కొక్కప్పుడు వెయ్యికంటే ఎక్కువ మంది-ఉండి ఎవరి వేర్వేరుపని వారు చేస్తూ ఆగగా, మరొకరు నాదవిచ్ఛిన్నం రానీకుండా అందుకుని పని చూపి అన్యుడికి అందియ్యగా, ఈరీతిగా ఉత్పన్నమయ్యే వివిధనాదఖండాలు ఏకరూపందాల్చి మహాసమ్మేళనంగా అయేటట్టు చెయ్యడానికి పూచీపడే తోడకుడి కను సన్నల్లో అంతమందీ మెలుకువతో సృష్టించేదే గానం! మరికొందరు జ్ఞానుల్లో, శ్రుతిసంకేతాక్షర స్వర వ్యవసాయనాదమే గానం! కొందరిలో దెబ్బెట్టి కొను క్కొగా చెవిని పడ్డ నాదాలన్నీ గానాలే! ఒక్కొక్క సంఘం ఉద్దేశంలో సుందరవిగ్రహం గల వ్యక్తి రచించిన నాదమే గానం. మరొకసంఘంలో స్వపరిచిత పదమధ్యవర్తినాదమే గానం. ఒక్కొక్క తెగలో, నిర్దిష్టకార్యానుక్రమణికలో వచ్చే నాదంతప్ప కడంది యావత్తూ గానమే! కొందరి మతంలో తమరు ఎప్పుడో పూర్వం మనస్సులో ఏర్పరచుకున్న నాదప్రమాణం చేరువకి వచ్చే నాదంమాత్రమే గానంగనక, అది మళ్లీ కలగడం అసంభవం గనక, చెవిని పడడానికి సాధ్యం అయింది తప్ప మిగిలింది ఏమున్నా ఉంటే అదీ గానం!

ఏ యితర భౌతికపదార్థంయొక్క అవసరమూ లేకుండానే మానవుడు సృజించగలిగింది నాదకళ ఒకటేగనక, గానం అమూల్యం. గానవ్యాపారం ఏమిటంటే నచ్చడమే. నచ్చితే ఎందుకు నచ్చిందో చెప్పడానికి వీలులేదు, అడగడానికి లేదు. గానంలో మధ్యే రంగం లేదు. "పెడితే పెళ్లి లేకపోతే శార్ధం" మోస్తరు నచ్చినా ఒకలిప్తలోనే, మళ్లీ తరవాత ఏమవుతుందో అనే కదా సభ్యులు అల్లాటి ముహూర్తాల్లో పరస్పర ముఖావలోకనం చేసుకోడం. వినడానికి జనం లేనప్పుడు బయల్దేరే ప్రతీనాదమూ గానమే. ఒకచోట చేరిన జనం అందరూ కలిసి రచించే నాదం, మరో మోస్తరుగా ఉండనడానికి ఇతరుడే ఉండడుగనక, గానమే. పరిచయసానుభూతుల వాతావరణంలో గాని గానం వృద్ధిచెందదు. "కానీవోయ్, నేను మెచ్చుకుంటున్నాను" అనే అనుకూల్యం వినేవాళ్లదగ్గిర్నించి ఎప్పటికప్పుడు సూచించే చిన్నె లంటే తప్ప గానం చేసేవాడు సాగలేడు. అందుకనే కొందరు గాయకులు తమరు పరిచితసభ్యులతో కూడిన సభయెదుట ముఖాముఖిగా పాడడానికి అచ్చుకున్నప్పుడు (ఇటువంటి అవస్థ అదృష్టవశంచేత యంత్రాధీనమైన వెండితెర గాయకులకీ, మైక్ గాయకులకీ తొలగిపోయింది, పాపం, ఎక్కడికక్కడికే! ఇది వాళ్ల ప్రమేయం కాదు!) ఎటు పోయి ఎటు వస్తుందో అని చెప్పి, తమరు పాడడం మొదలెట్టిందిలగాయతు "ఆహా, బలే, అచ్ఛా, భేష్, వారెవా, ఓ.హో" అంటూ మెప్పులు నిశ్వాసానికోసారి చొప్పున విసిరేనిమిత్తం జీతంయిచ్చి ఒకణ్ణి పెట్టుకుని, వాణ్ణి ఎదురుగుండా కూచోపెట్టుకుని, మరీ మొదలుపెడతారట! అపరిచితగానం చిన్నమోతాదుల్లో మాత్రమే కొద్దిమందిమాత్రమే తట్టుకోగలరు. గానం శూన్యరాశి. అపరిచిత శూన్యంకంటె పరిచితశూన్యం నయంకదా అనిన్నీ, అదేనా తాను సృష్టించుకోలేకపోడంవల్లనున్నూ గాయకుడనేవాడు స్వయంగా తననిమిత్తం దాన్ని సృష్టించిపెడుతూంటే తను తల ఆడించుకుంటూ, తాళం వేసుకుంటూ, తనవల్లే అది సృష్టింపబడుతోందా అన్నంత కర్తృత్వం ఆక్షణంలో తనుగూడా ఆరోపించుకుంటూ, కుదిరితే గనక అది వీలైనంతమట్టుక తన పేరటే జమకట్టుకుంటూఉండడానికి వీలుంటుంది గదా అనిన్నీ మానవుడు గానం వినడానికి వెళ్లడం. పరాయిగానం యావత్తూ శుద్ధగందరగోళం అని చెప్పడంఅంత తేలిక అదేగాని రెండోది లేదు. ఎందుచేత అనగా, శుద్ధగానం దేవుడులాంటి అగమ్యత్వంతో

చూడిన వాయుతరంగంగనక! గానానికి అర్థం మానవులకి దుర్గమం. గానార్థం ఎవరూ అడగరు, ఎవడికీ తెలియదు. విచారకరమైన గానం వినబడేటప్పుడు ఇతర హృదయాల్లో విచారం ఉదయించవచ్చుగాని "ఎంతపని జరిగింది!" అని ముక్కుమీద వేలేసుకోడానికి బోధపడేది ఏమీ ఉండదు. ఒక్కొక్క గానానికి మనం ఆవేశపులం కావచ్చుగాని ఎందుకో తెలియదు. పైగా, విచారం అనేకరకాలుగా కలగవచ్చు విన్నవాళ్లల్లో. కాని ఆ విచారాల భేదం ఏమిటో తెలియదు. గాయకుడికీ తెలియదు. గానఫలితంగా విచారం, క్రోధం, కరుణ, హాస్యం మొదలైనవి ఏమిఉన్నా వాటిని ఆవరించి ఆనందం ఉండితీరుతుంది. గానం ఆకర్షించే నాదం! ఎవర్ని ఆకర్షించడం? ప్రాణికోటినీ, ఇతరాల్నీ — తనతో ప్రారంభించి వీలైనంతమంది ఇతరమానవుల్నీ, వీలుగా ఉంటే పశుపక్షుల్నీ క్రిమికీటాల్నీ, తీరుబడి ఇంకా ఉంటే జడాల్నీ! అందుకని గానం చరాచర కోటికి ఉమ్మడిలక్షణం. "పికః కూజతి పంచమం" లాంటివి అందువల్లే పుట్టిఉంటాయి. అందుకనే "నాగస్వరం పడితే నాగులకు నిద్ర" అని వచ్చింది. అనగా, గానంమూలాన్ని పాములు నిద్దరోయి సుర్రుకొడతాయని కాదు; అవి చక్షుశ్శ్రవాలుగనక, అదివరదాకా కళ్లలాగ పనిచేసే రంధ్రాలు గానం తమమీద పడ్డప్పుడు చెవులులాగ మారిపోవడంవల్ల పాముకి గానావరణంలో అంధత్వం వస్తుంది అని. "ఏకే తెల్లవాళ్లకి గానం అనేది ఉండిపోయేద్, అసలు, మనికిమల్లే!" అని ప్రశ్నించే తెలుసువాళ్లున్నారు. అంతేగాని, తెల్లవాళ్లకి కవిత్వం ఉందా అనిగాని, శిల్పం ఉందా అనిగాని, చిత్రకళ ఉందా అనికాని శంకించరు, అడగరు. ఎందుచేత అంటే, తక్కిన కళలన్నీ (లిపిధర్మమూ అని కవనంకూడా) కంటపడగల రూపం దాల్చగలవ్, గానం దాల్చలేదు. గానానికి రూపం ఎప్పటికప్పుడు కల్పించాలి, కల్పించేవాడే యివ్వాలి, కల్పించిన క్షణంలో తప్ప దానికి జన్మలేదు. గానం కాలనిగళబద్ధం. అందువల్ల గానం అంటే కాలయవనికమీద చిత్రింపబడి వినపడే బొమ్మ అన్నాడు ఒక జ్ఞాని. గానానికి పుట్టగానే యవ్వనం, మృతి! తక్షణంలో పోవడంవల్ల దానికి వయస్సూ లేదు, జరా లేదు. అందుచేత గానం గాంధర్వవిద్య! గానం బతికున్నవాళ్లని కట్టెలుగా చేసి, కట్టెలకి జీవం పోసి, చేతనాచేతనాలకి పరిహద్దులు కొట్టేస్తుంది. గానం మానవులలోని దివ్యాంశకు ఉచ్చారణ. గానం నాదం స్వయంగా చెయ్యగల రూపాల్నే గాక తక్కిన రూపాల్నికూడా ఐక్యంచేసి జగదాధారుడిలో లీనం చెయ్యగల సానందసాధనం! గానం మానవాతీతమైన భావరసయుతం. మానవుల్లోని జాతిమతవయస్సంస్కారాది భేదాలేకాదు, జీవుల్లోని పక్షివృక్షజంతుమానవక్రిమికీటాది భేదాలేకాదు, రూపాల్లోని చరాచర భేదాలేకాదు, భూతాల్లోని ఘనద్రవాది భేదాలేకాదు — అన్నీకూడా భ్రమజన్యాలు కావు యథార్థంగానే ఉన్నాయనేవాళ్ల మూర్ఖ్యం వదలగొట్టేనిమిత్తం "కావలిస్తే ప్రత్యక్ష నిదర్శనంగా అధమం నేనున్నాను సుమండీ" అని లోకాంతరసీమనించి మానవులకి వినబడే హెచ్చరిక గానం! మానవహృదయంలోని ఉద్రేకాన్ని వీలైనంత సున్నితంగా విరివిగా ఉచ్చరించడానికి వాయువేగం గల బ్రహ్మవిద్య గానం ఒకటే! వ్యాఖ్యానంగాని, మధ్యవర్తిత్వంగాని, సిఫారసుగాని, మెజారిటీవోటుగాని, తన్నగల బెదిరింపుగాని లేకుండానే మానవులకి ఏ వృత్తాంతం తెలపకుండానే హృదయచలనం కలిగించగలిగింది గానమే! నిర్గుణం, అవ్యక్తం, అతీతం, అపరిమితం అని మనం రొంచే వాచామగోచరభావాన్ని అర్థరీతిగా పూజించడానికి శబ్దకలవర్ణాదిసాధనాలు చాలకపోవడంవల్ల మానవులు అవలంబించే దివ్యమధుర నాదబిందుపథం గానం!

ఇక తెలుగుజాతిని తలుచుకుంటే, దేవాలయాలలో ఉండవలిసిన పవిత్రగానం; భజనాదులలోని భక్తియుత గానం; వివాహాదులలోని ఆనందోత్సాహ పూర్వక గానం; రాజ్యాంగాల్లోని రణరంగగానం, ఆహ్వాన గానం, ప్రభాతగానం; ప్రార్థనలలోని హృదయపూర్వక గానం; కర్షకాదుల శ్రమోపశమనకర గానం; మిత్రుల జీవాందోళనగానం; సంఘంలోని చలన చర్మ చిత్రవిషయంలో, పురాణపఠన కాలంలో, హరికథ సమయంలో, నాటకాటంకాలల్లో పుట్టే గానం; వేడుకగానం — ఇల్లాగ్గా చాలా సందర్భాల్లో వినిపి

స్తూంటుంది. లాలిపాటలు, మేలుకొలుపులు, మంగళ హారతులు, జావళీలు, భజనకీర్తనలు, ఊడుపుపాటలు, కల్లుపాటలు (నేలంపాటలు కాదుసుమండి!), ఆటపాటలు"—వీటిల్లో తెలుగుజాతిని ప్రతిబింబింప జేసే అఖండికవిత్వమే ఉందని మహాంధ్రులిద్దరు సెలవిచ్చారు. వీటిల్లో తెలుగుజాతిని సూచించే గానం లేదని ఎవరు పరిష్కరించగలరు! కాని, ఏమిటో! గానం అవ్యక్తమాన్యం! అన్నట్టు, గానాన్ని మాటల్లో చెప్పడానికి ప్రయత్నించడం వ్యర్థం కదా! మరి ఉంటాను.

---

# కొన్ని సూక్తులు



ఉత్తముండు పెట్టు బాధల కోర్చియున్న
నతనివల్లనె సౌఖ్యంబు లందవచ్చు,
వేసవిని వేఁచుకొనితిన్న వేవెలుంగ
జీవనం బిచ్చి సుఖపెట్టు జీవకోటి.

అరయ గంభీరుఁ డొనరించునట్టి యూవి
తెలియరాకుండ సుఖముఁ దేల్చుచుండు
స్నాన పానాదులకుఁగాని సాగరుండె
సకల జలసౌఖ్యవిధులను జరుపుచుండె.

ఎవ్వఁ డేవృత్తిలో జెట్టిగొత్తి తిరుగు
వాఁడె యావృత్తిలోఁ దుద కణఁగిపోవు,
క్షత్రియులఁ గొట్టికొట్టి భార్గవుఁడు తుదకు
క్షత్రియునిచేత గర్వభంగంబు గనఁడె?

తలఁప మెత్తనివారు శిష్టులను మించి
దుష్టులను గౌరవింతు రెందును నిజంబు,
గంధ మొక్కింత యనిలుని కంటఁ బెట్టి
పూలు రసమెల్ల మధుపాళిపొట్టఁ బెట్టు.

మల్లాది సూర్యనారాయణశాస్త్రి.

---

# కళాపూర్ణోదయమూలము లింగపురాణము

= శ్రీ దుప్పూరి వెంకటరమణశాస్త్రి =

కల్పనా వైచిత్రిని బట్టియుఁ, కవితాలాలిత్యమును బట్టియుఁ గళాపూర్ణోదయము మన యాంధ్ర ప్రబంధములం దెల్ల నుత్తమస్థాన మలంకరించియున్నదనుట సర్వసంప్రతిపన్నము. సాహితీరసజ్ఞులు కొందఱు దీనిని సాకల్యముగ విమర్శించి యిందలి గుణవిశేషములను, దీని విశిష్టతను విపులముగా విశదీకరించి యున్నారు. అట్టివారిలో శ్రీయుతులు రామలింగారెడ్డిగా రగ్రగణ్యులు. కాలము గడచినకొలఁది యీప్రబంధరాజమునకుఁ జాకలలోకమున వ్యాప్తియు సర్వతోముఖ మగుచున్నది. సూరనార్యుఁడు తన కావ్యరత్నమున సరస్వతీచతుర్ముఖులను బాత్రములుగా నచుర్చుకొని వారిని రంగభూమి కెక్కించి తాను వారి మఱుఁగున దాఁగొని "ఈకత ప్రకాశిత మాట నీమదిఁ గాంక్షితంబ యశక్యముఁ" (౨-౮౧), "అకళాపూర్ణ మహారాజు కథ...కరము ప్రసిద్ధంబు గాఁగలయది" (౨-౮౩) అనుచు వారి సల్లాపంబులు సాగించి ప్రాసంగికములును, సరసములును నగు వారి పలుకుల మూలమునఁ దన యభిలాషమును నిగూఢముగా వెలువరించినాఁడా యని స్ఫురించెడిని. ఆయభిలాషము నైసర్గికము; అభివందనీయము. రసికలోకము నానందాశ్చర్య రసకల్లోలమాలాడోలికల నోలలాడింపఁజాలు విచిత్రకథను సృజింపఁగలిగిన యీ ప్రతిభాశాలి మనోరథము సఫలమగుటయు వింతకాదు. ఇతివృత్త కల్పనాపటుత్వము, ప్రాసంగిక కథా సంయోజన నైపుణి, నిరంతర కథావధానకౌశలము, పాత్రపోషణచాతురి, పాత్రభావన లాలిత్యము, రసస్ఫురణ నైశిత్యము, లోక నిసర్గపరిశీలన పాటవము, ఉపపత్తి ప్రదర్శన జాగరూకత, పదగుంఫనమార్దవము, ఉపక్రమోపసంహారరమణీయత మున్నగు నెన్నియో విశేషములకు - రసజ్ఞలోక ప్రశంసనీయములకుఁ దావలమైన యీ ప్రబంధరాజమునకుఁ బ్రసిద్ధి గలుగుట యబ్బురము కాదు. అది యటుండనిండు.

ప్రకృతము - కళాపూర్ణోదయమునందలి యంశములెల్లను కేవల కల్పితములా, లేక సమూలములా అను నది మనకు విచారణీయము.

ఈప్రబంధమునఁ గలభాషిణీ చరితమునందలి భాగములకెల్ల నారదగానాభ్యాస ప్రకరణమే మూల మనఁదగియున్నది. కలభాషిణీచరితము ప్రబంధమున నాలుగాశ్వాసము లావరించియున్నది. నారదుఁడు తుంబురుని జయించు పూనికతో గానాభ్యాసమునకై ద్వారకకుఁ బోవుట, అతఁడు సంకల్పించిన రంభాగర్వభంగమునకుఁ గలభాషిణి సాధన మగుట అను నీ యంశములపై మొదటి నాలుగాశ్వాసముల చరితము నాధారపడియున్నది.

ఒకప్పుడు విష్ణువు తన కొలువున నారదాదుల నాదరింపక దూరీకరించి తుంబురుని బిలిపించి లక్ష్మియుం, దాను నాతని గానము నాలకించుట, దానిని మెచ్చి యాతనిని సవిశేషముగ సత్కరించుట, దాని వలన నారదుఁడు సిగ్గువడి తాను గానమున విష్ణుని మెప్పునందఁగోరి తుంబురుని జయించు పూనికతో నసాధారణగాననైపుణీసంపాదనమునకై చిరకాలము తపం బాచరించుట, గానవిద్యామహితు లున్న తావులకెల్ల జేరి వేయివత్సరంబులు గాన మభ్యసించుట,

విష్ణుసన్నిధి కేఁగి గానముసేయుట, అప్పటికిని తుంబురునితో నీడుగాఁడవై విష్ణువలన నెఱుంగుట, ద్వాపరయుగంబునఁ గృష్ణావతారంబునఁ దగిన శిక్ష నొసంగి నీవు తుంబురుని జయించునట్లు గావింతు ననియు, నంతదనుక దేవగంధర్వాదులయొద్ద నభిరీతి నభ్యసించుచుండు మనియు నారదునికి విష్ణు వానతిచ్చుట, పిమ్మట నారదుఁ డెందఱకో శుశ్రూష గావించి యెన్నియో పాట్లు పడుట, ఒక్కనాఁడు తుంబురు నింటి కేఁగి యాతని వీణ పలికించి యాశ్రుతుల చెంపు తన కందరాక యుండుటం జేసి లజ్జించి పశ్చాత్తాపముగాఁ దిరిగివచ్చుట, తుదికి విష్ణువునాదేశము చొప్పున ద్వాపరమున ద్వారకలో శ్రీకృష్ణునికడ కేఁగుట, జాంబవతీసత్యారుక్మిణులవద్దను, శ్రీకృష్ణునొద్దను విద్య నభ్యసించుట, చివరకుఁ దుంబురునికంటెను నధికుఁడగుట అను నీయంశములెల్ల లింగపురాణమున నుత్తరభాగమునఁ దొలుతటి మూఁడధ్యాయములలోఁ దేటతెల్లముగాఁ గానవచ్చుచున్నవి. ఈ భాగమునంతను నల్పమగు మార్పుతో, నధికమగు లాలిత్యముతో, నమేయమగు స్వాభావికతతో, నమితమగు దీప్తితో మిలమిల మెఱయునట్లు సూరనార్యుఁ డాంధ్రీకరించియుండెను. మూలానువాదముల సంబంధము తేటపడుటకై యా భాగములను శక్యమగునంత సంగ్రహించి యిటఁ జూపుదును. గ్రంథవిస్తరమును గణింపక పరిశీలింపుఁడు.

[లింగపురాణము, ఉ. భా. i ౪౩-౪౫]

"తత్ర నారాయణో దేవః శ్వేతద్వీపనివాసిభిః,
జ్ఞానయోగేశ్వరైస్సిద్ధైః విష్ణుభక్తైస్సమాహితైః.
నారాయణసమైర్దివ్యైః చతుర్బాహుధరైశ్శుభైః,
విష్ణుచిహ్నసమాపన్నైః దీప్యమానైరకల్మషైః.
అష్టాశీతిసహస్రైశ్చ సేవ్యమానో మహాజనైః,
అస్మాభిర్నారదాద్యైశ్చ సనకాద్యైరకల్మషైః.
భూషైర్నానావిధైశ్చైవ దివ్యస్త్రీభిస్సమంతతః,
సేవ్యమానోథ మధ్యేవై సహస్రద్వారసంవృతే.
సహస్రయోజనాయామే దివ్యే మణిమయే శుభే,
విమానే విమలే చిత్రే భద్రపీఠాసనే హరిః.
లోకకార్యప్రసక్తానాం దత్తదృష్టిశ్చ మానవః"

[కళాపూర్ణోదయము, ౨—౨౭-౩౫]

"వైకుంఠంబున నొక్కనాఁ డకులితై
శ్వర్యుండు విష్ణుండు నా
శీకప్రోద్భవముఖ్య దేవగణముల్
సేవింప యోగీశ్వరా
నీకంబుల్ నిగమాంతమూర్తులను వ
ర్ణింపంగ నొడ్డోలగం
బై కూర్చుండె మహాసభన్ సదరవ
ద్వ్యాపారపారీణుఁడై.

కౌండిన్యాత్రి మరీచిదక్షకపిలా
గస్త్యాక్షపాదాంగిర
శ్శాండిల్యక్రతుకణ్వకుత్సభృగువి
శ్వామిత్రమైత్రేయమా
ర్కండేయాసురివామదేవకపిశ
ర్వాసోబకవ్యాఘ్రపా
న్మాండవ్యాదిమహామునుల్ చనిరి ప్రే
మన్మ్రొక్కఁ దత్సేవకున్.

వ. ఇవ్విధంబున దేవముని సంఘంబులు వచ్చి సేవింప విష్వక్సేనుండు వేత్రహస్తుండు నగుచు నందఱ నెడగలుగ జడియుచు బరాబరి యొనరింప దివ్యనారాంగనానాట్యంబు లవలోకించుచు నద్దేవదేవుండు పేరోలగమ్మున నున్న సమయంబున—"

[లింగపురాణము, ఉ.భా. i ౨౮-౩౧]

"తస్మిన్ క్షణే సమాపన్నా సుఘోరాక్షరపేశలైః,
విపంచీగుణతత్త్వజ్ఞైః వాద్యవిద్యావిశారదైః.
మందం మందస్మితా దేవీ విచిత్రాభరణాన్వితా,
గాయమానా సమాయాతా లక్ష్మీర్విష్ణుపరిగ్రహా.
వృతా సహస్రకోటీభిః అంగనాభిస్సమంతతః,
తతో గణాధిపా దృష్ట్వా ధుసుంధీపరిఘాయుతాః.
బ్రహ్మాదీన్ తర్జయంతస్తే మునీన్ దేవాన్ సమంతతః,
ఉత్సారయంత స్సంహృష్టాధిక్షితాః పర్వతోపమాః.
సర్వే వయం హి నిర్యాతాః సార్థం వై బ్రహ్మణా సురైః"

[కళాపూర్ణోదయము, ౨—౯౯-౭౧]

"వారిదపంక్తిలో వెడలి
వచ్చు మెఱుంగులపిండు నా సఖీ

వారముతో రమారమణి
వచ్చును హెగ్గడికత్తె లెండఁటోఁ
గోరి భజింప నా కొలువు
కూటముపుండఁటవంక చొప్పడిం
గారపుఁదోఁటనుండి యధి
కంబగు వైభవ మింపుమీఱఁగన్.

(నెచ్చెలిపిండుఁ దానును వ
నిస్థలి దండ నొకింత గానఁగా
వచ్చెనొ రాదొ యాకమల
వాసిని యంతనె యేమి చెప్పవచ్చున్
హెచ్చిన సంభ్రమంబున న
నేసులు బద్దలవార లెక్కడన్
వచ్చిరొ మోవి రాఁ గొలువు
వారిఁ గకాపికలై చనన్ వడిన్.

అప్పుడు మముబోంట్ల కతల్
చెప్పఁగ నేమిటికిఁ దారసిలి వేత్రధరుల్
రొప్పఁగఁ జనిరొ న్నిలుకక
యప్పర మేష్ఠియును నచటి కతిమూరమునన్."

[లింగపురాణము, ఉ. భా. ౹ ౬౨-౫౧]

"తస్మిన్ క్షణే సమాహూతః తుంబురు ర్మునిసత్తమః,
ప్రవివేశ సమీపం తౌ దేవ్యా దేవస్య చైవహి.
తత్రాసీనో యథాయోగం నానామూర్ఛనసమన్వితమ్,
జగౌ కలపదం హృష్టో విపంచీం వాద్య వాదయన్.
నానారత్న సమాయుక్తైః దివ్యై రాభరణోత్తమైః,
దివ్యమాల్యై స్తథా శుభ్రైః పూజితో మునిసత్తమః.
నిర్గత స్తుంబురు హృష్టః అన్యేచ ఋషయ స్సురాః,
దృష్ట్వా సంపూజితం యాంతం యథాయోగ మరిందమ.
నారదో థ మునిర్దృష్ట్వా తుంబురో స్సత్క్రియాం హరేః,
శోకావిష్టేన మనసా సంతప్త హృదయో భృశః.
చింతయా మాసదివాన్ తత్ర శోక మూర్ఛాకులాత్మకః,
కేనాహం హి హరే ర్యస్య యోగం దేవీ సమీపతః.
అహో తుంబురుణా ప్రాప్తం ధిక్ష్మాం మాఘం విచేతి
సమ్,
యోహం హరే స్సన్నికాశం భూత్యై ర్ని ర్యాతితః కథమ్.
జీవన్ యాస్యామి కుత్రాహ మహో తుంబురుణాకృతమ్,
ఇతి సంచింత్య స్వప్రః తప ఆస్థితా స్మునిః.
దివ్యం వర్ష సహస్రంతు నిరుచ్ఛ్వాసపరమన్వితః,
ధ్యాయ న్విష్ణు మథాధ్యాస్తే తుంబురో స్సత్క్రియాం
స్మరన్.
రోదమానో ముహు ర్విద్వాన్ ధిక్ష్మామితి విచింతయన్"
"స్కంధే విపంచీ మాసాద్య సర్వలోకాం శ్చచార సః"
(౩-౮౪)

[కళాపూర్ణోదయము]

"అతఁడిని వేత్రహస్తు లో
హో తుంబురుఁడా యటంచు నచ్చైస్స్వర ము
ద్ఘోషింపఁ బిల్చి క్రమ్మఱి
నాతనిఁదోడ్కొనుచుఁబోయి రతివేగమునన్.(౨-౬౨)

వ. అట్లు దోడ్కొనిపోవుచుండ— (౨-౬౩)

అప్పుడు నేను నావనము
నం దితనిం బిలిపించు టెట్లొకో
యిప్పుడటంచు నిల్చి యర
యింప వినంబడియె న్నిజంబుగా
నప్పురుషోత్తముండు దన
యంగనతో వినుచున్నవాఁడు సొం
పొప్పఁ దదీయ గాన మని
యొద్దఁజరించెడివారు చెప్పఁగన్.(౨-౬౪)

మమ్మెల్లఁ దోలి యొక్కని
నిమ్మెయిఁ బిలిపించి హరియు నిందిరయుఁ గడున్
సమ్మదమునఁ దుంబురుగా
నమ్మను వినుచునికివిని మనం బెరియంగన్.(౨-౬౬)

అని పెవా రేమిచ్చె ననుచును సంభ్రమం
బున పందడించుచు మాఁగువారు
సర్వేశ్వరుండు శ్రీసతితోడ గానంబు
వినుట యదుగ నేల యనెడువారు
కడునను గ్రహము సెక్కడలేని యీయోగి
పసయ దెల్పెడు నంచుఁ బలుకువారు
నీవొక్కఁడవొ మఱి యేవారలైన న
ర్హ్యోడ నుండిరో యని యడుగువారు
ననుచు సురలు మునులు నరుదంద పేర్పాఁత
డంబుతోడ వచ్చెఁ దుంబురుండు
కడలవారిని గనకస్నాన మాడించు
పడకమును సునేత్రపటము దాల్చి. (౨-౭౬)

ధగధగయను పదకంబున
నిగనిగయను క్రొమ్మెఱుంగు చేలపటమునన్
భుగభుగయను మేపూఁతన్
ధగధగ యనిపించె నతఁడు నాహృదయంబున్. (౨-౬౯)
నాకంటెఁ దాను ఘనుఁడే
యాకోలఁదిరయు బయలు నేయునంతకు నేయే
పోకలఁ బోయినఁ బోని
మ్మీకరణిం జుణీఁపోవనిత్తునె వీనిన్. (౨-౭౦)
వ. అని యాగ్రహించుచు నతనితోడ సెందే
నియు వారు వెట్టుకొని భంగపడిచి యతులితంబైన
మదీయసంగీతచాతుర్యంబువార్తలు క్రమంబున నిజ్జగ
న్నాయకునకు వినంబడునట్టి యుపాయంబు వెట్టెదం
గాక యని యూహించి... (౨-౭౧)
వ.... నేను నదిమొదలు గాఁగ నెక్కడెక్కడ
నక్కజపు గానవిద్యగలవారు గలరు వారి నరసియరసి
తద్విద్య సాధించుచు నెందునుం దుంబురునకు నీడుగాఁ
జాలమి నెనెనెడం బరికించుచుం బెద్దకాలంబు ప్రవ
ర్తిల్లి యీమనోరథంబు సర్వజ్ఞుండైన పుండరీకాక్షుని
యనుగ్రహంబునం గాని ఫలింపనేరదని నిశ్చయించి
తద్దేవునింగూర్చి చిరకాలంబు దపంబొనర్చితి..."
(౨-౮౧)

[లింగపురాణము, ఉ. భా. iii ౬౭-౭౨]
"తత్ర శ్రుత్వాథ భగవా న్నారదం ప్రాహ మాధవః,
తుంబురో ర్నవిశిష్టోసి గీతై రద్యాపి నారద.
యదా విశిష్టో భవితా తం కాలం ప్రవదా మ్యహమ్,
గానబంధుం సమాసాద్య గానార్థజ్ఞో భవా నసి.
మనో ర్వైవస్వతస్యాహ మష్టావింశతిమే యుగే,
ద్వాపరాంతే భవిష్యామి యదువంశసముద్భవః.
దేవక్యాం వసుదేవస్య కృష్ణో నామ్నా మహామతే!
తదానీం మాం సమాసాద్య స్మారయేథా యథాతథమ్.
తత్ర త్వాం గీతసంపన్నం కరిష్యామి మహావ్రతమ్,
తుంబురోశ్చ సమం చైవ తథాతిశయసంయుతమ్.
తావత్కాలం యథాయోగం దేవగంధర్వయోనిషు,
శిక్షయస్వ యథాన్యాయ మిత్యు క్త్వాంతరధీయత."

[కళాపూర్ణోదయము]
"శంఖచక్రాదిపరికరసహితుఁ డనుచు
మఘవముఖదేవతాసేవ్యమానుఁ డనుచుఁ
బతగరాజాధిరోహణోద్భాసి యనుచుఁ
గృప దలిర్పంగఁ గాన్పించెఁ గేశవుండు. (౨-౮౨)
కానుపించి యేమి కావలయును వరం
బడుగు మనిన నేను నాత్మలోని
కోలఁది నతులు నుతులు సలిపి తుంబురు గాన
కలనవలన గెలువవలయు నంటి. (౨-౮౩)

అనుటయు నన్నుఁ జూచి కృప
నచ్యుతుఁ డిట్లను నేను ద్వాపరం
బున వసుదేవనామునకుఁ
బుత్రుఁడనై యుదయించు శిష్టపా
లనము దుష్టశిక్షయు ని
లాస్థలిఁ బ్రోవఁగ నప్డు ద్వారకా
ఖ్యనగరియందు నీ కభిమ
తార్థ మొనర్చెద రమ్ము నాఁటికిన్. (౨-౮౪)
అని యంతర్థానము నొం
దినఁ జిరకాలంబు నేఁ బ్రతీక్షించుచు నం
తను వాసుదేవుకడ ని
ట్లనుపమసంగీతకౌశలాఢ్యుఁడ నైతిన్" (౨-౮౫)

[లింగపురాణము, ఉ. భా. iii ౮౦-౮౧]
"తతః కాలేన మహతా గృహం ప్రాప్యచ తుంబురోః,
వీణా మాదాయ తత్రస్థా మగాయత మహామునిః.
స్వరకల్పాస్తు తత్రస్థాః షడ్జాద్యా స్సప్తవై మతాః,
క్రీడతో భగవాన్ దృష్ట్వా నిర్గతశ్చ సుసత్వరమ్."

[కళాపూర్ణోదయము]
"ఎంచి యతని యింటి కేగితి నొక్కనాఁ
డతఁడు నపుడు పాట కాయితముగ
వీణె మేలగించి వెలుపలి మోసల
నునిచి లోని కరిగియున్నవాఁడు. (౨-౯౩)
ఏనును దుంబురుం డెచటి
కేగె? గృహంబున నున్నవాఁడె? యం
చానికటంబున న్మెలఁగు
నట్టి జనంబులఁ బల్కి వీణె యి
చ్చోనిడి లోని కేగ నను
మద్ది విగంబడ నీవపంచి యెు

వ్వానిదొ యంచు నుండితిమి
　　వారిదె! మాత మటంచు నల్లనన్. (౨-౭౮)
పుచ్చుకొని పలికించి యపూర్వమైన
శ్రుతుల పెంపు నిర్దోషత వతుల మగుచుఁ
గడు బెడంగొదవర్ప దాని నక్కడన పెట్టి
మిగుల లజ్జించి వచ్చితి మగిడి యపుడు" (౨-౭౯)

[లింగపురాణము, ఉ. భా. iii ౯౮-౧౦౭]

"తతో రైవతకే కృష్ణం ప్రణిపత్య మహామునిః,
వ్యజ్ఞాపయ దశేషంతు శ్వేతద్వీపేతు యత్పురా.
నారాయణేన కథితం గానయోగ మనుత్తమమ్,
తచ్ఛ్రుత్వా ప్రహసన్ కృష్ణః ప్రాహ జాంబవతీం ముదా.
ఏనం మునివరం భద్రే! శిక్షయస్వ యథావిధి,
వీణాగానసమాయోగే తథేత్యుక్త్వాచ సా హరిమ్.
ప్రహసంతీ యథాయోగం శిక్షయామాస తం మునిమ్,
తత స్సంవత్సరే పూర్ణే పున రాగమ్య మాధవమ్.
ప్రణిపత్యాగ్రత స్తస్థౌ పునరాహ స కేశవః,
సత్యాసమీప మాగచ్ఛ శిక్షయస్వ యథావిధి.
తథేత్యుక్త్వా సత్యభామాం ప్రణిపత్య జగౌ మునిః,
తయా స శిక్షితో విద్వాన్ పూర్ణే సంవత్సరే పునః.
వాసుదేవనియుక్తోసౌ రుక్మిణీసదనం గతః,
అంగనాభి స్తత స్తాభిః దాసీభి ర్మునిసత్తమః.
ఉక్తోసౌ గాయమానోపి న స్వరం వేత్సినై మునే!
తత శ్శ్రమేణ మహతా వత్సరత్రయసంయుతమ్.
శిక్షితోసౌ తదా దేవ్యా రుక్మిణ్యాపి జగౌ మునిః,
తత స్స్వరాంగనాః ప్రాపన్ తంత్రీయోగం మహామునేః.
ఆహూయ కృష్ణో భగవాన్ స్వయమేవ మహామునిమ్,
అశిక్షయ దమేయాత్మా గానయోగ మనుత్తమమ్.
తతో తిశయ మాపన్నః తుంబురో ర్మునిసత్తమః,
తతోనంతర దేవర్షిః ప్రణిపత్య జనార్దనమ్.
ఉవాచచ హృషీకేశః సర్వజ్ఞ స్త్వం మహామునే!
ప్రహస్య జ్ఞానయోగేన గాయస్వ మమ సన్నిధౌ.
ఏతత్తే ప్రార్థితం ప్రాప్తం మమ లోకే తథైవచ,
నిత్యం తుంబురుణా సార్థం గాయస్వచ యథాతథమ్,
ఏవముక్తో మునిస్తత్ర యథాయోగం చచార సః."

[కళాపూర్ణోదయము]

"ముదిత! మేలు మేలు కొదవ లే దింక నీ
యనఘచరిత దిద్దు మనుచుఁ జనిరొ
జాంబవతియు నొక్క సంవత్సరముదాఁకఁ
బాట నేర్పె మునికిఁ బాటవమున. (౨-౩౮)
అంతఁ గ్రమంబునం బ్రియుని
　　యాజ్ఞను సత్యయు భోజకన్యయున్
సంతస మొప్ప నప్పరమ
　　సంయమి నొక్కొకయేఁడు దిద్ది ర
త్యంతమనోజ్ఞ గానపటి
　　మాతిశయోన్నతుఁ గాఁగ నవ్విభుం
డంతటఁ దాను దిద్దె నొక
　　యబ్దము పూర్ణముగాఁగ నాతనిన్. (౨-౩౯)
.........గానము హరి
యిమ్మెయి నఖిలంబు నేర్పి యిఁక మీ సంగీ
తమ్మునకు నీకు లేదు జ
గమ్ముల నని పలికి మోదగరిమం దేల్చెన్." (౨-౪౦)

పయి భాగములలో సంస్కృతాంధ్రములకుఁ గల యానురూప్యమును, నాంధ్రమున సూరనార్యుఁడు నింపిన సొంపులును సుస్పష్టములు.

నారదుఁడు మహాక్లేశమున సాధించిన యీ గాన పాండితీపటిమకు ఫలము తుంబురుని జయించుట. ఆ ఫలసిద్ధి సంస్కృతమున సూచింపఁబడియే యున్నది. ప్రస్తుతప్రకరణమున సూరనార్యుఁడును నట్లు ఫలసిద్ధి సూచనము గావించియు నంతట సంతృప్తి నొందక నారదుని యసూయాతిశయంబునకును, నాగ్రహావేశంబునకును ననురూపముగా

"ఏనుఁగు వేగమ యేగి నాపటినపా
　　ట్లీడేర నాకంబులోఁ
గానీ కాంచనగర్భులోకమునదుం
　　గానీ పురద్విట్పథం
గానీ తొల్లిటివిష్ణుదేవుకడనే
　　గానీ మదీయోల్లస
ద్గానప్రౌఢిని వారువూని గెలుతున్
　　గర్వోన్నతున్ దుంబురున్." (౨-౬౮)

అని యాతనిచేఁ బలికించి విజయవార్త వెల్ల డించుట శ్రీప్రకరణమునందు నుచితముగ తావు లభింపక దానికై వేచియుండి యెంతో దూరమున నేడవ యాశ్వాసమున (౧౯౩, ౧౯౯, ౨౦౦) నభినవకౌముదీ కళాపూర్ణుల గానప్రసంగములందు రమ్యముగ ప్రసక్తి కల్పించి,

" ఆ తుంబురుఁ డీసంధున
గీతకళ న్నారదునకుఁ గీడ్పడిరో నన
భూతలనాయక! వింటివి
కేతో గతిఁ దెలియ మేవి శేషము గలదో"(౭-౧౯౯)

అని నారదుని జయంబుఁ బ్రకటించి యీ గానాఖ్యానోపక్రమణమునకుఁ జక్కని యుపసంహారము కూర్చినాఁడు.

పయిని జూపిన యుపాఖ్యానభాగమే కళాపూర్ణోదయమునకు మూలముగా సంఘటింపఁబడినది. తక్కిన కథాభాగములెల్ల స్వకపోలకల్పితములే యనఁదగును. ఏపురాణములం దయిన నేమూల నయిన నేనాఁటికయిన సరస్వతీచతుర్ముఖవిలాసకథకు దగినంత మూలము లభించునేమోయని యించుక సందియము కలదు. కాని యితరభాగముల కట్టి మూలమెంతమాత్రమును లభింపదని నానిశ్చయము. ఆకథాభాగము లన్నిటిని నంతహృద్యముగాఁ గల్పించిన సూరనార్యుఁడు కళాపూర్ణోదయమునకుఁగూడ నేదియే నొక మూలమును గల్పింపఁజాలనివాఁడు కాఁడు. నవ్యకల్పనాలాలసుఁడయ్యు, రమ్యకల్పనారహస్యవేది యయ్యు నీభాగమును బురాణమునుండి యెందులకు గ్రహించినాఁడో! అక్కఱమాలిన కథ కాదిది. ప్రబంధము నందలి పాత్రములును, దచ్చరితములును గొంతవఱకయినఁ బ్రసిద్ధములుగాక సర్వమును గల్పితమే యయినచో నిదంతయు మిథ్యయని చదువరులకుఁ దోఁచి దీనియెడ నసాదరభావము గలుగుననియు, నట్లుగాక యొకింతయయినఁ బౌరాణికప్రసంగ సమ్మేళనము గావించినచో నీకథ యంతయు నెప్పుడో యెచటనో జరిగియుండినటులు భాసిల్లి దీనియెడ సాదరాతిశయము గలుగుననియు భావించియుండునేమో! తనది యెంత యభినవపద్ధతి యయినను, దా నెంత కల్పనాప్రియుఁడయినను "కేవలకల్పనాకథలు కృత్రిమరత్నము"లని యీసడింపఁబడు కాలమునకుఁ జెందినవాఁడగుటంజేసి సమకాలికుల యభిరుచులను, నెప్పాలను సర్వథా త్రృణీకరింప జంకియుండునేమో! అట్టి జంకువల్లనే యీ ప్రబంధము తుదిభాగము (౭-౮ ఆశ్వాసములు) వర్ణనాబహుళమై పూర్వభాగవిలక్షణమై రసికుల యాదరము నకు దూరమగుటయు సంభవించియుండునేమో! అది ప్రసంగాంతరము.

లింగపురాణమున గానమహిమ, వైకుంఠవాస ప్రాప్తిసాధనములు, యోగశాస్త్రవిశేషములు అను విషయములఁగూర్చిన ప్రసంగములు విపులముగాఁ గలవు. గ్రంథవిస్తరమునకు సంకోచించి యాభాగముల నిటఁ జూపనయితిని. నారదుఁడు గానాఖ్యానాంతరము మణికంధరునకుఁ జేసిన యుపదేశములకును, కళాపూర్ణసభలో బాలిక వర్ణించిన యోగవిశేషములకును నివియే మూలము లైయుండునేమో! నిర్ణయింపఁజాలము. ఈవిషయములు పురాణములు పెక్కిటికి సాధారణములు.

ఇఁక నీమూలాన్వేషణప్రసంగము నింతటితో ముగింతును. లేక్కలేక దగ కొనచున్న మూలమించుకేని లభించినపుడు ప్రకటించుట యావశ్యకమని ఈ ప్రసంగము గావించితిని.



# ఆంధ్రకవి ప్రశంస

= శ్రీ కొడవంటి శంకరనరసింహబ్రహ్మం =

●

నన్నయ తిక్కనల్ చెనఁగు
 నంగల తొంటికవీంద్రు లల్ల పే
రెన్నికఁగన్న సంస్కృతక
 వీంద్రుల నాద్యులఁ బోలువారు, సం
ఛిన్నతమఃప్రభావులు, ఋ
 షిప్రవరుల్; తమదన్న తెన్ను చే
కొన్నిటి వృద్ధిచేసి కయి
 కోఁగలిగెన్ గవికోటి కీర్తులన్.

ప్రాసవిన్యాసంబు రసపోషణంబును
 నాచనకవితలో నాటుకొనియె
సరసవాచామాధ్వి సంస్కృతిప్రౌఢియు
 శ్రీనాథుకవితలోఁ జిక్కువడియె
శబ్దపటుత్వంబు శయ్యామృదుత్వంబుఁ
 దిమ్మనకవితలోఁ దేటపెట్టె
వలఁతిపల్కులకూర్పు నర్థసంపదతీర్పుఁ
 జేమకూరకవితలో సిద్ధినొందె
గానమాధురి కల్పనాగరిమఁ గూడి
మేలిభావాబ్ధితరఁగల నోలలాడి
వ్యంగ్యసైకతతటములన్ వచ్చి నిలిచెఁ
పెద్దనార్యకవీంద్రకవిత్వగతుల.

ప్రాసాదగుణభవ్యభావోన్నతిస్తవ్య
 పదతతిన్ దీర్చెఁ గావ్యమ్ము నొకఁడు
మాధుర్యధుర్యమై మహితసద్వ్యంగ్య మౌ
 పలుకులన్ గూర్చెఁ బ్రబంధ మొకఁడు
సరసమై సార్థమై సరళమై యలఁతి యౌ
 పలుకులన్ జేసెఁ గావ్యమ్ము నొకఁడు
సంస్కృతీనిబిడమై సమసనగ్రథిత మౌ
 పదములన్ వ్రాసెఁ బ్రబంధ మొకఁడు
సోముఁడన్ వాచనాంబుధిసోముఁ డొకఁడుఁ
పెద్దనఁ బసంగెఁ గవులకుఁ బెద్ద యొకఁడు
వెంకటాఖ్యుఁ డొకండుఁ దిరుపత్యాఖ్యుఁ డొకఁడు
నాంధ్రవాక్స్థానచతురాననాననములు.

కరుబంతంబులఁ గీర్తిచంద్రిక లెసం
 గన్ వెల్గు పోయుండు వా
శ్నీకరాఖ్యామృతవర్షమున్ గురిసి చో
 క్కింపండె లోకమ్ము? నొ
క్కొకదానిం గొని మెచ్చరే విబుధవ
 ర్యుల్ తక్కరాఁ ట్రేణి? నో
ర్వక సర్వజ్ఞశిరోమణిన్ దగునె స
 ర్వజ్ఞుండనా జేరికిన్?

గమికర్మీకృతనైకనీవృతుఁడు, స
 త్కావ్యప్రణేత్రాఘ్యుఁడున్,
విమతాలంబకవిప్రకాండజయది
 గ్వేదండదంతాకవ
ద్విమలోద్యద్యశుఁడున్, నరేంద్రమకుటో
 ద్దీప్తాత్మపాదుండు, ధీ
స్థిమితుండున్, గవిసార్వభౌముఁ డనుచున్
 శ్రీనాథుఁ జెప్పందగున్.

శ్రుతిపేయామలవచోనిగుంఫితములున్,
 సువ్యక్తమూలార్థసం
యుతముల్, సర్వరసప్రసారములు, భ
 క్త్యుద్బోధకముల్, భారతీ
కృతభావాంబరవీథి విశ్రుతవిహా
 రేఖ్యంబులున్, లోకస
న్నుతముల్ నిస్తులపోతనార్యకవితా
 నూనప్రచారోద్ధతుల్.

సరసపుఁబలుకు లేర్చి, రస
 సమ్మతవృత్తులు గూర్చి, మాధురీ
పరిమిళిత మ్మొనర్చి, నవ
 భావసమృద్ధి నమర్చి, వ్యంగ్య సం-

చరితముగాఁగఁ జెప్పి, రుచి
మద్గతి భారతి నైజశోభలన్
గరము వెలుంగఁ దీర్చెఁ దన
కావ్యముఁ బెద్దన పెద్దనేర్పునన్.

తన పాండిత్యముఁ జూప వ్రాసెఁ గొనిరుక్
ద్వ్యర్థి ప్రబంధమ్ము, నా
తనకావ్యమ్ము పఠించి ధీసునిశిత
త్వంబుం గనంజేసె, నం
త నవార్థామల కోమల మ్మగుమ స
ద్యస్స్ఫూర్తి భావోన్నతిం
జెవఁగన్ జెప్పి కృతిన్ గళాకలనఁ జూ
పెన్ సూరనార్యుండు దాన్.

పౌరాణికోక్తులై ప్రకటింపలేదొకో
యాంధ్రీకరణశక్తి సాధ్యుఁ డనుట
ద్వ్యర్థి కావ్యముఁ గూర్చి తలఁపింపలేదొకో
యర్థద్వయోక్తి సమర్థుఁ డనుటఁ
గల్పనాకృతిఁ జేసి కనుపింపలేదొకో
ప్రతిభాఽసమాన ప్రభావుఁ డనుట
సత్ప్రబంధముఁ దీర్చి చాటఁగాలేదొకో
సర్వంకష ప్రజ్ఞ సంతరిలుట
సరస సంభాషణామానచారుగతుల
కలితపద్యస్ఫురద్భావ లలితగతుల
నతుల కావ్యకళాధన్యవితత గతుల
నలరఁజేయఁడె సూరన యలఘుమతుల!

సరసాలంకృత, మాధురీమిళిత, వా
చాపీచివాచాలతా
పరిశిష్టాంచిత, సంస్కృతాంధ్రరచనా
ప్రాగల్భ్యసంపూరిత, తా
ధరితవ్యంగ్యపదార్థశోభిత, చల
ద్భావోన్నమత్కావ్యత
కృతుఁడై చెప్పెను పాండురంగని చరి
త్రన్ రామకృష్ణుండు దాన్.

ప్రతిపద్యమునందు చమ
త్కృతి దోఁపఁగ వెంకటపతి శ్రీమన్మతి స
త్కృతి సులభస్థితి రసవ
ద్గతి మృదులఫణితి రచించి కైకొనెఁ గీర్తిన్.

అలఁతి యలంతి పల్కులనె
యర్థ మనంతముగాఁగ నించె, స
ల్లలితవచస్సుధాలహరు
లన్ జిలికించె, రసంబు నెల్లచోన్
దొలఁకఁగఁ జేసె, హృద్యగతిఁ బె
నంగుపదంబులె కూర్చి తీర్చె, నా
ప్వా లౌలిక వ్యంగ్యభావ పరి
పుష్టముగాఁ గృతిఁ జేమకూర దాన్.

ఎందరో కావ్యకృన్నిపుణు
లేగిరి యింతకు నంతకేమి? స
ద్వ్యందితరైరి గుణాఢ్యయు
ప్రౌఢయునై సరసంపుఁ జెన్నులన్
సుందరమైన తత్సహజ
శోభల భారతి చేమకూర వా
క్మందిరరంగమందువలె
మంజులనృత్యము సెందఁ జేసెనే?

సారసమాసధోరణియుఁ
జక్కని తెల్గులకూర్పు బింకమున్
మీఱు రసంబు చిప్పిల స
మీరకుమారకథాప్రబంధమున్
దీరిచి దిద్దెఁ బుష్పగిరి
తిమ్మన వృత్తుల నొప్పఁ గూర్చి; యె
వ్వా రికఁ సాటిరాఁగలుగు
వారలు తత్కవిరాజ మౌళికిన్?

ధరణీదేవుల రామనార్యుఁడను వి
ద్వద్వందితుం డొక్కఁ డిం
పు రహింపంగ దశావతారచరితం
బున్ జెప్పె సత్కావ్యమున్
బరికింపంగఁ గ్రొత్తపోకడలు గా
నన్ వచ్చు నెన్నేనియున్
భరసంబైన కవిత్వమే యనును వా
చాశుద్ధి మెచ్చం దగున్.

విరతాహారరసప్రసారమిత వా
గ్విన్యాసముల్ వ్యంగ్యగ
ర్భితభావంబులుఁ దోపఁ జంపువుగ మా
ర్చెన్ దీర్చె మున్ భోజభూ

పతి రామాయణకావ్యరాజమున కె
  ట్టి స్థైర్యమేపారఁ, బూ
ని తెనింగించెను వెంకటాద్రిపతి దా
  నిన్ దాను వెన్దర్శతన్.

తిరుపతి వెంకటేశ్వరుల
  దిగ్విజయంబుల నెన్నఁడేనియున్
మఱచెఁ దరంబె ? యాంధ్రుల మ
  నమ్ముల నప్పటిసింహగర్జనల్
కరము ప్రతిధ్వనించెడు న
  ఖండముగాఁగను నేఁడుఁగూడ నే
తెలుఁగరు గన్న వేఱ యిట
  నే వచియింపఁగఁ బూనుకొంటకున్ ?

మునుపటి రీతులెల్ల నొక
  మూలఁబడెన్, నవకావ్య కల్పనల్
పనిపడె, నైన నాధునిక
  భావకవిత్వపురోజాలందునున్
మనుకొని శ్రద్ధతో వెదకఁ
  బూనిన నెక్కడనైనఁ గాని కాం
చనగును కొన్ని 'కంకణము'
  'సౌందరనందము' వంటిసత్కృతుల్.

కల దింకం గవితారకావళి యసం
  ఖ్యాకంబుగా, స్వప్రభా
వళి వేర్వేఱుగ వేనికిం దగిన శో
  భన్ వానికిన్ జెక్కు రీ
తుల దీపింపఁగ హెచ్చుకుందగుచుఁ, బం
  క్తుల్ దీరి యవ్వెల్ల భా
సిలుచుండున్ విపులాంధ్రవాఙ్మయనభ
  స్సీమాంతరంగంబునన్.





ముఖము కళంకరాహిత్యమై పుష్పవలె మృదుత్వము గలిగియుండిన, పట్టుచీరలు, ఆభరణములు స్త్రీయొక్క సౌందర్యమును పెంపొందించును.

# సౌందర్యపు మొదటి మెట్టు

దేవతాప్రతిమవంటి ముద్దులొలుకు ముఖముగల స్త్రీయే మిక్కిలి ధన్యురాలు. ప్రతిమపు ముఖమును చెక్కుటలో తీసుకొన్న శ్రమకన్న ముఖ్యమైనది స్త్రీ తనముఖమును మృదువుపరచి నిష్కళంకముగా చేయునదియే. మనోహరమగు అనేక సన్మానములకూడికయే ముఖవర్చస్సుకు కారణము. ఈ ముఖకాంతికి తగుశ్రద్ధ పుచ్చుకొనుటే సౌందర్యమునకు మొదటిమెట్టు.

ఈ స్వల్పసాహసముతో మీరు చక్కని ముఖకాంతిని పొందగలరు. మీముఖముయొక్క చర్మరంధ్రములలో చేరిన నూనెను, మురికిని ప్రతిదినము తీయుటే మీరు మొదలు చేయవలసినపని. మామూలుగా సబ్బుతో ముఖమును కడుగుటమాత్రమే చాలదు. ఇందుకుగాను పాండ్స్ కోల్డ్ క్రీమును ఉపయోగించుడు. ఇది చర్మరంధ్రములలో చొచ్చి లోపల, బయటనుండు మురికిని తీసివేయును. ప్రతి రాత్రి, ఉదయము ఈ క్రీమును ముఖమునకు, మెడకు తట్టుడు. కొన్ని నిమిషములు వదలిన ఇది చర్మరంధ్రములలో పోవును. దీనిని తుడిచివేయుడు.




రెండవది. పగటిపూట మీ ముఖచర్మమును కాపాడుటకు పాండ్స్ వ్యానిషింగ్ క్రీమును వాడుడు. దీని నుండి ముఖముమీద, మెడమీద కంటికగుపడని, జిడ్డు లేని పొరయొకటి ఏర్పడును. ఈపొర మీముఖమును దుమ్ము, గాలి, ఉష్ణము వీటినుండి రక్షించును.

ఇప్పటినుంచే పాండ్స్ క్రీములను ఉపయోగించుటకు ప్రారంభించుడు. కొన్నివారములలో మీముఖము గులాబి పుష్పమువలె మృదువుగా, మనోహరముగా నుండును.

## ★ పాండ్స్ క్రీమ్ ★



కథానిక:

# సంఘ సంస్కర్త



శ్రీ
అందే నారాయణస్వామి

ఆ సభలో స్త్రీస్వాతంత్ర్యసమాజం ఒకటి లేవదీశారు. చాలామంది యువకులు సభ్యులుగా చేరారు. రామానుజం సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాడు. తీర్మానాలయ్యాక సభ ముగిసింది. అందరూ వెళ్లిపోతున్నారు. రామానుజంగూడా ఇంటిదారి పట్టినాడు.

  

గృహకృత్యాల్లో మునిగివున్న రమణమ్మకు వీథితలుపుతట్టుతూ, "రమణా! రమణా!" అన్న పిలుపు వినవచ్చింది. అట్లా తన్ను సంబోధించేది తన తండ్రివొక్కడే. అతడేమన్నా వచ్చి పిలుస్తున్నాడా అనుకుందామంటే, గొంతు చూస్తే తనభర్తది. అయితే అతడెందుకు పేరుపెట్టి పిలుస్తాడు? సందేహంతో త్వరగా వెళ్లి తలుపు తీసింది. మసకచీకట్లోకూడా చప్పున గుర్తింపగలిగింది. తన భర్తే! ఆమెకు ఆశ్చర్యం వేసింది. అదివరకు "ఏమేవ్, ఏయ్, ఇదుగో" అని పిలిచేవాడు. ఇవాళ భర్తనోటిగుండా తనపేరు వినేసరికి ఆమెకు నవ్వువచ్చి నవ్వింది. తన పేరు చెప్పి సంకకు భర్తను ఎగతాళిపట్టించాలనుకున్నది. "గుమ్మందగ్గిర వధువుపేరు ముచ్చటగా ముమ్మాటూ చెప్పటం అయిందికదూ, ఇక కుడికాలుమాత్రం లోపల పెట్టండి" అన్నది. "పెళ్లికూతురు ఇంకా చెప్పందే లోపలికిఎలా వచ్చేది" అన్నాడు రామానుజం. ఇద్దరూ ఫక్కున నవ్వారు.

అతడు లోపలికి వచ్చి చెంబుతీసుకుని సిమెంటుతొట్లో నీళ్లుముంచుకోబోతున్నాడు. రమణమ్మ అడ్డువెళ్లి "నేను ముంచియిస్తా తేండి" అన్నది. "నేను ముంచుకుంటాను, ఫరవాలేదులే" అంటూ నీళ్లు ముంచి కాళ్లు కడుక్కుని ఇంట్లోకి వెళ్లాడు. ప్రతిరోజూ తను ఇంకా వాకిట్లో వుండగానే ఎదురుగా నీళ్లు తీసు కెళ్లకపోతే కస్సుమనేవాడు. ఇవ్వాళ ఆమె ముంచియిస్తానన్నా వద్దని తనకై తానే ముంచుకున్నాడు. ఇంత సహనం ఎక్కడ

నుంచి వచ్చిందాఅని ఆశ్చర్యపడ్డది రమణమ్మ. రామానుజం బట్టలు మార్చుకుని, డ్రాయరు ముందు కూర్చుని ఏవో వ్రాసుకుని లేచే టప్పటికి యెనిమిదైంది. "రమణా! భోజనానికి రమ్మంటావా?" అన్నాడు. వంటగదిలో వున్న రమణమ్మ విన్నది.మళ్లీ తనను పేరుతో పిలవడం ఆమెమనస్సుకు కష్టంకలిగించింది. మామూలుపిలుపులో వున్న చనువూ, అనురాగం, బాధ్యతా ఆమె కీ పిలుపులో కనబడ లేదు. అట్లా పిలవడం న్యూనత అనిపించింది. బదులుపలక బుద్ధిపుట్టలేదు. "రమణా! యేం చేస్తున్నావ్ ? భోజనానికి రమ్మంటావా?" అని మళ్లీ అన్నాడు. ఈసారి రమణమ్మ ఊరుకోలేకపోయింది. ఆయనదగ్గిరికి వెళ్లి ఇలా అన్నది:

"ఏమండీ! యేమి టా పిలుపు? ఇందాకా పిలిస్తే ఏదో వెగతాళి కనుకున్నాను. మళ్లీ యిప్పుడూ ఆలాగే పిలిచారు. ఒకళ్లచేత వేలుపెట్టి చూపించుకోకుండా ఏదో ఇలా మర్యాదాగా బతుకుతున్నాం.పక్కింటివాళ్లు గనక వింటే తాటాకులు కడతారు!"

తాను గౌరవం అనుకున్నది భార్యకు అగౌరవంగా తోచడంవల్ల అతనికీ కష్టమే కలిగింది.

"ఏం, పేరుతో పిలిస్తే తప్పా?"

"తప్పని ఇంకా మెల్లిగా అంటారేమండీ? మీకుమాత్రం తెలియదూ? మన పూర్వీకుల్లోగానీ, యిప్పటివాళ్లల్లోగానీ పేర్లుపెట్టి పిలుచుకున్నవాళ్లున్నారా?"

"ఎవరో పిలుచుకుంటేనేగాని మనం పిలుచుకోగూడదా యేం? వాళ్లు చూపిన దారి ముళ్లడొంకైనా మనం గుడ్డిగా అందులోనే నడవవలసిందేనా? ఇంత అమాయకురాలి వేం? పేరుతో పిలిస్తే ఎంత గౌరవం, అసేయ్ ఇసేయ్-అదిగో ఇదిగో అని పిలిస్తే ఎంత గౌరవం? నీవే ఆలోచించు."

"భార్యను భర్త ఎలా పిలుచుకుంటే యేమండీ? పేరుతో పిలిచినంతమాత్రంచేత గౌరవం వస్తుందిటండీ, దాని నడతవల్ల రావాలిగాని? అయినా భర్త భార్యను గౌరవంగా పిలవడ మేమిటండీ? భార్య తన అర్ధ శరీరం,ఇద్దరికీ భేద మేమున్నది? తన్ను తాను గౌరవించుకోవటం ఎంత కూడని పనో భార్యను గౌరవించినా అంతే కాదుటండీ?"

"అట్లనుకుని నన్ను నువ్వు వంచించు కుంటున్నావు రమణా! ఇద్దరికీ భేదంలేనప్పుడు, మరి, భార్య భర్తను గౌరవించడం మాత్రం దేనికి?"

"భార్యకు భర్త పూజ్యుడుగనక."

"సరే, ఇద్దరూ ఒకటైనప్పుడు భర్త భార్యవల్ల ఎంతగౌరవం పొందుతున్నాడో భార్య భర్తవల్ల అంతగౌరవం పొందడంలో తప్పేమున్నది?"

"మిమ్మల్ని ఏమండీ అంటున్నాగా, ఇంకేం, నన్నూ ఏమండీ అనండి." ఆమె నవ్వింది.

"అంటేమాత్రం తప్పేమిటి?"

"చాల్లెండి. ఇవన్నీ ఎక్కడ నేర్చుకొచ్చారు? భర్తచేత అలా పిలిపించుకున్నది ఇంకా వేరే పాపం మూటగట్టుకోవాలా? దానికి ఎక్కడో రౌరవాది నరకం తప్పదు."

"పోనీ, నువ్వు పేరుతోనే పిలిపించుకో."

"సరేలెండి, యీమాటల కేం వచ్చె. భోజనానికి లేనండి."

రామానుజం వెళ్లి పీటమీద కూర్చున్నాడు. రమణమ్మ విస్తరివేసి వడ్డించింది. కూరలూ పులుసుతో తినడం అయ్యాక మజ్జిగ వేసి, పిల్లవాడు ఏడుస్తుంటే వెళ్లి చంకన వేసుకుని సముదాయిస్తున్నది. ఇంతలో రామానుజం భోజనం పూర్తికాగా ఎంగిలి ఆకు మడిచి చేత్తో పట్టుకుని బయటికి వచ్చాడు. రమణమ్మ చూచింది. తనకళ్లు తాను నమ్మలేకపోయింది. తాను కాపరానికి వచ్చి దాదాపు పదిహేనేళ్లయింది. ఆయన ఎప్పుడూ ఎంగిలాకు ముట్టుకుని యెరగడు. ఆమెహృదయం దిగులుతో - భయంతో నిండింది. తాను వుండగా భర్త ఆపని చెయ్యడం తనను చిన్నబుచ్చినట్లనిపించింది. "అయ్యో! అదేమిటండీ! నేను వుండిచచ్చాగా, యిట్లా తేండి" అంటూ కుర్రవాణ్ణి దింపి భర్త చేతిలోని ఆకు తీసుకోబోయింది. "అవసరం లేదు. తిన్న ఆకు తీసుకుంటే తప్పా?" అంటూ భార్య కివ్వకుండా చకచకా పెరట్లోకి వెళ్లిపోయ్యాడు. ఆమెమనస్సు చెయ్యిపెట్టి కలచినట్లయింది. ఇందాకా కాళ్లకు నీళ్లు తానే ముంచుకోవడం, ఇప్పుడు తిన్న ఆకుకూడా తానే తీసుకోవడం ఇదంతా తనమీది కోపంచేతనే అనుకున్నది. నేనేమన్నా ఆయనకు లోపం చేశానా అని జాగ్రత్తగా పారచూచింది. ఏమీ చెయ్యలేదు. అతడు విస్తరి పారేసి వచ్చి చెయ్యి కడుక్కుంటున్నాడు. "ఇట్లా నన్ను దండిపించడం దేనికి? నే నేం తప్పు చేశానో చెప్పరాదూ?" అని అడిగింది. "నువ్వేం తప్పు చేశావని చెప్పమన్నావ్? ఇకమీదట నీచేత ఇటువంటి హీనమైనపనులు చేయించదలుచుకోలేదు" అన్నాడు. ఆమెకు దుఃఖం ముంచుకొని వచ్చింది. కళ్లవెంట బొటబొట నీళ్లు కారినవి. "లేనిపోనిమాటలుగూడానా? హీనమైన పనులని నేను ఎవరితో అన్నానండీ? అసలు నా మనసులోనైనా అనుకోలేదే! మీకు ఆమాట చెప్పినవాళ్లను ఇట్లా నా యెదటికి పిలుచుకరాండి, నిలవదీసి అడుగుతాను. ఎవరో చెపితే మటుకు మీరెట్లా నమ్మారండీ? ఎక్కడ లోపం వస్తుందో అని భయంతో అరిచేతికీ, అరికాలికీగూడా ఒగ్గుతూవుంటానే, మనిషిమనస్సు తెలుసుకోలేకపొయ్యారు కదా?" అన్నది.



"......అయ్యాక మజ్జిగవేసి, పిల్లవాడు యేడుస్తుంటే వెళ్లి చంకనవేసుకొని సముదాయిస్తున్నది."

ముఖం కందిపోయివున్నది. శబ్దం పైకి రాకుండా లోలోపలనే కుళ్లుతూ వున్నది. కళ్లవెంట ప్రవాహంగా నీళ్లు కారుతున్నవి. ఒకవేపున చీదివేస్తున్నది. ఆమెఅవతారం చూస్తే అతనికి నవ్వు వచ్చింది. "పిచ్చిదానిలా గున్నావు! నువ్వన్నావని నేనన్నానా? పైగా, ఎవరో చెప్పారంటావేమిటి?" అన్నాడు.

"మభ్యపెట్టి మాట్లాడకండి. పైగా నవ్వుతారేం? మీరు యింటికి వచ్చినదగ్గిరి నుంచీ భేదంగా చూడ్డం తెలుస్తూనే వున్నది. నన్ను తెమ్మనకుండా కాళ్లకు నీళ్లు మీరే ముంచుకుంటిరి - ఎన్నడైనా ముంచుకుని

ఎరిగున్నారా? లాంతరు మీరే వెలిగించుకుని స్వయంగా బల్లమీద పెట్టుకుంటిరి- గబ్బునూనెవాసనను ఎన్నడైనా అట్లా ముట్టుకుని ఎరిగున్నారా? ఇప్పుడు ఎంగిలాకు సైతం మీరే తీసుకుంటిరి- ఎంగిలాకు తీసివేసేటందుకైనా నేను పనికిరాకపొయ్యాను కామాల్సు! ఇన్ని సంవత్సరాలయింది నేను వచ్చి, ఇట్లా ఎన్నడైనా చేసి ఎరిగున్నారా? ఎవరూ చెప్పలేదంటే ఎవరు నమ్ముతారండీ? నా తప్పేమిటో చెప్పండి."

ఒక్క నిమిషం ఆగి, వెక్కివెక్కి యేడుస్తూ మళ్లీ అన్నది: "నన్నిట్లా యెప్పుడైనా పిలిచారూ, పరాయిదానిలాగా పేరు పెట్టి? బాగా వుంటిపొయ్యారని ఎవతో మీకు దుర్బోధన చేసి పంపింది."

ఆమాటలు వినేసరికి అతనికి మామూలు ప్రకారం తామసభుజంగం తలయెత్తింది. కాని నూతనంగా కలిగిన స్త్రీజనపక్షపాతమయూరం దాన్ని కాస్తా ఆమెమీదికి పోనివ్వకుండా పడిసిపట్టింది. "నీ తెలివితక్కువ కూల! లేనిపోనివి కల్పించుకుని కారణం లేకుండా అట్లా యేడుస్తావు దేనికి? నీవల్ల లోపం వుండి నేనిట్లా చెయ్యడంలేదు. నీ శ్రేయస్సు కోసే చేస్తున్నాను. నువ్వు అది గ్రహింపలేక పొయ్యావు. నీ అమాయకత్వానికి జాలి పడుతున్నాను. బానిసత్వంవల్ల మీ హృదయాలు మసిపట్టిన అద్దాల్లాగా ప్రయోజన రహితాలయిపోయినవి. దాన్ని పోగొట్టుకుంటేనేగాని మీకు విముక్తి లేదు" అన్నాడు. అతని ధోరణి ఆమెకు అర్థంకాలేదు. ఇంతలో ఎవరో సమాజంతాలూకు మనుషులు వస్తే వాళ్లతో మాట్లాడ్డానికి హాల్లోకి వెళ్లాడు రామానుజం.

౨

రమణమ్మ భర్తకు పక్కవేసి, మంచం దగ్గిర మంచినీళ్ల చెంబు పెట్టి, భోజనం చెయ్యకుండానే పండుకున్నది. రామానుజం ఆ వచ్చినవాళ్లతో మాట్లాడి లేచేటప్పటికి పదిన్నర అయింది. తలుపు గడియవేసి లోనికి వెళ్లాడు. భార్య నిద్రపోతూవున్నది. లేపి అన్నం తిన్నావా అని అడిగాడు. ఆమె తిన్నానని చెప్పింది.

■■ ■■ ■■

చీకటితోనే నిద్రలేచి రమణమ్మ వాడుకప్రకారం భర్తకు నమస్కరించేటందుకు అతని మంచం దగ్గిరికి వెళ్లి పాదాలు పట్టుకున్నది. అతడు నిప్పుతొక్కినట్టుగాను, పాము కాలికితగిలినట్టుగాను ఉలిక్కిపడి కాళ్లుముడుచుకుని దిగ్గున లేచికూర్చున్నాడు. రమణమ్మ నివ్వెరపోయి "నన్ను బతకనివ్వరా యేమిటండీ?" అని యేడ్చింది. "నీ కింకా అర్థం కానేలేదా? ఎందాకని తలకాయ పగలగొట్టుకునేది? పెళ్లాం మొగుడికాళ్లు పట్టుకోవడం శుద్ధతప్పు. ఇద్దరూ సమానులే. ఒకళ్లు యెక్కువా, ఇంకొకళ్లు తక్కువా కాదు. నా మాటలు [illegible]విధంగా అర్థంచేసుకోవద్దు. మేము స్త్రీస్వాతంత్ర్య సమాజాన్ని ఒకదాన్ని స్థాపించాము. చిరకాలంనుంచి స్త్రీజాతికి సంక్రమించిన బానిసత్వాన్ని పోగొట్టడానికి దీక్ష పూనాము" అన్నాడు.

ఆమాటలు విని, భర్త తన సేవను నిరాకరిస్తున్నది తనవల్ల లోపంవుండి కాదని అప్పటికి ఆమె గ్రహింపగలిగింది. "ఏమిటండీ ఆమాటలు? ఎవరన్నా వింటే నవ్విపోతారు! భార్యకు భర్తపాదసేవకంటె స్వర్గ మెక్కడున్నది? భర్తను సుఖపెట్టడంకంటె యింకా

తనకు కావలసిం దేమిటి? మీపాదసేవ చేసుకుని నన్నిట్లా బతకనివ్వండి" అన్నది.

"తప్పు రమణా! బానిసత్వం, లొంగుబాటూ మీలో జీర్ణించిపోయి అలా మాట్లాడు తున్నావు. భార్య భర్తను గొప్పగా చూడడం గాని, భర్త భార్యను హీనంగా చూడడం గాని పనికిరాదు. ఇద్దరూ సమానగౌరవంతో వుండాలి. తెలిసిందా? ప్రతిస్త్రీ తన జన్మ హక్కును పొందేటందుకు నడుముకట్టాలి" అన్నాడు అతడు.

ఆ ధోరణీ, ఆ వుద్రేకం చూస్తే అతని కేదో ఆవేశించినట్లు కనిపించిం దామెకు. "ప్రొద్దుపోయి వేళా పాళా లేకుండా ఎప్పుడు బడితే అప్పుడు వస్తూవుంటారు, కాస్త విభూతి పెట్టించుకోండి"అని ఛలోక్తిగా అందా మను కున్నది. కాని అంటే మళ్లీ యెక్కడ కోపం వస్తుందో అని ఆగింది. "పిల్లాజల్లతో నాలుగు కాలాలపాటు సుఖంగా సంసారం చెయ్యా లనుకున్నది అలా కోరుతుందటండీ? నాకు యేలాటిహక్కులూ వద్దు లెండి, అడిగినవాళ్ల కిప్పించండి చాలు" అన్నది.

"ఇంట గెలిచి రచ్చ గెలవ మన్నారు. స్టేజీ యెక్కి ఉపన్యాసం యిస్తుంటేనూ, ఊరూరూ తిరిగి ప్రచారంచేస్తుంటేనూ ఎవ రైనా నీభార్యకు ముందు నువ్విచ్చావా అంటే ఏం చెప్పేది?"

"ఇచ్చా ననే చెప్పండి."

"భార్య పైకిరావడం యిష్టం లేనివా డెవడో అబద్ధం ఆడి వాళ్లను మోసం చేస్తాడు గాని నాకేం ?"

"ఐనా, తిన్న విస్తరి యెత్తివేసుకోవడ మేమిటండీ? ఆడది చేసే పనులు చెయ్యాలని మీకేం గ్రహచారం పట్టిందండీ? రాత్రి మీరు ఒక చేత్తో ఎంగిలాకూ, ఇంకొక చేత్తో చెంబూ పట్టుకొస్తూవుంటే నాకు బైటున్న ఆడదిగుర్తుకొచ్చింది సుమా." ఆమెనవ్వింది.

"ఆడదనీ మగవాడనీ భేదం లేదని ముందే చెప్పానుకదూ? దాన్ని బాగా గుర్తుంచుకో వాలి. నేనూ తియ్యవద్దు, నువ్వూ తియ్యా వొద్దు: ఎట్లాగూ వంటమనిషిని పెట్టాలి గదూ, వాడే ఇద్దరి ఆకులూ తీసివేస్తాడు."

"వంటమనిషి కూడానా వేరే! వంట చెయ్యలేకపోవడానికి నే నేం జబ్బుగా వున్నాననీ?"

"అర్థంలాలు పలుకబోకు. చెప్పే దంతా యేమిటి ? చిరకాలంనుంచీ నీచేతికి అంటుకు పోయిన తెడ్డును విసిరిపుచ్చి దూరంగా పార వేసి శాశ్వతంగా హక్కుభుక్తమైన వంటకు ఈరోజుతో స్వస్తిచెప్పి నీవు హాయిగా కూర్చోవాలి, తెలిసిందా ?"

"నిరంతరం మీచేతికి అంటుకుపోయిన కలంపుల్లను వదిలివేసి మీరూ ఆఫీసుకు వెళ్లడం మానివెయ్యండి. ఇద్దరం హాయిగా కూర్చుందాం."

"అట్లంటూ వేం, భుక్తి జరగొద్దూ?"

"భుక్తిమా కెందుకు ? నేను కూర్చో వడమే కదా మీ క్కావాలి? ఇద్దరం సమమైనప్పుడు మీరుమాత్రం ఆఫీసుకు వెళ్లి పొద్దస్తమానం చాకిరీ చెయ్యడం యే మంత న్యాయం ? ఆ సుఖాన్ని ఇద్దరం సమంగానే అనుభవిద్దాం. ఇంటివద్ద వుండండి. హాయిగా ఎదురుబల్లుగా కూర్చుందాం. పొద్దు కూకిన తర్వాత మీ రోవైపుకూ, నే నోవైపు కూ వెళదాం.... చాల్లెండి, మీమాటలు!

వంటమనిషిని పెట్టుకోడానికి మన మేం ధనం మీద కూర్చున్నామనా? వచ్చేదానికీ తినే దానికీ పాస్తుబిస్తవుతున్నది! మన తాహతుకు మనం వంటమనిషిని వేరే భరించగలమ టండీ? ఎక్కడో మహారాజులకు వంటమనిషి గాని మనబోటివాళ్లకటండీ ?"

"నీకు తెలియదు వుండవే—కాదు, నీకు తెలియదు వుండు రమణా! భార్యకు స్వేచ్ఛ, సుఖం యివ్వలేని మగవాడు దేనికి? డబ్బంటే నాకేం లెఖ్ఖలేదు. డబ్బువిషయం ఆలోచించుకోనిదే, సంపాదించే తెలివి లేనిదే యిట్లా మాట్లాడుతున్నా ననుకున్నావా?"

"మీమాటలు చూస్తే యేదో చెట్టు తొక్కి వచ్చినట్టుంది. నామాట వినండి. వంట మనిషీ వద్దు ఏమీవద్దు, లక్షణంగా నేను చేసుకవెళతాను."

"నలుగుర్లోకి వెళ్లి తలవంచుకోలేను రమణా! నీచేత యింట్లో ఊడిగం చేయిస్తూ సమాజంలోకి యేమొఖం పెట్టుకొని వెళ్లేది? నాకు తలవంపులు తేకు. నామాట విను. అంతా జరుపుకొని వెళ్లేవాణ్ణి నేనూ: హాయిగా ఊరికే కూర్చుంటానికి నీ కేం కష్టం?"

3

వంటమనిషి అంతా చేసుకొనివెళుతున్నాడు. రమణమ్మకు చేతులు ఒళ్లో పెట్టుకుని వూరికే కూర్చోవడం చాలా కష్టంగా వున్నది. ఏమీ తోచదు. బందిఖానాలో వున్నట్టున్నది ఆమెకు. యిరుగు పొరుగుఇళ్లకు వెళ్లి కాలం గడుపుదామంటే, ఆమెను రెండు సందేహాలు బాధిస్తున్నవి. "ఇంటిపనులు చేసుకోలేక మొగుణ్ణి కలపోరు చేసి వంటమనిషిని పెట్టించింది. వట్టి పనికి మాలిన"దని వాళ్లు తన్ను అనుకునివుంటారాయిరి, ఎట్లా వెళ్లుతుంది? రెండో సందేహం: అక్కడికి వెళ్లి వాళ్లతో మాట్లాడుతూవుండగా భర్త వచ్చి తన్ను పేరుబెట్టి కేకవేస్తే వాళ్లందరూ మొఖానే అంటారాయె, ఇంత మొఖం చేసుకుని ఇంటికి రావాలి. అందువల్ల వాళ్లిళ్లకు వెళ్లడమే మానుకున్నది.

కాస్సేపు భాగవతం తీసి చదువుతుంది. కాస్సేపు పడుకుంటుంది. పగలు పండుకునే అలవాటు వుంటేగా నిద్రపట్టేందుకు? పక్కలు నొప్పులువేసి లేస్తుంది. కాస్సేపు పిల్లలతో ఆడుకుంటుంది. ఎంత సేపటికీ పొద్దు కూకదు. దిన మొక యుగంగా గడుస్తూ వున్నది. వాళ్లదొడ్లో కరివేపాకుచెట్టున్నది. ఒకనాడు "రెండు రెబ్బలు పెడుదూ మరదలా" అంటూ పక్కింటామె రానే వచ్చింది. ఆమెను చూచేసరికి రమణమ్మముఖం వెలవెల పోయింది. ఇంటికి వచ్చిన మనిషిని ఎలా పలకరించకుండా వుంటుంది? "కూర్చో వదినే యిస్తాను." బెదురుతూనే అన్నది. ఇంక ఆమె రెత్తుకున్నది: "అదృష్టమంటే అట్లా వుండాలి. వంటమనిషిని పెట్టారుట గదూ పిల్లా? మహారాజులు మీకేమమ్మా. తినే వాళ్ల గీత మంచిదై అట్లా కలిసిరావాలి. ఇటు చూచినవాళ్లటు బాగుపడతారు. దరిద్రులకేముంది, ఎప్పుడు చూచినా గొర్రెకు బెత్తెడే తోక! దానికేంలే, మొవ రదృష్టం వాళ్లది. మాటసామెతకి చెపుతా పిల్లా! మీ ఆయన ధర్మరాజంటివాడు. నువ్వు చెప్పీ చెప్పగానే వంటమనిషిని పెట్టాడా! మా కున్నాడు, యెందుకు? సంపాదించ చేతగాక పోయినా ఏమాట చెప్పినా కస్సుబుస్సు మంటాడు." అని కళ్లు తిప్పుతూ, మూతి విరుస్తూ,

చేతులు ఆడిస్తూ అన్నది. రమణమ్మ ఎంత తప్పుకు తిరిగినా ప్రయోజనం లేకపోయింది. ఆమెకు ముట్టవలసిన మాటలు నాలుగూ దిగు బాటు లేకుండా చుక్కాగా తన యింటికే నడిచివచ్చి ముట్టినవి. ఆమె చిన్నపోయి ముఖం యింత చేసుకున్నది.

వంటవాడు చేసే పనులు చూస్తే,ఆమెకు తగని చిరాకుగా వున్నది. తిరుగబోతకు నెయ్యి కాస్త తగ్గించు; పొయిలో కట్టెపుల్ల లన్నీ వక్క-సారే పెట్టావేం- నీయిల్లు బంగా రంగాను; చెయ్యి శుభ్రంగా కడుక్కోకుం డానే కూరలు తరుగుతావేం; రాత్రి యెన్ని బియ్యం వేశావేమిటి - తెల్లవారికి చాలా అన్నం మిగిలింది; అయ్యో పాత్రలన్నీ చిందరవందరగా పారేశావేం-వరసగా పెట్టు కోరూ అంటూ అది అట్లా ఇది ఇట్లా అని యెప్పుడూ అతణ్ణి మందలిస్తూ వుంటుంది.

ఒకనాడు రామానుజం పైనుంచి వస్తు న్నాడు. వాళ్ల బజారులో దూరాన ఒకస్త్రీ నెత్తిన పళ్లిక పెట్టుకుని ఏదో మోసు కొనివస్తూ కనిపించింది. ముఖం సరిగా కనిపించడంలేదు. ఉనికి చూసి తనభార్య అనుకున్నాడు. కాని మళ్లీ "ఆవిడ యెందుకు మోసుకొస్తుంది ? అసలు బయటికొచ్చే పనేమంటుంది ! నాభార్య కాదు, ఎవరో మని"మనుకున్నాడు. అతడలా చూస్తూ వుండగానే ఆస్త్రీ వాళ్లింట్లోకే పోయింది. తన భార్యకాకపోతే పరాయివాళ్లెవరు తమఇంటి కెళతారు? కంగారుతో త్వరత్వరగా ఇల్లు చేరుకుని లోపలికి వెళ్లాడు. రమణమ్మ ఖాళీ పళ్లిక చేత్తో పుచ్చుకుని ఎదురుగావస్తూ ఇతణ్ణి చూసి మందహాసం చేసి ఆగింది. అక్కడ వున్న యిసుకకుప్పను చూశాడు. అతనికి అరికాలిమంట నడినెత్తి కెక్కింది. ఇంట్లో వుండి చేసుకునే పనులే మానిపించివేస్తే బయటికి వెళ్లి యిసుక మోసుకరావడమా ! ఎవరికళ్లన్నా పడితే స్త్రీస్వాతంత్ర్యసమాజ కార్యదర్శి అయ్యుండీ భార్యచేత ఇటువంటి పనులు చేయిస్తున్నాడని తన కెంత పరువు నష్టం? "అదేంపని?" అని ముఖం చిట్లించి అన్నాడు. "వానలు కురిసి దొడ్డిగోడ అండ జారిపోయిందికదుటండీ, కలిపి వేద్దామని యిసుక జారబోస్తున్నాను" అన్నది ఆమె. "నీతో చెప్పిందేమిటి, నువ్వు చేసేదేమిటి?" అన్నాడు. "వంటపనులే కాదుటండీ మీరు చెయ్యవద్దన్నది?" అన్నది ఆమె."అట్లాగా? ఎప్పుడైనా యిసుక జారబోసిగాని, గోడకు అండ వేసిగాని ఎరిగున్నావా నీవు?"అన్నాడు. "నేను యింట్లోపనులు చేసుకుంటూవున్న ప్పుడయితే కూలిపెట్టి గోడలు బాగు చేయించుకునేవాళ్లం; ఇప్పుడు వంటమని షికీ డబ్బుపెట్టి గోడలకూ డబ్బుపెడితే సంసారం యేమన్నా మనాయించాలనేన టండీ? ఊరికే వుండి నే చేసేదేమిటి ? సొంతపనులు చేసుకుంటే తప్పటండీ? ఒళ్లు దాచుకుని కూర్చొంబోతే నామనసొప్పదు. మీరేమన్నా అనుకోండి" అన్నది. "అందు కని వుప్పరదానిలాగా గోడలు పెడతావా?" తూలనాడినందుకు అతనికే కష్టంవేసింది. కోపం అంతా క్షణంలో జాలిగా మారి పోయింది. "చాకిరీలో ఊరగాయవేసిన శరీ రాలు మరి, తొందరపడితే కార్యాన్ని సాధించలేం, నేర్పుగా తీసుకురావా" లని సమాధానపరుచుకుని "రమణా! తప్పని వంట పనే మానిపించివేసినప్పుడు యిసుక జార బొయ్యడం అంతకంటే చెడ్డపని అంటావా

లేదా? వద్దు, నువ్వేలాటి పనీ ముట్టుకోవద్దు. మహారాజుగా కూర్చో నీకేం" అని ఆమెచేతుల్లో పల్లికలాక్కొన్నాడు.

౪

రామానుజం బజారునుంచి ఎంతో వుల్లాసంతో చేమంతిపూలూ, దవనం పట్టుకొని వచ్చి "రమణా! సాయంత్రం అట్లా పార్కుకు ఇద్దరం షికారుకు వెళ్లుదాం, ముస్తాబు కా. దవనం,పూలూకూడా తెచ్చాను" అన్నాడు.

"షికారుకా? నేనా? ఎవరన్నా నవ్వుతారు! కావలిస్తే మీరు వెళ్లండి" అన్నది రమణమ్మ చదువుతూవున్న పుస్తకం మూసి.

"నేనా అంటే నువ్వుమాత్రం మనిషివి కాదూ? నాతోపాటు ఆనందాన్ని అనుభవించేటందుకు నీ కెందుకు హక్కులేదు? పొద్దస్తమానం ఈ మురికిగాలి పీలుస్తూ వుండడంకంటే సాయంత్రంపూటయినా అట్లా వెళ్లి మంచిగాలి పీలిస్తే ఎంత ఆరోగ్యం? అక్కడ రకరకాల పూలచెట్లూ అవీ యెంత ఆనందంగా ఉంటవి! వెళదాం రా."

"నా కే ఆనందాలూ వద్దు లెండి. ఇప్పటికే ఇరుగుపొరుగు అమ్మలక్కలంతా దీని గర్వమేమంటే దీనిగర్వమేమనీ, దీని నిక్కులేమంటే దీని నిక్కు లేమనీ ఆడిపోసుకుంటున్నారు. బజార్లు పట్టుకు తిరిగితే ఇంకా నిలిచేనా?"

"అదా నీ సందేహం? అట్లాగే చూస్తూ వుండు, ని న్ననుకునేవాళ్లంతా మా సమాజంచలువన భర్తలచేతులు పట్టుకుని బజార్లకు బయలుదేరకపోతే అప్పు డను. సంవత్సరంలోపలనే. గ్యారంటీ యిస్తాను. ముందుగానే మేలుకుంటే మార్గదర్శి వయ్యావనే గౌరవం నీకు దక్కిపోతుంది."

"పెళ్లాన్ని వెంటవేసుకుని యిది నా పెళ్లాం, యిది నాపెళ్లాం అని అందరికీ చూపించాలి కామాలు!"

"అందరికీ చూపించడం కాదు రమణా, ప్రకృతిని చూపించడమే దాని వుద్దేశ్యం."

"ప్రకృతిని చూడడమేగాని తనను యెవ్వరూ చూడ రన్నమాట! ఏమిటండీ, మీమాటలూ మీరూ. అక్కడికివెళ్లి చూసే దేమిటి? నేను రాను."

"అట్లనబోకు రమణా! అప్పుడే మా సమాజీకు లంతా భార్యలను వెంటవేసుకుని హాయిగా తిరుగుతున్నారు. నేను వెనకబడ్డందుకు యిప్పటికే నాకు సిగ్గుగా వున్నది. నీకు తప్పదు. ఎట్లైనా రావాలి."

ఎట్లైతేనేం, పోరాడి బయలుదేరదీశాడు. ఇద్దరూ గడపమెట్లు దిగి నడుస్తున్నారు. రమణమ్మకు భర్త వెంట నడుస్తూవుంటే యెంతో సిగ్గుగా వున్నది. వెళ్లేది పార్కుకు. అక్కడ ఎరిగున్నవాళ్లెవరన్నా చూస్తే యేమనుకుంటారో అన్న భయం ఆమెను తెగ బాధిస్తూ వున్నది. అయిదారు ఇళ్లు దాటారు. వీళ్లను చూసి ఒకమ్మాయి తలవాకిట్లోకి వచ్చి "అత్తయ్యా! ఎక్కడికి వెళుతున్నారు?" అన్నది. ఆప్రశ్నకు రమణమ్మగుండెలు గబగబా కొట్టుకున్నవి. ఎక్కడికి వెళుతున్నామని చెపుతుంది? విననట్లు తలవంచుకుని నడుస్తూన్నది. "ఇదుగో రమణమ్మత్తయ్యా! నిన్నే. ఎక్కడికి వెళుతున్నారు?" మళ్లీ అడిగింది ఆ అమ్మాయి. ఈసారి రమణమ్మకు కోపంగూడా వచ్చింది. "ఎక్కడికి వెళ్లితే వీళ్లకేం? వెధవప్రశ్నలు!" అనుకున్నది. పార్కుకువెళుతున్నామని ఎలా చెపుతుంది?

పైకి చిన్నగా నవ్వి "యెక్కడికీ లేదు కోడలా, శివాలయానికి వెళుతున్నాం" అన్నది. ఆ గల్లీ దాటాక నాలుగు బజార్లు కలిసిన చౌకు వచ్చింది. అక్కడ వచ్చే జనం పొయ్యేజనం చాలాసమ్మర్దంగావున్నది. రమణమ్మ ఆగింది. భర్త "నిలబడతావేం, రా" అన్నాడు. "అట్లా జనం వత్తిడిగా వుంటే ఎట్లా వచ్చేదండీ" అన్నది ఆమె. "ఫరవాలేదు, ముందు నేను దారి తీస్తూ వుంటాను రా" అన్నాడు. "అయ్యో! జనాన్ని రాచుకుంటూ ఎలా వచ్చేదండీ, వత్తిడి కాస్త తగ్గనివ్వండి" అన్నది. జనం తగ్గిపొయ్యేదాకా పది నిమిషాలు ఇద్దరూ నిలబడవలసివచ్చింది.

పార్కు చేరారు. అక్కడ బల్లలమీదా పొదలదగ్గిరా జనం నిండిపోయి వున్నారు. రేడియో నోరు తెరచుకుని యేదో పాడుతూ వున్నది. అందరూ మగవాళ్లు. ఆమెకు భిడియం వేసింది. అంతమందిజనంలోనూ స్త్రీలు ఇద్దరు మాత్రమే వున్నారు. ఒక స్త్రీ కళ్లకుజోడుపెట్టి కాళ్లకు చెప్పులు వేసుకొని వున్నది. ఇంకొకస్త్రీ గౌను తొడుక్కొని కాలికి బూటు వేసుకొని గిరజాజుట్టుతో వున్నది. వాళ్లను రమణమ్మ స్త్రీలకిందనే లెక్క వేసుకోలేదు. జనమంతా తననే చూస్తున్నట్టనిపించింది. "యిక్కడ కూర్చుందాం రా రమణా" అని ఒక పొదదగ్గిరికి తీసుకొని వెళ్లాడు. ఆపొద వెనకపక్కన అదివరకే కొందరు కూర్చునివున్నారు. వీళ్లు మరొకపక్కగా కూర్చున్నారు. కాస్సేపు కూర్చున్నాక "కాఫీహోటలుకు వెళ్లివద్దాం రా రమణా" అన్నాడతడు. "ఇవాళ కాఫీహోటలుకు రమ్మన్నారు, రేపు కల్లుకొట్లోకి రమ్మంటారు, ఏమిటండీ మీ మాటలన్నీ? ఆడవాళ్లు కాఫీ హోటలుకు వస్తారుటండీ? ఇక్కడికి వచ్చినందుకే ప్రాణం చచ్చిపోతూ వున్నది" అని విసుక్కున్నది. అతడు నవ్వి "సరే అయితే, నువ్విక్కడ కూర్చో. ఆ కనపడేదే కాఫీహోటలు. చప్పున వెళ్లి తినేందుకేమన్నా తీసుకొనివస్తా" అని వెళ్లి ఏవో మూడు నాలుగుపొట్లాలు కట్టించుకుని వెంటనే తిరిగి వచ్చాడు. ఆమె అక్కడ లేదు. యెటన్నా వెళ్లిందేమో నని అటూ ఇటూ చూచాడు. కనపడలేదు. ఖంగారుపడ్డాడు. ఎక్కడికి వెళ్లివుంటుంది? అసలే బలవంతాన తీసుకవచ్చాను; యింటిదారి పట్టివుంటుం దనుకుని చేతులో పొట్లాలు చూసుకుని దిగాలు పడిపొయ్యాడు. "ఏమండోయ్, ఇట్లా రాండి" అనే పిలుపు వినవచ్చింది. ఆవైపుకు చూచాడు. దూరాన తన భార్య జువ్విచెట్టుదగ్గిర నిలబడివున్నది. అతని ప్రాణం లేచివచ్చింది. ఆమె స్వతంత్రించి విహారిస్తున్నదని తన కృషి ఫలితానికి వస్తున్నందుకు లోలోన సంతోషిస్తూ త్వరత్వరగా ఆమె దగ్గిరికి వెళ్లాడు. ముఖం చూస్తే చిన్నబోయి వున్నది. "ఏం అట్లా వున్నావు?" అన్నాడు. "ఎట్లా వుండమన్నారు? మీరు వెళ్లాక, మనం కూర్చున్నచోటికి యెదురుగా గన్నేరుచెట్టు విరియపూసింది చూడండి, పువ్వొక్కటి కోసుకుందామని వెళ్లుతున్నాను. యెవడో చచ్చినాడు - వాడికి కళ్లున్నయ్యో పోయినయ్యో - రాచుకువెళ్లాడు. యెవ్వరూ తిరగరని ఇక్కడికి వచ్చి నిలుచుని మీకోసం యెదురుచూస్తున్నాను" అన్నది. అతడు బుజ్జగిస్తూ "అట్లయితే రేపట్నుంచీ వచ్చి కూర్చున్నచోటునుంచి ఎక్కడికీ కదలబోకులే రమణా." అన్నాడు.

౫

వంటమనిషిని పెట్టి నెలరోజులయింది. అదివరకు కామె ఎట్లా పొదుపుగా జరుపుకు నేదో కాని వచ్చే పాతికరూపాయలు సరిపొయ్యేవి. ఈ నెలకు పద్నాలుగురూపాయలు బాకీఅయింది. అతడు ఖర్చునుబట్టి ఎక్కువ సంపాదించాలని ప్రయత్నించాడు. కాని లాభం లేకపోయింది. రెండో నెల గడిచింది, మొత్తం ముప్ఫయి రూపాయలు అప్పయిపూరుకుంది. "ఈబాకీ ఎట్లా తీర్చడం? ప్రతినెలా ఇట్లా తరుగు జోతూవుంటే కొంప నిలుస్తుందా?" ఈ మాటలు అతని తలకాయలో గింగురు మన్నవి. అతని హృదయం భావినిగురించి తీవ్రచర్చలో పడ్డది.

బాకీకి వత్తిడి కలిగింది. ఇంతబాకీ అయిందని తన భార్యకు తెలియనివ్వవద్దని ముందుగానే బాకీదార్లకు చెప్పాడు. ఇంటి చుట్టూ రోజుకు నాలుగుసార్లు తిరగడం, ఎక్కడ కనపడితే అక్కడ పదిమందిలోనూ అడగడం అతనికి చిన్నతనంగా వున్నది. అసలే జరుగుబాటువిషయమైన దిగులుతో వున్నాడు. పైగా బాకీవాళ్ల బాధ! అతడు క్రుంగిపొయ్యాడు. ఎక్కడైనా అప్పుతెచ్చి బాకీ సరిపెట్టాలని స్నేహితులందర్నీ అడిగాడు. ఎవ్వరూ మావల్ల కాదంటే మావల్ల కాదన్నారు. ఎరిగివున్నచోట్లల్లా గాలించాడు. వృథా అయింది. ఇంక ఏవిధంగా బాకీతీర్చడం? అతని బుర్ర రెండోపని చెయ్యడం లేదు. భార్యమెడలో పుట్టింటివాళ్లిచ్చిన నల్లపూసల గొలుసుమాత్రం అతనికి కనిపించింది. కాని యివ్వమని ఎట్లా అడుగుతాడు? ఎందుకంటే యేమి చెపుతాడు? ఆమె వద్దన్నకొద్దీ దిగి, ఇప్పుడు ఇంత బాకీ అయిందని తన అసమర్థతను నోటిమీదుగా ఎలా చెప్పుకుంటాడు? విషమస్థితిలో పడి పొయ్యాడు.

ఆ రోజతనికి అన్నం సహించలేదు, విస్తరిముందు కూర్చుని లేచాడు. భార్యతో కూడా మాట్లాడబుద్ధి కాలేదు. ఆఫీసుకు వెళ్లి పొయ్యాడు. సాయంత్రం ఇంటికి తిరిగివస్తూ షాహుకారు ఎక్కడ తనను చూసి నిలవేస్తాడో అని ముఖం కనబడకుండా గొడుగు చాటుచేసుకుని ఇంటికి వచ్చాడు. భార్య వార్తాపత్రిక చదువుకుంటూవున్నది. అతణ్ణి చూసి మందహాసంచేసి మళ్లీ పఠనలో మునిగి పోయింది. అతడు కుర్చీలో కూలబడి "రమణా!" అన్నాడు. ఆమె చదవటం ఆపి "ఏమండీ" అన్నది.

"మీతో రెండురోజుల్నించీ చెప్పాలనుకుంటున్నాను. అతడు చేసే వంట నాకు సరిపడడంలేదు."

"అట్లాగటండీ! కొందరికి యేదైనా రోజుల్లోనే పట్టియిస్తుంది, మీకు రెండు మాసాలుగాని చాల్లేదు! ఒక్కొక్కళ్ల తత్వం తీరు."

"అబద్ధం చెప్పాలని యేం ఖర్మం?"

"నా కతని వంట భేషుగ్గా సరిపడి పోయింది. ఎంత ఆరోగ్యంగా వుంటున్న దనుకున్నారు?"

"నాకు సరిపడలేదు. సహించక పొద్దున అన్నమంతా వదిలిపెట్టివేశానుకదూ?"

"పోనీ, మీకు నచ్చిన పదార్థాలే చేయించుకోరాదూ?"

"అబ్బే! వాడిచేత అసలే కాదు."

"అయితే మరి యెట్లా?"

"నువ్వే ఆలోచించు."

"నే నాలోచించే దేముంది? వండి సిద్ధం చేసి విస్తట్లో పెడితే తింటాను."

"అట్లా కాదు. నీకుమాత్రం బాధ్యత లేదూ? ఆలోచించు. నువ్వు చేసినన్నాళ్లూ నా కెంతో ఆరోగ్యంగా వుండేది" అనుకూలమైన సమాధానం రాబట్టాలని అతని ప్రయత్నం.

"ఆమాట మీరేనా అంటున్నది? పాడు వంట ఇక నేను చేస్తానటండీ? ఈస్వేచ్ఛ, యీసుఖం, యీఆనందం వదులుకుని మళ్లీ ఆ లంపట్లో పడేటంతటి తెలివితక్కువదాన్ని కానండోయ్!"

అతని ఆట లేమీ సాగలేదు. ఆమాటలకు అతని ముఖం వెలవెలపోయింది. కాస్త అందివ్వగానే సంతోషంతో వంటలో జొరబడుతుం దనుకున్నాడు. ఇట్లా మారిపోతుం దని అత డెన్నడూ అనుకోలేదు. వెలితి మాట తా నన్నట్లు ఎట్లా వొప్పుకోగలడు?

"నిన్ను చెయ్యమనడం లేదు రమణా. నువ్వు చేసినప్పుడు ఆరోగ్యంగా వుం దన్నాను."

"అట్లయితే సరే."

తన వుద్దేశ్యాన్ని బహిరంగంచేసేటందుకు ధైర్యం ఆనటం లేదు. కొంపా గోడీ పోగొట్టుకుని చెట్లపాలు కావలసిందేనా? అతనికి నడిసముద్రంలో వున్నట్టున్నది. ఒక నిముషం ఆగి మళ్లీ అన్నాడు: "నా ఆరోగ్యం నీకు వద్దూ?"

"మీ ఆరోగ్యం నేనూ, నా స్వేచ్ఛ మీరూ చూడవలసిందే."

"ఎట్లాగు?"

"నా స్వేచ్ఛకు భంగం లేకుండా. ఇంకో వంటమనిషిని మాట్లాడితే నేవద్దన్నానా?"

"దుంగ దించి బండ నెత్తుకున్నట్టుంటుంది."

"ఇంక ఎట్లాగు మరి? పోనీ, నేను కొంత కాలం చేశానా, యికనించి మీరు చెయ్యండి వంట."

ఆమాటకు అతనిలో ఉన్న పురుష రక్తం వేడెక్కిపోయింది. ఇంతలోకే ఇంత మారిపోతుం దని కలలోనైనా అత డనుకోలేదు. తనమీది ప్రేమనుగూడా వదులుకుని ఇట్లా తెగబడి మాట్లాడుతుందని జన్మేపీ తలచలేదు. ఈ క్లిష్టసమస్యను ఎదుర్కొనే దెట్లా? అతని తలకాయలో మేఘాలు గర్జించినవి.

"నాచేత అనిపించుకోకుండానే మీకై మీరే దిగితే ఎంత బాగుండేది?"

"... ... ..."

"మీరు వంటచేస్తున్నారని మీ సమాజీకులకు తెలిస్తే ఎంత కీర్తి?"

"... ... ..."

"మీ బాగు కోరనిదాన్నయితే యీ మాట చెప్పనే చెప్పను. భర్త కీర్తి పొందాలనే భార్య తలుస్తుంది."

ఈమాట లతనికి శూలాలవలె తాకినవి. ఏమనటానికి ఏలున్నది? వంచిన తల యెత్తలేకపొయ్యాడు. ఇంతలో వీధితలుపు నెట్టుకుని ఒకవ్యక్తి లోపలికి ప్రవేశించాడు. రామానుజం తలయెత్తిచూశాడు. బాకీ షాహుకారు! అతని గుండెలు గబగబా కొట్టుకున్నవి. చిక్కుల్లో మునిగి అసలే చింతతో వున్నాడు. పైగా ఇత డొకడు! ఏం

సమాధానం చెప్పి పంపిస్తాడు? కష్టాలన్నీ ఒక్కమారే చుట్టవేసుకున్నవి. అతనికి జీవితంమీద విరక్తి పుట్టింది.

షాహుకారు చిన్ననవ్వు నవ్వి అన్నాడు: "బాబుగారి దర్శనాలే లేవు. ఇందాకా అమ్మగారు మొత్తం బాకీ ముప్ఫయివక్క రూపాయిచిల్లరా యిచ్చివేశారు. చిల్లర లేకపోతే రూపాయి యిచ్చారు. ఇదిగో మీకు పది అణాలు ఇవ్వాలి." అని చిల్లర రామానుజాని కిచ్చి వెళ్లిపోయ్యాడు. అతడటు వెళ్లడంతోనే ఇంట్లోనించి వంటమనిషి వచ్చి "నేను సెలవు పుచ్చుకుంటానండీ; రమణమ్మగారు ఇందాకనే వెళ్లిపొమ్మన్నారు, మీరు వచ్చాక చెప్పి వెళదామని వున్నాను." అని చెప్పి వెళ్లిపోయ్యాడు. ఇదంతా రామానుజానికి కొక సుఖస్వప్నంలాగా తోచింది. భార్యకేసి చూశాడు. ఆమె పమిటచెంగు చాటుచేసుకుని నవ్వుతూవున్నది. మెళ్లో చూస్తే గొలుసులేదు. "నాభాగ్యదేవతవు" అంటూ కావిలించుకున్నాడు.

# పొరపాటు

'సముద్రుడు'



అల్లలనాడదాయె నొక యామున నల్లని కారుచీకటుల్
ఎల్లెడ అల్లిబిల్లిగ మరేమియు కానగ నీక అల్లి భీ
తిల్లగ జేయు వేళలను తెంపిన తీగకు తీరుగాగ నే
పెల్లుగ ఉల్లమందు దురపిల్లుచు చిక్కని నీడజాడలన్,

ఎన్నియొనాళ్లనుండి ఒనరించెడి స్నేహము వీడి ఎవ్వరో
కన్నులు గుట్టి పల్కిన అకారణపౌరుష వాక్యయుంబులన్
కన్నడబూని, లోన కనికారము మున్నన మాని నిన్న అ
ట్లన్నది గాద యంచును ఎడందన కొందలమంది కుందుచున్,

నిఁబడియుంటి నచ్చట వినీలవిహాయసి కోట్ల లెక్కగా
మిఁమిలలాడు తారల నిమేషము వేయక చూచుకొంచు క
న్నుల మరలించి చూడగ కనుంగొనినాడను నాకు ముంగలన్
కొలదిదినాలముందు మదికోటనివాసము జేయు రాణినిన్.

వాతెర విప్పకుండ తన వామవిలోలదృగంచలంబులన్
భూతలమున్ సుడిన్ వడగ పుచ్చుచు పింపిరివోని ప్రేమతో
చేతము పొంగ ప్రీతిని రచించిన లేఖల ప్రేమముద్రికన్
చేతికి నిచ్చి ఇంతటితో చెల్లని చేతుల సన్నసల్పినన్.

"చాలునుచాలు నో చెలియ చాలును నేర్చితి నింక మంజువా
చాలత కామినుల్ పలుకు చక్కెరపూతల తీపితీపి వా
గ్జాలము నమ్మరాద నెడు సారము; ప్రప్రథమంబు గాన ఈ
లీలగ మోసపోయితి భళీ ఇక నెన్నడు గాదు లే చెలీ.

"వ్రాతలు లెన్న వ్రాయగను వచ్చు; సవారితపీతతద్గుణ
వ్రాతము దేవతానగరవాసులకే సరియంచు గొప్పగా
కోతలు కోయవచ్చు కవికోటులు; కోమలిమాట నీటిపై
వ్రాతయటంచు చెప్పు గుణహారము నీదయ నేడు నేర్చితిన్.

"ఏను విశాలదృక్పథవిహీనుడ నంచును నాకు భామినీ
మానసరోదసీచరదమాయక మంజులభావమేఘమా
లానుభవం బశావ మని యంచును లోకులు పల్కుచుందు రో
మానిని వా రెఱుంగ రిసుమంతయు తావకధూర్తవర్తనల్.

"కామిని వీవె? తస్కరశిఖామణి వీవు త్వదీయచిత్తమా
ప్రేమమరత్ప్రసారము లభింపని చీకటిగీము నీదు నె
మ్మోము మృషాప్రియంబులకు మూలపుటెంకి సుమా సుహాసినీ
నీమహనీయరూపమును నేడుగదా ఎరుగంగలింగితిన్."

అనుచు మనంబునం పెరిగి ఆలము సేసెడి కోపతాపముల్
కనకన మండు పౌరుషము క్రాగెడి నెత్తురు, దాచినన్ మదిన్
అణగని ప్రేమ నొక్కటిగ ఐక్యముచేసి వచింప ఆమె ఆ
వనమున పిచ్చిలింప చిరునవ్వులు నాదరిచేరి అల్లనన్.

"ఊరక నిన్నమాపున ఛలోక్తిగ పల్కినయట్టిమాట కీ
తీరున కిన్క. బూనతగ దీ"వని సానువునుండి క్రిందికిన్
జారెడు నిర్ఝరంబువలె నాయురమందున వ్రాలి కౌగిలిన్
జేరిచె మోహనిర్భరత జేసెడి చేతలమాట ఏటికిన్?



# 'రెంటికిం జెడినరేవఁడు'

= శ్రీ బండారు తమ్మయ్య =

పయినిచేర్కొనిన సామెతనుగూర్చి ఈ వృషసంవత్సర చైత్ర, వైశాఖ, ఆషాఢ భారతిసంచికలలోఁ గొందఱు విమర్శకులు ప్రకటించిన వ్యాసములను నే నీమధ్యనే చూచుట తటస్థించినది. "ఉంఛేకః కారికాం వేత్తి" అను శ్లోకమునుబట్టి పైసామెత యాశ్లోకమందలి రేవణునిఁగూర్చి వెలసినదయియుండు ననియు, 'రేవఁడు' అనుదానికి బదులు 'రేవణ' యని యుండుటయే సరియైన పాఠముగా నుండుననియుఁ జెప్పెడి వాదము నే నెఱిఁగినంతవఱకు మునుముందు వెలువరించినవారు శ్రీ అక్కిరాజు ఉమాకాంతము పంతులుగారు. వారు ప్రకటించెడి 'తెలుఁగుదేశ వాఙ్మయపత్రికలోఁ' జాలకాలముక్రిందట నిందుఁ గూర్చి నా రొకవ్యాసమును వ్రాసియుండిరి. అందుపయి ఆంధ్రపత్రిక సారస్వతానుబంధములో శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కాఁబోలు విమర్శకవ్యాసమొకటి వ్రాసి చాకలివానికథను చేర్కొనుచు 'రేవఁడు' అను పాఠమునే సమర్థించినట్లు నాజ్ఞాపకము. కావున 'రేవణ'యను పాఠము నేఁడు శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు క్రొత్తగా వెలయించినది గాదని మనవి చేయుచున్నాను.

శ్రీ కొడవంటి శంకరనరసింహబ్రహ్మంగారు చైత్ర భారతిలోఁ బ్రకటించిన ప్రథమవ్యాసములో నీ సామెత నుదాహరించిన ప్రయోగములు మూఁడు గౌరన హరిశ్చంద్రోపాఖ్యానము, పిల్లలమఱ్ఱి పినవీరన జైమిని భారతము, పెద్దన మనుచరిత్రములనుండి పేర్కొని యవి మూఁడునుగాడఁ జాకలివాని కథకే స్ఫోరకముగా నుండునని చక్కఁగా సమర్థించిరి. నాయభిప్రాయము కూడ నీ సామెత రేవఁడను చాకలివాని కథనుబట్టి యేర్పడినదే యైయుండు ననియు, రేవణుని కీ

దేమియు సంగతముగా నుండ దనియుఁ జెప్పుటయే. శ్రీ పెట్టి లక్ష్మీనరసింహముగారు, శ్రీ విక్రమ దేవవర్మ మహారాజుగారును లేవటినేల కిది ప్రసక్తించు నని చెప్పిన యర్థములు, సమర్థనములు కేవల మశ్రుతపూర్వములు, అసంభావ్యములు నని చెప్పుటలో శ్రీ శంకరనరసింహబ్రహ్మంగారితో నేను బూర్ణముగ నేకీభవించుచున్నాను. ఆనందప్రెస్సువారు ప్రకటించిన మనుచరిత్రములోని శ్రీ కొమాండూరి అనంతాచార్యులుగారి వ్యాఖ్యానమందును, వావిళ్లవారు ప్రకటించిన మనుచరిత్రమందలి శ్రీ వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానమందును "రెంటికిం జెడిన రేవఁడ నాదు నె నీరజేక్షణా" అను పద్యవ్యాఖ్యాన సందర్భమునఁ జాకలివానికథయే యుదాహరింపఁబడినది. బ్రౌనుదొరగారి పండితుఁడు శ్రీ జూలూరి అప్పయ్యపండితులు గూడ దీనినే పేర్కొనినట్లు తెలియుచున్నది. ఈ సామెతయొక్క యథార్థస్థితిని దెలిసికొనుటకు నుపకరించు ప్రాచీన కవిప్రయోగము మనవాఙ్మయములో శ్రీ శంకరనరసింహబ్రహ్మంగారు పేర్కొనినవి గాక మఱియొకటి యున్నది. దానినిగూర్చి యించుక ముచ్చటింతును.

పాలకురికి సోమనాథుఁడు నన్నయతిక్కనల మధ్యకాలమున క్రీ. శ. ౧౧౬౦–౧౨౩౦ ప్రాంతమున వెలసినవాఁ డని పలువురు నిర్వివాదముగ నంగీకరించియున్నారు. ఈ సోమనాథుని కృతులలో 'అనుభవసారము' అను చిన్న పద్యకావ్య మొకటి. ఆంధ్రపద్యరచనము నన్నయతిక్కనల నడిమికాలమునం బొందిన క్రమపరిణామమును గుర్తింపఁదలఁచువారికి 'అనుభవసారము' మిక్కిలి యుపకరింప నేర్చును. ఈగ్రంథములో సామెతను సోమనాథుఁడు వాడియుండుటచేతను, నే నెఱిఁగినంతవఱ కాంధ్రవాఙ్మయములో మొదట దీని నుదాహరించినది సోమనాథుని పద్యమే యని నా దృష్టికి గోచరించుటచేతను దీనిఁగూర్చి ౧౯౩౭ లో ప్రకటితమైన ఆంధ్రసాహిత్యపరిషత్తు రజతోత్సవ సంచికలో నేను వ్రాసిన 'పాలకురికి సోమనాథకవి–అనుభవసారము' అను వ్యాసములో నిట్లు వ్రాసియుంటిని. భారతిలో విమర్శనములు ప్రకటించిన మూవురు లేఖకులుగూడ నా పూర్వోక్తవ్యాసమును జదివియుండ రని తలంతును.

"సందర్భానుసారముగ జాతీయములను లోకోక్తులనుగూడ సోమనాథుఁ డీగ్రంథమున నందందుఁ జొనిపినాఁడు.

క. 'వంటని దుర్వ్యసనంబుల
వెంటఁగుఁగా కీశుభక్తి పెంపువకుం గా
కుంటఁజెను భక్తి వాసల
రెంటికి నెసతాఁకిచెడ్డ రేవనిభంగిన్.' (ప. ౧౧౨)

ఈపద్యము ముద్రితప్రతిలో నున్నదున్నట్లు లొసఁగితిని. వ్రాఁతప్రతులఁ బరిశోధించి సరియైన కవిపాఠమును గుర్తింపవలసియున్నది. రేవని కథఁగూర్చి మన విద్వాంసులలోఁ గొన్ని వివాదములున్నవి. రేవఁడను చాకలివాఁడు బట్టలుతుకుచుండఁగా వెల్లువ రాఁగా నతని తెలివితేమిచే నుతుకుచున్న బట్టలను, నదికి రేవుకొద్దున జాగ్రత్తపఱచిన బట్టలను రెండింటిని గూడఁ బోఁగొట్టికొనిన కథనుబట్టి సైసామెత యేర్పడిన దని కొందఱ యభిప్రాయము. రేవఁడను పాఠము తప్పనియు, 'రేవణ'యని యుండవలెననియు "ఈంచేకః కారికాం వేత్తి తంత్రం వేత్తి ప్రభాకరః, మండనస్తూభయం వేత్తి నోభయం వేత్తి రేవణః" అను శ్లోకములో శ్లోకవార్తికము, తంత్రవార్తికము రెండు నెఱుఁగక చెడినట్లు చెప్పఁబడిన రేవణుఁడే సైసామెతకుఁ గారణభూతుఁ డనియు మఱికొందఱ తలంపు. "రెంటికిం జెడినరేవఁడ నాదు నె నీరజేక్షణా" అని పెద్దన మనుచరిత్రమునందును, "రెండుబోవాడిన రేవనిరీతి, నుండ బాలకు నిన్ను నోరంత ప్రొద్దు" అని గౌరన హరిశ్చంద్రోపాఖ్యానములోను నీసామెత యుదాహరింపఁబడినది. నే నెఱిఁగినంతవఱ కాంధ్ర వాఙ్మయములో నిది మన సోమనాథుని యనుభవసారమునందే మొదట నుదాహరింపఁబడినది. "వాసల రెంటికి నెసతాఁకి చెడిన రేవనిభంగిన్" అనుచో 'వాసల' అనుదానికి సరియైన కవిపాఠము 'బాసలు' లేక 'బానలు' (చాకిబానలు) అయియుండునని నా యభిప్రాయము. వ్రాఁతప్రతులం బట్టి సరియైన పాఠము నిర్ణయించినచో దీనినిగూర్చిన వివాదము పరిష్కృతము కాఁగలదు."

అనుభవసారములోఁ గథారూపకమగు నితివృత్త మేదియు లేదు. గురుమహిమ, భక్తిస్వరూపము, భక్త లక్షణము మున్నగు విషయములఁగూర్చి తాను గ్రంథ ముఖమునను, భక్తజనములవలనను గని విని న యనుభవము లను సోమనాథుఁ డిందు వర్ణించెను. పూర్వోక్త పద్యము భక్తిస్వరూపవర్ణన సందర్భములోనిది. సరియగు నింద్రియనిగ్రహము లేక యొకవంక విషయసుఖము భవ్యమునకు, మఱియొకవంక శివభక్త్యానందోన్ముఖత్వ మునకుఁ దివురు భక్తునిఁగూర్చి పూర్వోక్తపద్యము చెప్పఁబడినట్లు గాన్పించును.

"ఎనతెఁకి చెడిన" అనుటలోని గీఁతగీసిన విశేష పదము, 'వాసల'పదమునకు సరియైన కవిపాఠము తెలిసినచో నీసామెతయొక్క యథార్థస్వరూపమును గ్రహించుటకు బుద్ధిమంతులగు విమర్శకులకు మిక్కిలి తోడ్పడఁగలదు. 'వాస' శబ్దము సంస్కృతమున సకారాంతనపుంసకలింగము; 'వస్త్రము' అను నర్థమునఁ గలదు. దానికిఁ బ్రథమైకవచనము వాసస్సు, వాసము అనియు, బహువచనము వాసస్సులు, వాసములు అనియు నేర్పడును (ఉదాహరణము: గ్రాసవాసములు). కావున 'వాసలు' అను రూపము వస్త్రము లను నర్థమున నుపయోగింపఁదగదు. వ్రాఁత ప్రతులలో 'వాసల' లేక 'వాసలు' అనియే యున్నచో నట్టి రూపమును సోమనాథుఁడు వస్త్రములు (బట్టలు) అను నర్థమునందే యుపయోగించెనేమో యని విచారింపఁ దగును. 'వంటు' శబ్దము 'ఆనుకూల్యము' అను నర్థ మున శబ్దరత్నాకరమున దేశియవిశేష్యముగా నుదా హరింపఁబడినది. కాని 'అనుకూలించు' అను నర్థమున దానిని క్రియాపదముగఁ గూడ నుపయోగింపఁదగు నేమో? అట్లయినచోఁ బై పద్యమందలి "వంటని దుర్వ్యసనంబుల" అనుచో అనుకూలింపని(హితముకాని) యింద్రియవ్యసనంబు లని యర్థము చేయవచ్చును. 'పెంటగు' అను ముద్రితపాఠమునకు సరియైన కవిపాఠ ము 'పెంటకు' అని యైయుండును. 'పెంట' యనఁగా ప్రోవు, అతిశయము నని యర్థము చెప్పఁదగును. కావునఁ బై పద్యమందలి యుపమేయమునకు, ఇంద్రియములను లెస్సగా నిగ్రహింపఁ జాలని భక్తుఁ డొకవంక నాయిం ద్రియసుఖానుభవాతిశయమునకు, మఱొకవంక శివ భక్త్యానందాతిశయమునకు రెంటికిని గూడఁ గొఱగాక చెడునని భావార్థము చెప్పవచ్చును. ఈ యుపపత్తు లతో బుద్ధిమంతులు సోమనాథుని ప్రయోగము నను సరించి పై తెలుఁగు సామెతయొక్క యథార్థ స్వరూపమును నిర్ణయింతురుగాక!



# నారదుడు - కర్మఫలము

= శ్రీ వసంతరావు వెంకటరావు =

"పురాణాల్లో పవిత్రమైన హిందూ దేవతల్ని insult చేశారు. హిందువులు ఏ దేవతల్ని తమ దేవుళ్లలాగ పూజించుకొంటున్నారో ఆ దేవతలు పురాణాల్లో వట్టిఫూల్స్‌గా కనబడుతున్నారు. పురాణాల్లో బండబూతు లున్నవనీ, అవి హిందూమతస్థుడికి అవమానకరం అనీ, వాటిని నిర్మూలించాలనీ నే నీరోజున అంటూంటే సనాతనులూ, ముసలితాతల అభిప్రాయాలకు వారసులుగా నున్న యువకులూ నామీద బ్రహ్మాండమైన వ్యతిరేకప్రచారం చేయడానికి బయలుదేరితే నాకేం విచారం లేదు. పురాణాలమీద అభిమానంవున్న ప్రతీవాడూ మన పవిత్రమైన దేవతల మానాభిమానాల్ని రక్షించటానికి బయల్దేరాలి..." అని 'పురాణాలను పూజిస్తారా' అన్న వ్యాసంలో ఒకరు తీర్మానం చేశారు. ఇది అతిసాహసమైన వ్రాత. "దేవతల మానాభిమానాల్ని రక్షించటానికి బయల్దేరడం" ఎట్లు సాధ్యమౌతుందో ఊహాతీతము. గ్రంథస్థమైయున్న మహాపురుషుల పాత్రలను మానవుడు సంస్కరింప పూనుకొంటే హాస్యాస్పదము. పురాణేతిహాసాలు లిఖించిన మహాఋషిపుంగవులకన్న మనం మేధావంతుల మనుకొని వారిలోపాలు దిద్దితీర్చుటకు బయల్దేరుట అక్షంతవ్యము, ప్రమాదకరము అయిన లక్షణము.

మన పురాణాలు కాలప్రవాహంలో కొట్టుకొని పోకుండా వేలకొలది యేండ్లు అదర్శప్రాయంగా నున్న ఉత్తమ గ్రంథాలు. క్రీ. పూ. ౫-వ శతాబ్దం నుండి భారతీయ విజ్ఞానాన్ని అణగద్రొక్కడామన్న దృఢసంకల్పంతో అనేక మతములవారు, జాతులవారు దానిపై దాడి చేశారు. దేవాలయాలను శిథిలం చెయ్యాలనీ, దేవతావిగ్రహాలను ధ్వంసం చెయ్యాలనీ అనేకులు ప్రబలప్రయత్నాలు చేశారు. అట్టి ముష్కరుల దుస్తంత్రానికి కొన్ని దేవాలయాలు గురి గావింపబడక పోలేదు; దేవతావిగ్రహాల నలంకరించియున్న వజ్ర వైడూర్య మరకత రత్నాది ఖచిత స్వర్ణాలంకారాలు అపహరింపబడక పోలేదు. కాని, ఆధ్యాత్మిక సంపన్నులగు మహాతపస్సులు ప్రతిష్ఠించిన యంత్ర మహత్వంచేత కాశి, జగన్నాథం, సింహాచలం, తిరుపతి, రామేశ్వరం మొదలగు పుణ్యక్షేత్రాలు యాత్రికసమూహాలకు నేటికిని అత్యంతదర్శనీయంగానే ఉన్నాయి. అది భారతీయ సంస్కృతి. అట్టి భారతీయ సంస్కృతిని అపహసింపదలచుకొన్నవా రెవరైనాసరే ముఖ్యంగా ఆత్మశోధనం చేసుకొని తమ పాత్రత యోచించుకొన వలసిఉంది.

పురాణాలకు బహువిధ ప్రయోజన ముంది. మానవునియందు సుప్తంగా నున్న శక్తిసామర్థ్యాలను యథేచ్ఛగా మానవుడు పెంపొందించుకొనగల విధానం సూచించే దొకటి. యావజ్జీవజాలంలో మానవజాతి యొక్క సర్వోత్కృష్టత మెరిసించే దొకటి. భూమిలో మానవజాతియే జనించిఉండకపోతే భూతలం ఇట్లుండేది కాదు. ఈ మహోన్నత సౌధాలు, రమ్యతోరారామాలు, ఇంపుల నింపు తోటలు, పంటల యంత్రాలు నేటివలె జీవసౌఖ్యానికి తోడ్పడి యుండవు. మానవుడే భూలోకంలో లేకపోతే భూతలం సంకీర్ణ కాంతారమయమై బీభత్సంగా ఉండేది. మృగపక్ష్యాదులు ఆ బీభత్సాన్ని ఉపసంహరించి సౌందర్యాన్ని నెలకొల్పలేకపోయేవి.

ఐతే, సమస్తజీవులలో మానవునకే ప్రాధాన్యం, ఔన్నత్యం ఎట్లలవడ్డాయో విచారణీయము. మానవాభ్యున్నతికి మూలమైనవి ఆకాంక్ష, లక్ష్యం, సాధనం, విశ్వాసము. ఐహికంకన్న వాంఛనీయమైనది, ప్రాపణీయమైనది వేరొండు కలదని గుర్తించినది మానవుడొక్కడే. వివిధస్వానుభవాలను సంకలనం చేసుకొని, తనతో ప్రకృతి ప్రవర్తించు విధానాలు గమనిస్తూ స్వాభ్యుదయకరమగు ఉత్తమపథాలు నిర్మించుకొన్నది మానవు డొక్కడే! అట్టిసందర్భంలో ఒక ఆకాంక్షబీజం మానవునిలో అంకురించింది. అది వృక్షమై,

చిగిర్చి ఉత్తమలక్ష్యపుష్పాలని వికసింపజేసింది. ఆ కుసుమసౌరభాఘ్రాణానందానుభూతికి తద్వృక్షపోషణసాధన మవసరము. తత్సాధనమునకు విశ్వాసబల మగత్యము. విశ్వాసబలం కూర్చేది మతామృతపానము. కాబట్టి విశ్వాసమే లక్ష్యానికి ప్రాతిపదిక. విశ్వాసం ప్రతిసందర్భమందు అవసరమే. ఆత్మవిశ్వాసము, బంధుమిత్రులలో విశ్వాసము, సంఘంలో విశ్వాసము, సమస్త చరాచరసృష్టికిని హేతుభూతమై నక్షత్రగ్రహాలను సురక్షితంగా అనంతాకాశంలో నడుపుతూన్న విశ్వశక్తులలో విశ్వాసము–ఏట్టి విశ్వాసమైనా మానవున కత్యవసరము.

అట్టి విశ్వాసమే క్షీణించినప్పుడు, నశిస్తున్నప్పుడు చుక్కానిలేని నావవలె మానవుడీ జీవితసాగరంలో కొట్టుకొనిపోతాడు. విశ్వాసబలం క్షీణించగానే సాధన మసాధ్యమౌతుంది. సాధనము కృశించగానే ఉత్తమలక్ష్యపుష్పాలు శుష్కించిపోతాయి; ఆ కాంక్షావృక్షం ఎండిపోతుంది. అంతేకాక, విశ్వాసబలం క్షీణించగానే జడత పెచ్చుమీరి ఆకాంక్ష కృశిస్తుంది. ఆకాంక్షాదుర్బలత్వంతో లక్ష్యం అస్ఫుటమై తుదకు అదృశ్యమౌతుంది. ఇక, మృగపశ్వాదులతో పాటు మానవజాతిసైతం ప్రత్యేకవిశేషత కోల్పోయి, అజ్ఞానాంధకారావృతమై, స్వకల్పిత నాగరికతా సౌధధ్వంసమును నివ్వెరపాటుతో నాలోకించవలసిన దుర్గతి మానవునికి ప్రాప్తిస్తుంది.

విశ్వాసాన్ని కూకటివేళ్లతో ఊగిసలాడించింది భౌతికవిజ్ఞానము. భౌతికవిజ్ఞానంచే సంస్కరింపబడిన పాశ్చాత్య నాగరికతా వ్యాప్తినే మన మతాచారాలలోను, ప్రాచీనసంప్రదాయాలలోను నమ్మకం పోతూంది. ఏవిషయమైనా సహేతుకంగా వివరింపబడితేనేకాని అంగీకృత మౌటలేదు. కాని, మతరూపంలో ప్రచారమౌతున్న సంప్రదాయాల వైజ్ఞానికవివరణ కనుగొనడానికి ప్రయత్నించేవారికి భౌతికశాస్త్రాలలో పరిణతజ్ఞాన ముండాలి. యువకులకూ, సామాన్యజనానికీ అంతటి జ్ఞానముండడానికి అవకాశం లేదు. అల్పజ్ఞానం గలవారికి ప్రాచీనమే నిరర్థకంగా గోచరిస్తుంది. అంతటితో దానిపై నిరాదరణభావం జనిస్తుంది. నిరాదరణభావంతో అవిశ్వాసం పెరుగుతుంది. ఇట్లు, సమగ్రజ్ఞానార్జనకు అవకాశంలేని సామాన్యులు తమ తలకు మించిన పని తలపెట్టి, సాధింపలేక, విసిగి, విశ్వాసహీనులగుచున్నారు. సాఫల్యరహితమైన క్లేశానుభవమే దాని ఫలితము.

ఇట్టి విషమస్థితిలో తరణోపాయ మొక్కటే గలదు. విశ్వాసం అను తెరచాపను లేవనెత్తాలి; నమ్మకమనే చుక్కానిని చేపట్టాలి; జీవితార్ణవంలో జీవనౌకను చాంచల్యవాయుప్రచోదితం కానీయక ఉత్తమలక్ష్యతీరముఖంగా నడిపించాలి. అప్పుడు నైరాశ్యవాతావరణం నిర్మల మౌతుంది.

మన పురాణేతిహాసాలలో గుప్తంగా నున్న భావార్థం గ్రహించినప్పుడే మన జీవనౌకలను యథేచ్ఛగా, సరళంగా, నిరాటంకంగా నడిపించడానికి సాధ్యమౌతుంది. పౌరాణిక స్త్రీపురుషులను వ్యక్తులుగా భావించవలసిన అవసరంలేదు. మహత్తరమైన అభిప్రాయాలను పారంపర్యంగాను, నిష్కళంకంగాను మానవుల కందజేయడానికై మహర్షులు వాటికి మూర్తిమత్వమిచ్చి దేవదానవులుగా చిత్రించారని మనం భావింపవచ్చును. భూలోకవ్యక్తులను విమర్శించిన ప్రమాణాలతో పౌరాణికపాత్రలను విమర్శించినప్పుడు వారి చర్యలు, నడవడి అసందర్భంగా గోచరించవచ్చును. కాని ఆ విధానమే ఘోరమైన పొరపాటు.

పాశ్చాత్య నాగరికతా వ్యామోహంచేత సామాన్యులందు జనించిన సంప్రదాయ తృణీకరణభావానికి సామాన్యంగా వ్యాప్తమైయున్న భౌతికవిజ్ఞానాభిప్రాయాలు దోహద మౌతున్నాయి. కాని, భౌతికవిజ్ఞానాన్ని కొంతవరకైనా అవగాహన చేసుకొనకుండ ప్రాచీనాన్ని విమర్శించుచుండుటే దీనికి మూలకారణము. ఏభౌతికవిజ్ఞానం మానవవిశ్వాసాన్ని చలింపజేసినట్లు కనిపిస్తున్నదో, ఏభౌతికవిజ్ఞానం జనసామాన్యంలో సంప్రదాయ తృణీకరణ భావోత్పత్తికి మూలకారణంగా తలచబడుచున్నదో, ఏభౌతికవిజ్ఞానం మతదైన్యానికి హేతువుగా భావింపబడుచున్నదో ఆ భౌతికవిజ్ఞానసాహాయ్యంచేతనే మన పురాణేతిహా

పాలను కూలంకషంగా పరిశీలించినప్పుడు వాటి ప్రాశస్త్యంకూడా గోచరిస్తుంది.

పురాణపురుషులు చేతనత్వ మారోపింపబడిన ఉత్తమాభిప్రాయా లన్న భావంతో ఇక్కడ నారద పాత్రను విమర్శిస్తాను.

జగత్తును మూడుభాగాలుగా విభజింపవచ్చును: యావద్విశ్వంలో నున్న జడద్రవ్య మొకభాగము— కొండలు, నదులు, ఎడారులు, గ్రహాలు, నక్షత్రాలు, నెబ్యులాలు (Nebulae) మొదలైనవి; భూలోకంలో నున్న మానవాదిజీవులు రెండవభాగము; మానవాతీతమైన ఇతర జీవసంఘాలు— దేవతలు, దానవులు మొదలైనవారు— మూడవభాగము. జడద్రవ్యలోకానికి వర్తించు ప్రధానసూత్ర మొకటి ఆంగ్లేయవిజ్ఞాని న్యూటనుచే ప్రతిపాదింపబడింది: "ప్రతియొక్క క్రియకును సమానమును, వ్యతిరేకమును అగు ప్రతిక్రియ ఉండును; లేక రెండు వస్తువులయొక్క అన్యోన్యక్రియలు సమానముగను, వ్యతిరేకముగను ఉండును." ఈసూత్రంలో రెండు వస్తువుల అన్యోన్యసంబంధం నిర్వచింపబడింది. ఒకబల్లమీద పుస్తక మున్నట్లైతే ఆపుస్తకం బల్లమీద ఒత్తిడి కలిగిస్తుంది. ఆ ఒత్తిడికి సమానమును, వ్యతిరేకమును అయిన ఒత్తిడి పుస్తకంపైని బల్ల కలిగిస్తుంది. లేనియెడల రెండు వస్తువులూ తటస్థంగా, నిశ్చలంగా ఉండలేవు. బల్లయొక్క ఒత్తిడి అధికమైతే పుస్తకం పైకెగిరిపోవాలి; పుస్తకంయొక్క ఒత్తిడి సాపేక్షంగా అధికమైతే బల్ల అణగారిపోవాలి. ఆ రెండును సంభవించుట లేదు. అది మన ప్రత్యక్షానుభవము. కాబట్టి ఆవస్తువుల అన్యోన్యప్రవృత్తులు, లేక కర్మలు సమానంగాను, వ్యతిరేకంగాను ఉన్నాయి. జగత్తులో నున్న సమస్త జడద్రవ్యానికీ ఈ సూత్రం వర్తిస్తుంది. ఇది భౌతికవిజ్ఞానంలోనిది.

అన్యబలప్రేరణం లేనిదే జడములు స్థానచలనం పొందలేవు. వాటికి స్వప్రవృత్తి లేదు. కాని, జంగమ ప్రపంచంలోని జీవులకు ఇచ్ఛాస్వాతంత్ర్య ముంది. సామాన్యంగా తమ ఇచ్ఛానుసారం ప్రవర్తించగల సహజలక్షణం జీవుల కున్నది. వారు కర్మ లాచరిస్తూ ఉంటారు. అవి సత్కర్మలు కావచ్చును, దుష్కర్మలు కావచ్చును. కర్మాచరణమప్పుడు ప్రకృతిశక్తులతో సంఘర్షణం జరుగుతుంది, తోడి మానవులలో సంఘర్షణ సంభవిస్తుంది, జడద్రవ్యంతో సంఘట్టన వాటిల్లుతుంది. ప్రకృతిశక్తులు, తోడిజీవులు, జడద్రవ్యం కూడా మానవునికి వ్యతిరేకంగా ప్రవర్తించడం జరుగుతుంది. కాబట్టి, జీవులకు తమకర్మానుభవం తప్పదంటే ఆధునిక విజ్ఞానదృష్టిలో సైతం అది సమంజసంగానే ఉంది. కర్మసిద్ధాంతం విశ్వసనీయ మనే అభిప్రాయ మేర్పడుతుంది. ఈకర్మసిద్ధాంతం సమస్త జీవలోకానికీ — భూమిలో — వర్తిస్తుంది. దీనికి సమానాంతరంగా సమస్తజడద్రవ్యలోకానికీ వర్తించు న్యూటన్ సూత్ర ముంది.

అయితే, మూడవభాగానికి చెందిన దేవదానవాది విశేషజీవుల మాటేమి అని ప్రశ్నిస్తే, కర్మానుభవం వారికైనా తప్పదని నిరూపించడానికి, ఆభావానికి చైతన్యమారోపించి, మూర్తిమత్వ మిచ్చి, 'నారదు' డను పేరు పెట్టినట్లు కనిపిస్తున్నది. కేవల నిరామయుడును, నిర్గుణుడు, రూపరహితుడు అయిన భగవంతుడు తప్ప ఇతర దేవత లెవరికైనా వారి కర్మానుభవం, కర్మయొక్క ప్రతిఫలం తప్పదని నిరూపించుటకే నారద పాత్ర సృష్టింపబడినట్లుంది. న్యూటన్ సూత్రము, కర్మసూత్రము, నారదసూత్రము — ఈమూడును క్రమంగా జడద్రవ్యమునకు, భూలోకజీవులకు, అంతకు విశిష్టమైన సురాసురులకు వర్తించకతప్పదని తెలియజేయడానికే నారదుడు పౌరాణికపురుషుడుగా చిత్రింపబడ్డాడా అనిపిస్తుంది. భూలోకజీవులకే చెందు కర్మసిద్ధాంతము నారదరూపేణ సార్వత్రికము (universal) గా చేయబడినట్లుంది. తద్విధాన మాలోచింతము.

సామాన్యంగా నారదుని పేరు వినని వా రుండరు. నారదునకు 'కలహప్రియుడు', 'కలహభోక్త' అని ఉపనామము లున్నాయి. ఇద్దరు వ్యక్తులమధ్య కలహబీజం నాటడమే నారదునిపని. ఆయన కలహింపడు. కాని, ఆబీజం విచ్చి, పుష్పిస్తే అమందానంద మొందుతాడు. అది ఫలిస్తే ఆఫలా లారగించి సంతృప్తుడౌతాడు.

నారదుడు బ్రహ్మమానసపుత్రుడు. సృష్టికర్తయొక్క ఒక ప్రధానాంశ. ఆయన నిర్లోపవాసి,

శరీరపోషణకు అన్నపానాదులుగాని, ఎట్టి ఆహారం గాని ఆయన కక్కరలేదు —కలహవృక్షఫలాలుతప్ప. ఆయన కొక నిలయ మున్నట్లు లేదు; ఆయన త్రిలోక సంచారి. యావద్విశ్వంలో ఆయన పవిత్ర పాదతాడనంతో పూతంగాని స్థలం అంగుళమైనా లేదు. ఆయన నిత్యసంచారి, సర్వవ్యాపి. ఆయనసంచారానికి వాహనాలు అవసరంలేదు; బాటలు అగత్యం లేదు. ఆకాశమార్గంలో మనోవేగంతో కావలసిన ప్రదేశానికి కనురెప్పపాటులో పోగల ధావరి. దేవదానవులే కాదు, సృష్టిస్థితిలయకారకులగు త్రిమూర్తులు సైతం నారదుని గౌరవిస్తారు; నారదు డంటే భయపడతారు.

అయితే, నారదు డెట్టి సందర్భంలో జోక్యం కలుగజేసికొనగలడు? ఎంత కలహప్రియు డైనప్పటికీ ఏ ఇద్దరు వ్యక్తులైనా కలహించేటట్లు చేయగలడా? లేదు. ఆయన ప్రవేశించగల స్థలంలో కొన్ని పరిస్థితులు ఏర్పడిఉండాలి. అందులోనున్న వ్యక్తులందు అహంకారము, అహంభావము, మాత్సర్యము పెచ్చుమీరి ఉండాలి. అప్పు డక్కడకు నారదుడు పరుగెత్తుకొని పోయి కలహం కల్పించి వాటిని నిర్మూలిస్తాడు. నారదుని చరిత్రవల్ల ఒక్కవిషయం స్పష్టమౌతుంది. నారదుని మధ్యగమనంమూలంగా దేవదానవులలో సైతం ఒకరిని అవమానించదలచినవారే అవమాన మొందుతారు; ఒకరిని భిన్నపరచబోయినవారే భిన్నులౌతారు. ఎంత ఉద్రేకంతో అహంకారం జనించి ప్రసరిస్తుందో అంత ఉద్రేకంతోనే అది నిర్మూలింపబడాలి. అది నారదునిమూలంగా సిద్ధిస్తుంది. దేవతలకైనా కర్మానుభవం అయితీరవలసినదే. ఆ కర్మానుభవానికి పూర్వం నారదుడు అచ్చోటికి పోయి తగిన ఏర్పాటు చేసేటట్టు మన కథాఖ్యానాలలో కనిపిస్తుంది. మానవులకన్న ఉత్తమజీవులు కాబట్టి వారిలో వైరం మానసికంగా జనించినా చాలును, ప్రతిఫలానుభవం తప్పదు.

దానికి తార్కాణంగా శ్రీకృష్ణతులాభారమును పేర్కొనవచ్చును.

సత్యభామ శ్రీకృష్ణుని ముద్దులభార్య. ఆమె అతిగర్వి, మాత్సర్యపూరిత, కరడుగట్టిన అహంకారము. రుక్మిణి పరమపతివ్రత; లోకానికి ఆదర్శప్రాయముగా నున్న సతీమణి. ఆమెపై సత్యభామ కపరిమితమైన ఈర్ష్య. పట్టపుదేవియగు రుక్మిణిమీదకన్న తనపై శ్రీకృష్ణునికి అపారమైన ప్రేమగలదని లోకానికి ప్రదర్శించి, తన్మూలంగా రుక్మిణిని అవమానిద్దామని సత్యభామకు కోరికపుట్టింది. మానసికంగా ఆమె కర్మ మాచరించింది; ప్రతికర్మ అనుభవించితీరాలి. నారదుడు ప్రత్యక్షమౌతాడు. భర్తృదానవ్రత మాచరించి భర్తను దానమిస్తే ఆమెపై భర్తకున్న ప్రేమ, భర్తపై ఆమెకున్న అధికారము లోకానికి వెల్లడి కాగలవని చెప్పి భర్తృదాన వ్రతాచరణానికి సత్యభామను నారదుడు పురికొల్పుతాడు. ఆమె ధనాఢ్య. తన భర్తను తూచగల పాటి ధన మామెవద్ద లేకపోలేదు. శ్రీకృష్ణు డేమాత్రం బరువుంటాడు? ఇట్టి ధనమదాంధత. దానికిని తగిన ప్రతిక్రియ జరగాలి. భర్తఅంగీకారంతో సత్యభామ వ్రత మాచరిస్తుంది. ఇక తులాభారం. ఎంతధనం వేసినా, ఎన్ని సొమ్ములు వేసినా శ్రీకృష్ణుని తూచలేవు. ఆమె ధనం వ్యర్థమైపోయింది. ధనగర్వ ముపసంహరింపబడింది.

సత్యభామ నిర్విణ్ణురా లయింది. భర్తను తిరిగి సంగ్రహించే ఉపాయం చెప్పమని నారదుని ప్రార్థించింది. ఆ కార్య మొక్క రుక్మిణికే సాధ్య మౌతుందని చల్లగా చెప్తాడు. రుక్మిణిని వేడుకొనుటకన్న తరణోపాయం లేదంటాడు. సత్యభామకు అంతకన్న అవమానం లేదు. అవనతవదనయై రుక్మిణికడ కేగి, తానొనర్చిన అకార్య మెరిగించి భర్తనెట్లైనా బంధవిముక్తుని చేయమని అర్థిస్తుంది. ఏ అవమానం రుక్మిణికి చేదామనుకొందో అది తనకే ప్రాప్తమయింది. తుదకు, రుక్మిణీపాదసేవ చేయు దుస్థితికూడ సత్యభామకు సంభవిస్తుంది.

రుక్మిణి ఉదారహృదయ, భర్తృసేవాపరాయణ. భర్తను పునః గ్రహించుటకన్న ఆనందప్రదమగు కార్యమేమున్నది? ఒక్క తులసీదళంతో తులాదండాన్ని త్రిప్పివేసింది; శ్రీకృష్ణుని పరిగ్రహించింది. రుక్మిణీకటాక్షంచేతనే సత్యభామ శ్రీకృష్ణుని చేరగలిగింది. సత్యభామకు కర్మానుభవం అయింది.

ఈకథలో నారదుడనే పాత్ర లేకపోతే కథ యథావిధి సాగదా? సాగుతుందనే చెప్పాలి. ప్రతివ్యక్తి ఆత్మసంఘర్షణం అనుక్షణమూ అనుభవిస్తూ ఉంటాడు. అట్టి సమయంలో కొల్లలుగా యోచన లుత్పన్నమౌతాయి. హృదయావస్థ కనుగుణంగా మంచివిగాని, చెడ్డవిగాని జనిస్తూఉంటాయి. అహంకారప్రాబల్యం చేత భర్తృదానవ్రతాభిప్రాయం సత్యభామహృదయంలో సహజంగా జనించిఉండవచ్చును. అనివార్యమైన ప్రతిక్రియానుభవయోగమే ఈ భావాన్ని ఆమెలో ప్రవేశపెట్టి ఉండవచ్చును. కాబట్టి నారదు డొక వ్యక్తియై యుండనక్కరలేదు. కర్మానుభవ సూత్రంయొక్క వ్యాపారంచేతనే ఈకథ ఇట్లు పరిణామ మొందవచ్చును.

ఈ దృక్పథంలో పురాణాల నాలోకించినందువలన లాభమేకాని నష్టంలేదు. మానవాభ్యున్నతి మానవు లవగమించు సిద్ధాంతాల కనుగుణంగా ఉంటుంది. ప్రాచీనభావాలని శోధనచేసి సంఘంలో అలజడి కలిగించినందువలన ముప్పువాటిల్లుటేకాని వేరుప్రయోజనం లేదు. ఇదమిత్థమని నిర్ణయించలేని విషయములపై వ్యాఖ్యాన మొనర్చినప్పుడు అది అథవా సంఘాభ్యుదయకరంగానైనా ఉండాలి. కర్మప్రతికర్మల తౌల్యమును ప్రత్యయజనకంగా నిరూపించి, సంఘపురోభివృద్ధికి తోడ్పడువిధంగా ప్రవర్తించుమని మానవుని హెచ్చరించినప్పుడు, సామాన్యంగా ఆ హెచ్చరికను త్రోసిపుచ్చలేడు. మానవాతీతులైన జీవులకే కర్మానుభవం తప్పదన్నవిషయం నారదరూపేణ వ్యక్తమౌచున్నప్పుడు మానవునియొక్క పరిమితత, అశక్తత స్పష్టమౌటకు సందేహం లేదు. తన్మూలంగా మానవుడు ఋజుమార్గ మవలంబించుటకు హృదయపూర్వకంగా ప్రయత్నిస్తాడు. అదేకదా వాంఛనీయము!



# విచికిత్స

శ్రీ ప్రయాగ
కోదండరామ శాస్త్రి

౧

ఆలపించితి భూనభోభ్యంతరమ్ము
మాఱుమ్రోగగ పరిదీన మధురగీతి;
ఆలకించితి మాఱ్మ్రోగునట్టి దెసల
నించుకే సానుభూతి విన్పించు ననుచు.

౨

చిలుకపలుకులవలె నాదు పలుకు లెల్ల
మఱియు మఱియును బలుకఁగంబడియె; గాని
అక్కటా, ఒక్క దెసయు మదాశయమున
నులికినది లేదు, లేదు మాఱ్పలికినదియు.

౩

సుముఖనై తోచు దిక్కుల చూపులందు
ఇంగితజ్ఞత కనిపించు నేమొ యనియు,
అశ్రువుల ఛాయలైన దారాడు నేమొ
యని పరిభ్రాంతినై నాశ లరసినాడ.

౪

ఇంగితజ్ఞత కవితాప్రవృత్తియందు,
దృగ్జలచ్ఛాయ లానందవృత్తియందు—
ఏమి భావుకలోక, మాహా—మదీయ
దీన పరిదేవనమున కిదే ఫలమ్ము!

౫

పదపద పరీక్షకై యొక పండితుండు
త్రెంచినాడట! భావసూత్రికల నెల్ల;
వస్తుమాత్రైకమతి నొక పామరుండు
ఎంచినాడట! శబ్దార్థ మిచ్ఛకొలఁది.

---

# ఆంధ్ర జీవిత సారస్వత సంబంధము

= శ్రీ వంగోలు వెంకటరంగయ్య =

శ్రీ కళాప్రపూర్ణ కట్టమంచి రామలింగారెడ్డిగారు రచియించిన కవిత్వతత్త్వ విచారమున "కవిత దేశీయుల నడవడిక సూచకము" అను శీర్షికక్రింద ఇట్లు వ్రాసియున్నారు:[1]

"పాశ్చాత్యులయొక్కయు, హిందువులమగు మనయొక్కయు శృంగారవాక్యములు[1a] భారతీయ్యవిమర్శకచే దెలిసిన కవిత్వవిషయములే కావు. మఱి కాలదేశముల సిద్ధాంతములయిన జనుల జీవితము, కథ, కృతులను నిత్యసంయోగముండుట ఇంకను ప్రధానమయిన యంశము. కావ్యము లూహామాత్రము లనుట కొంత కలదు గాని సమగ్రముగ నిజము గాదు. ఎంత యూహింపఁజాలిన నేమి? మన మట్టిబట్టువారల భావముల గతులు కొంతకుఁగొంతయేని దప్పక కావ్యదర్పణమునఁ బ్రతిబింబింపక పోవు. కావ్యపరిశీలనము జక్కఁగఁ జేసెనేని జనుల నడవడి, చరిత్రము, జీవించుదినములను బొత్తిగా గోచరింపక పోవు."

ఇట్టి యాశయమే యీ గ్రంథమున మఱియొకచోటకూడ[2] ఊదిచెప్పబడియున్నది. అయితే యిట్టి సూచనల కుదాహరణము లిందు గుర్తింపబడియుండ లేదు. వాని నేర్చి కూర్చుటకు వీరికంటె దక్షు లుండరు.

ఆంధ్రజీవిత సారస్వతచ్ఛాయగల పద్యము లనేకములు ఆభాణకములుగను, చాటువులుగను నున్నవి. శ్రీనాథుని కాలమున పల్నాటిసీమలో నొక పురోహితుని యింటితీరు యిటు లుండినది:[3]

> "దోసెడు కొంపలోఁ బసుల త్రొక్కిడి మంచము దూడరేణముల్
> పాసినవంటకంబు పసిబాలుర శౌచము విస్తరాకులున్
> మాసిన గుడ్డలున్ దలకుమాసిన ముండలు వంటకుండలున్
> రాసెడు కట్టెలు..."

మఱియు నాసీమలో "వరియన్నము లేదు"; "వసుధేశుడైన దున్నను"; "జొన్నకలి, జొన్నయంబలి, జొన్నన్నము, జొన్నపిసరు, జొన్నలెతప్పక సన్నన్నము సున్న." ఈవర్ణనములు జాతీయములుగ నున్నవి; అప్పటి యథాస్థితిని జక్కఁగ దెలుపుచున్నవి. వీని ప్రామాణ్య విచారము వచ్చినపుడు, కవిజీవితమో, చాటుపద్యరత్నావళియో గతియగుచున్నది.

---

1. ఆంధ్రయూనివర్సిటి ప్రతి (1933) పుట 118; 1a. "కావ్యముల" అని యుండునా?; 2. పుట 162; 3. వీరేశలింగంపంతులుగారి 'కవిజీవితములు' (1917).

ప్రాయికముగ తెలుగుకావ్యములు భాషాంతరీకరణములుగను, సంస్కృత గ్రంథానువాదములుగను ఉండుటచే వీనిలోని వర్ణనములు సాధారణముగ కవికాలపు దేశస్థితుల దెలుపుననుట కొంచెము సాహసముగ నుండగలదు. పూర్వగాథావలంబనములేనియట్లగపడు కళాపూర్ణోదయమును, హంసవింశతిపద్యకావ్యమును ఆశ్రయింపదగునుగాని హంసవింశతియందు గద్యపద్యములు గలసి దాదాపు వేయిన్నిమున్నూటతొంబదియయి దున్నను ఇందులోని విషయము లన్నియు ఆంధ్రదేశమునకును, ఆంధ్రులకును మాత్రమే నిరవశేషముగ సంబంధించిన వని చెప్పనలవికాదు. షోడశకర్మలు, చౌషష్టివిద్యలు, ఆయుధనామములు, లేహ్యములు, తైలములు లోనగు వైద్యవిషయములు, కులపర్వతములు, మహానదులు, వేదవేదాంగములు, దివ్యదేశములు, పుష్కరిణులు, పవిత్రతీర్థములు ఇత్యాద్యఖిలభారత సంబంధివిషయము లనేకములు గలవు. పట్టి తెలుగుపేళ్లుమాత్రము గల నగలు, పిండివంటలు, ధాన్యములు, చెట్లు లోనగునవియు గొన్ని గలవు. ఈ తెలుగు మాటల నాశ్రయించి యివి కేవలముగ తెలుగువారివే యని నిర్ణయింప బూనుటయు సాహసముగనే యుండును. కళాపూర్ణోదయమును కేవలాంధ్ర జీవిత వృత్తమనే ప్రకటించుచున్నదని చెప్పనలవికాదు.

ఆంధ్రుల నాగరకతనుమాత్రము గూర్చిన గ్రంథములును అగపడవు. అయితే భాషలో 'తెలుగుమీరి' పోవుట యను నొక చిత్రమగు నుడికారము గలదు. కవితిలక కాంచనపల్లి కనకాంబగారు 'హంసవిజయ' నాటకమున "అందమును బాగుగఁ దెనుఁగుమీఱినారు"[4] అని ప్రయోగించియున్నారు. నాణెము (నాగరికత) హెచ్చిపోవుచున్నదని తాత్పర్యమైయుండునా? ఈ శబ్దార్థ మామహాకవయిత్రికిని స్పష్టమయినటుల లేక "పరిశోధకు లీ తెనుఁగుమీఱు శబ్దమునకు వ్యుత్పత్తి నేమని నిర్ణయించిరో" యనియు విపరీతజ్ఞాని యగు డామాడ్డోలిగానిచే నడిగించినది. దీనివలన తెలుగువారికిని ఒక నాగరికత యుండిన దనియు, అది వృద్ధియగుచున్నదనియు భావము కాబోలును.

ఆంధ్రరాజుల అభిమానము పొందినవారికి వారు

> "అందలంబు గొడుగు లడపంబు మేల్కట్టు-చామరములు జమిలిశంఖములును,
> గంబగట్లు భూమి కానికగాఁగఁ జెం-పెసఁగ..."[5]

జేయుచుండిరి.

వారి పట్టణములలో ఒక్క 'రూకకు' "కప్పురభోగివంటకము కమ్మని గోధుమపిండివంటయుఁ గుప్పెడు పంచదారయును క్రొత్తగఁ గాచిన యాలనేతి పెసర్పప్పును గొమ్మునల్లనఁటిపండ్లును నాలుగునైదు నంజులుఁ లప్పలతోడఁ గ్రొంబెరుగు"[6] భోజనముఁ బెట్టు పూటకూటిం డ్లుండినవి.

4. హంస విజయము, అం. 5, రం. 3; 5. కేతనదశకుమారచరిత్రము 1-21; 6. క్రీడాభిరామము.

వారి రాజధానీపట్టణములు "మహీ కంఠహారతరళస్ఫూర్తిఁ విడంబించు[7]" చుండినవి. మఱియును "ఉడువీథిఁ శిఖరావలంబియగు నంధ్రోర్వీశు మోసాల"[7a] పై గడియారగోపురములును లోకోపకృతి జేయుచుండినవి.

బడిలో ఓనమాలు దిద్దించుట, గుణింతము పెట్టుట, పలకవ్రాయించుట, సారెపద్యములు జదివించుట, బాలరామాయణము జదివించుట ఇత్యాదులు అయ్యలరాజు నారాయణకవినాటి పల్లెటూరిబడిచదువుగ నుండినవి. బడిదొంగయగు మొండిపిల్లవాడు "అయ్యవా రోనమాలు దిద్దుకొమ్మనిన వోఁ గడుపునొప్పనుచు నేడ్చు"ను. గుణింతము పెట్టరమ్మన్న "నంగుళి వ్రణ మాయె"ననును. "పలక వ్రాయుమటంచు బడి కెత్తుకొనిపోవ బలపంబు లేదను"ను. "పుస్తకాల దాచు". "సజ్జనకోల విరిచివైచు."[7b] ఇంతకంటె పోకిరివాడు "అయ్యవారు నిద్రింపఁగా అచటఁ జింతవ్రేల్కొమ్మ వంచక" అయ్యగారి "సిగను గిట్టె విడిచి యుఱుకు." ఆ నాటి తెలుఁగుబళ్లలో ఇట్టివారును ఉండిరి.

"అప్పిచ్చువాడు వైద్యుడు నెప్పుడు నెడతెగక పాఱు నేఱును ద్విజుడుం జొప్పడిన యూరు"[8] ఆంధ్రుని కాపురమునకు ఒప్పబడినది. "వరిపంటలేని యూరును దొరయుండని యూరును"[9] వారు మెచ్చలేదు.

ప్రాయికముగ నాంధ్రబ్రాహ్మణపురుషులు "గన్నేరు పూఁజాయ కర మొప్పు సీర్కావి మడుఁగుకోవతి పింజెవిడిచి కట్టి"[10] "పసిడివ్రాతచెరంగు మిసిమిదోప జెలంగు నరుణాంశుకోత్తరీయమును" పైన ధరించుచుండిరి.[11] భారతరామాయణములనాటి స్త్రీలవలె ఆంధ్రస్త్రీలును క్రింది కోక చీరెయు, దానిపైన నోక యుత్తరీయమును ధరించుచుండిరా యని విచారించిన అల్లసాని పెద్దనకాలమునకే స్త్రీల 'యుత్తరీయము[12] పైట[13]కు పర్యాయపదమైనటు లున్నది.

వేడుకలును, ఉత్సవములును జరుగునప్పుడు ఇప్పటివలెనే నన్నయభట్టారకుని కాలమునాటివారును పందిళ్లు వేసుకొని, వానిని నానాధ్వజ నవపల్లవరంభాస్తంభమాలాలంకృతములును,[14] క్రముకకదళీస్తంభ సంభృతములును జేయుచుండిరి[15] (ఈయలంకారములు సంస్కృతభారతమున నిప్పట్టున జెప్పబడలేదు).

పెండ్లి పేరంటములందు తెలుగువారి యాచారముల జేమకూర వెంకటకవి దాదాపు నన్నూరేండ్లక్రిందనే గ్రంథస్థములుగ బ్రకాశింపజేసియున్నాడు. "దేవకీసతిమణి దాను రుక్మిణియు పెండ్లిపెద్దలై"[16] అర్జునుని, సుభద్రను పెండ్లికొడుకు, పెండ్లికూతు జేసిరి. పేర

---

7. మనుచరిత్ర 1-2; 7a. క్రీడాభిరామము; 7b. హంసవింశతి, ఆ 3-141. సజ్జనకోల=అయ్యవారి బెత్తము; సజ్జనయనగా ఎల్లపుడు సిద్ధముగ నుండునది యనియో, లేక బాలురను సజ్జనుల జేయునదియనియో విచారించవలె; 8. సుమతీశతకము; 9. పూర్వోక్తము; 10. క్రీడాభిరామము; 11. మనుచరిత్ర 3-92; 12. మనుచరిత్ర 3-8; 13. మనుచరిత్ర 3-49; 14. ఆదిపర్వము 6-4; 15. ఆదిపర్వము 7-202; 16. విజయవిలాసము ఆ. 3.

టాంద్రు ధవళంబులు [17]పాడుచు నలుగులు బెట్టిరి. [18] బాసికము కట్టబడెను. 'మధుపర్కము'[19] లొసగబడినవి. పసిడిపళ్లెములో బదాబ్జములు[20] కడిగి యల్లునికి "కన్యధార నోసిరి." 'మంగళసూత్రము'[21] కట్టబడెను. "చెయిమీఁదఁగవలెజుమి సీకని మెచ్చరింపగా" కన్యావరు లొండొరులపై 'తలఁబ్రాలు'[22] బోసికొనిరి. 'వియ్యంపు'[23] మర్యాద వెలయ 'బువ్వాన'[24] 'భోజనము' జరిగి "గంబూర మించిన"[25] తాంబూలము లొసగబడినవి. తదనంతరము 'నాగవల్లి'[26]జరగినది. అంతట పెండ్లికూతురి నత్తవారింటి కంపకము జేయనుండ "ఆఁడుఁబుట్టువు పుట్టింటి కానఁడును"[27] గాన ఆమె కొంచెము వికాసము తగ్గి యొక "తీరుగా నుండినది."[28] ఆడుపడుచులకు వివాహసందర్భములలో పుట్టింటివారు పసపుకుంకుమలకని ఆమెకు కొంత ధనమో, భూధనమో యిచ్చు ఆచారము కలదు. దీని ననుసరించి భీమభూపాలసుతులు "అనుఁగుఁ సయిదోడు[29] దమయంతి నసుపునపుడు నూఱు గ్రామములు" పసపుకిచ్చిరి. [29(1)]ఐదునాళ్లను మఱులుబెండ్లి మహిమతో జరుగుచుండినది. ఇట్లు తెలుగువారి పెండ్లివేడుకలు కవులు వర్ణించిన విధమున ముగియఁగ "కొలము సామికి నప్పనగాఁగఁ బండువెన్నెల బయలఁ"[30] వేడుకగా భోజనములు జరుగుచుండినవి. "మినుకు మిన్నఁ మటంచుఁ బ్రకాశమొందెడు ధ్రువుఁ గనుగొంటె, యల్లదె యరుంధతిఁ జూచితె" యంచు దత్సమీపవిశదతారలఁ గుఱుతు బల్కుఁటఁ జెప్పుచు బోంట్లు తెల్పి తెల్పి వనితచేత గంటి ననిపించుచుండిరి.[31] మఱియు "కలవంటకములు బూరెలుఁ దేనెతోలలు బొబ్బట్లు మండెగ లొబ్బట్లు వడలు కుడుములు సుకియలుఁ గడియంపుటట్లు వెన్నప్పాలు వడియంబు లప్పడాలుఁ బొంగరములు శాఖ బూరె తాఁగులు సేవ లుక్కెర లరిసెలుఁ జక్కిలములు ఖర్జూర గోస్తనీకదళికాసహకారఫలములు కొబ్బెరి పనస తొలలు తేనియలు జున్నుమీఁగడ లానవాలు పానకములు రసావళ్లు పచ్చడులును నాజ్యములువు బప్పులు కూరలనుపమాన్నముల"తో[32] ప్రజనెల్ల దనియింపజేయుచుండెరి.

ఇదానీంతనాంధ్రకవయిత్రి శ్రీమతి చిలుకపాటి సీతాంబగారు తమ 'పద్మినీపరిణయము'న పైనజెప్పిన పెండ్లివారి పదార్థములకంటె నెక్కుడుగ "పరమాన్న చిత్రాన్నాదుల" జేయింప నందఱును శ్రీవైష్ణవపారిభాషికమున 'సాపడిరి.'[33]

పెండ్లిభోజనము లిటు లుండ 'ప్రభుత్వైకాప్తి'జెందిన రెడ్డి వర్షకాలములో "గుడు గుంజెంచలిఁదుమ్మిలేఁదగిరిసాకుం దింత్రిణీపల్లవోత్కరముం గూడ భారంటి నూనియల

---

17. ఇది యొకవిధమగు గీతము. అప్పకవీయము. ప్రబంధరాజవిజయ వెంకటేశ్వర విలాసము పుట 204 చూడుడు (వావిళ్ల రామకృష్ణయ్యగారి ప్రకటనము, నెల్లూరు); 18. 19. 20. 21 22. 23. 24. 25. 26. (దీనిని పింగళి సూరన నాకబలి అన్నాడు) 27. 28. విజయవిలాసము ఆ 8; 29. శృంగారనైషధము 7-12 (ఈ పద్యమునకు సరియగు మూలనైషధశ్లోకమున్నట్లు కళాప్రపూర్ణ వెంకటరాయశాస్త్రులవారి సర్వంకషవ్యాఖ్యలో కనుపడలేదు.); 29 (1) ధనధాన్యముల వరణముగా నిచ్చుట గొప్పగాదు. ముక్కుతిమ్మన 'యరణపుకవి' యట; 30. విజయవిలాసము; 31. విజయవిలాసము; 32. కళాపూర్ణోదయము 7-61; 33. పద్మినీ పరిణయము ఆ. 8.

తోఁ గట్టావికట్టారుగోగిరము మెక్కు"దురట.[34] ఇది యాంధ్ర దేశపు రెడ్ల భోజనమో, లేక శ్రీవిలుబుత్తూరువారి వాడుక భోజనమో ?

ఆంధ్రుల క్రీడలు, వినోదములు, వస్త్రాభరణములు, ఆహారవిహారములు, విద్యావిజ్ఞానములు ఇత్యాద్యనేకవిషయములు ఆంధ్రసర్వస్వ మనదగు హంసవింశతి పద్యకావ్యమున[35] నున్నవి. వాని నెల్ల నిం దుదాహరించుట గ్రంథవిస్తారవ్యాజమగును. అయినను పోతనామాత్యాదివరప్రసాదుల నుల్లంఘింప నలవిగాదు. ఆడుపిల్ల "పేర్చెర బొమ్మల పెండ్లిండ్లు సేయుచు నబలలతోడ వియ్యంబులందు, గుజ్జెనగూళ్లను గొమరొప్ప వండించి చెలులకు బెట్టించు చెలువుమెఱసి***బాలికలతోడ చెలరేగి బంతులాడు"[36] శుకబ్రహ్మము భావించిన సంస్కృత రుక్మిణీదేవి యీయాటల నేర్చినటుల లేదు. సర్వథా కేవలాంధ్రస్వమై చెల్లు కళాపూర్ణోదయమున మధులాలసయు "బొమ్మపెండ్లిండ్లు గుజ్జెనగూళ్లు"గాక "అంచనగండ్లు పింపిళులు కుచ్చిల్ గీరగింజ లోమనగుంటల్ కనుమూసిగంతనలు కంబాలాటలోనైన ఖేలనముల్" మీఱఁగ బోంట్లతో[37] నలరినది.

మగబాలురకును కందుకక్రీడ[38] ప్రసిద్ధముగనే యున్నది. సంస్కృతభారతమున నున్న 'బీటా'యను ఆటను వాగనుశాసనుడు కందుకక్రీడ యన్నాడు. బీటాయనునది 'బిళ్లంగోడు' ఆటగా నున్నది. పల్నాటివీరులు బొంగరము లాడిరి.[39] సారంగధరుడు పావురముల[40] నాడి యిడుముల జెందెను.

నయకుశలురు ఇంగిలీషువారు బారాఘసలీషుకుపుర క్రీ. శ. 1801 ప్రాంతముల తెలుగుజిల్లాలపై ప్రభుత్వము గడించిరి. గ్రామకరణముయొక్క విలువను వారు బహుశీఘ్రముగ కనుగొని 18.2 లో జేసిన 29 వ రెగ్యులేషనులో ప్రజయొక్క స్వత్వస్వామ్యములను, ఆస్తిని రక్షించుటకు కరణ మను ఉద్యోగి అత్యవశ్యముగ కావలయునని తెలిపిరి. వారు తెలుపుట గొప్పగాదు. తెలుగువాడు తెలుగువానికొరకు ఉపదేశించిన సుమతిశతకమున "కరణముల ననుసరింపక విరసంబునఁ దిన్న తిండి వికటించుజుమీ" యను హెచ్చరిక జేయబడియున్నది. బహుశః 'అమాత్య'బిరుదము వహించిన నియోగి తెలుగుకవు లందరును తెలుగునాటి కరణికసంబంధము గలవారమని యుత్కర్ష జెందుదురు.

తెలుగుఋషు లెందును అగపడరు. అగస్త్య నఱవవారు లోబరుచుకొని తమ భాషావ్యాకృతియు, వైద్యమును ఆయన కంటగట్టిరి. వసిష్ఠవాల్మీకాదులు ఔత్తరాహులు. శాపగ్రస్తులగు విశ్వామిత్రపుత్రులా మనకు? ఆంధ్రుడు చింతపడనక్కరలేదు. మహాత్ములు యుగేయుగే సంభవించుచుందురు. అయిదువందల సంవత్సరముల క్రింద తెలుగుమింట

34. ఆముక్తమాల్యద 4-134; 35. అయ్యలరాజు నారాయణకవి విరచితము; 36. దశమస్కంధము పూర్వభాగము. 1686; 37. కళాపూర్ణోదయము 6-202; 38. భారతాదిపర్వము 5-206; 39. పల్నాటి వీరచరిత్రము; 40. సారంగధరచరిత్రము.

నుదయించిన వేమనచుక్క స్ఫుటముగ వెలుగుచున్నది. వేద మొక యక్షరమైన రాని బ్రాహ్మణు డుండిన నుండునుగాని వేమనసూక్తముల నొక్కపాదమైన నెఱుగని తెలుగు మానిసి యుండడు. నిరుపపన్న మూఢనమయధ్వంసనమున కీతఁ డెంతయైన పాటుపడెను. ఆంధ్రమహావిద్యాపీఠనేతలు శ్రీ రెడ్డిగారి పురస్సరముగ నొక అనంతకృష్ణశర్మను నియోగించి వేమనప్రపంచపరిశీలన జేయించి ఆమహాసిద్ధయోగికవి జ్ఞాపిక నుద్ధరించి శుద్ధప్రతి నొకదాని సిద్ధపరిపించుట తెలుగునకు గొప్ప సేవయై ఆంధ్రయూనివర్సిటీ స్థాపనము సార్థకము కాగలదు. ఆంధ్రజాతి మత సాంఘిక వాణిజ్య వ్యవసాయాదుల కన్నిటికిని ఇందుండి యుదాహరణముల గొననగును.

> " ఒరులకొరకు భూమి నొర సెడువారును-అవనిపతికి పన్ను లయినవారు
> పాలవంటి కూలము పన్ను చెట్టినవారు-వాక్కులుగరు కాపవారు వేమ " 41

అను శ్లాఘావచనములం దీతఁడు స్వజాతి నభిమానించినా డందురు.

> " వాను లడ్డ గట్టి కల్లకొడుల దున్ని-మున నడచెడి త్రోవ నుర్లుగొట్టి
> పైరుపెట్టిన పాపులు..."

ఆకాలమునగూడ నుండిరి. ఈయన రసవాద(బంగారుచేయుట)ప్రవీణుడుగ నగపడుచున్నాఁడు. రసవాదవిషయమై యెన్నియో యోగము లీయనపేరు గల పద్యములలో నున్నవి.

> " వెన్నెల నిలుచుండి వేపాకు పసవేసి-యడ్డసరపు రసము నందు బోసి
> కరుగ రాగియు మఱి కాంచనంబగును ..."

బహుసులభముగ నున్నది రాగిని బంగారుచేయుట. ఈ యోగము సిద్ధింపనియెడల "వేమన వేపాకును జెప్పెనుగాని అది తురకవేపాకో యింకొకజాతియో, 'వెన్నెల నిలుచుండి' యనెనుగాని అదే పున్నమనాటి వెన్నెలయో బహుళాష్టమినాటి వెన్నెలయో, ఏ మాసపువెన్నెలయో ఇత్యాదిరహస్యముల నాయన బయలుపరుపలేదు. సిద్ధికి ఇట్టి పరమరహస్యము లన్నియు గురుముఖమున గ్రహింపవలెను గాని వేమన చెప్పిన యోగమేమో నిజమే" యని వేమనదాసులు వాదింతురు కాబోలు.

"ముక్కు తిమ్మన క్రూరపదాహార్తి దెగిన కొక్కెరపంటికి" రామకృష్ణకవి "దుప్పికొమ్ము పల్‌గా రచియించె"నట్లుండు చాటూక్తి నిజమగునో కాదోగాని, వేమనకాలమున 'కర్రపం'డ్లుండినవి. అట్లు గానిచో "త్రోరివాని కేల కర్రపండ్లు" అను వైరాగ్యమును బోధించియుండడు.

ఆంధ్రులలో చాతుర్వర్ణ్యవ్యవస్థ ప్రసిద్ధముగ నున్నను గణసామాన్యమున కాపద సంభవింపనుండగ బ్రాహ్మణ, వెలమ, కుమ్మర, చాకలి, మంగలి, కరమల, మాలవార

41. వేమనపద్యములు అని సిద్ధాంతముచేయబడిన గ్రంథము లేనందున పద్యసంఖ్య నిర్ణయింపనలవి కాదు.

లోకరయాసనమున[42] గూర్చుండి భోజనము చేసి ఆపన్నివారణమునకై యత్నించిరి. "ఇచ్చోట భుజియించి ఏకకార్యస్థులై[43] సామంతనృపకులు చాపకూడు"—ఐకాగ్ర్యమున సంఘశక్తికి పూర్వపుటాంధ్రులు త్రోవచూపిరనుట కిది గ్రంథస్థ చారిత్రక నిదర్శనము కాగలదు.

రామాయణమున సీతకై వానరులు వెదకవలసిన నానాదేశములలో ఆంధ్రమును[44] చెప్పబడినది. ఆంధ్రుల యుద్ధకుశలతనుగూర్చిన ప్రసంగమున కవకాశము కలుగలేదు. మహాభారతయుద్ధమున పుళింద బాహ్లీక కుంకణ భోజానీకంబులతో గూడ ఆంధ్రులును రాధేయునకు బ్రాపయిరి.[45] ఆఘట్టముననే పాండ్యరాజొకడు పాండవులపక్షమున యుద్ధముచేసియున్నాడు. ఈ పాండ్యుడు మలయధ్వజుడని చెప్పబడియున్నది. ఆంధ్రుల ధ్వజ మెట్టిదో చెప్పబడలేదు.[46] ఇప్పటికైన ఆంధ్రుల కొక ధ్వజ మేర్పడియున్నదా?

ఎంతటి గొప్పవారైనను కవులు స్వకులస్వదేశాభిమానముల గావ్యములందు వెలిబుచ్చుదురు. రాజరాజనరేంద్రునకు నన్నయభట్టారకునియందు గౌరవ ముండుటకు బేర్కొనబడిన కారణములలో 'తనకుల'[47] బ్రాహ్మణుడగుట మొదటిదిగ నున్నది. ఇది న్యాయమే. రాజరాజనరేంద్రుడు చాళుక్యుడు- చాళుక్యచోడు డనినను సరియే. చాళుక్యులు ప్రప్రథమమునుండి తెలుగువారుగ నుండినటుల లేదు. క్రీ. శ. ఆరు ఏడు శతాబ్దములలో వారి రాజధాని అయోధ్యగ నుండినటులను, ఆవంశములోని యొక వీరపురుషుడు క్షేత్రయాత్ర వెడలి రాజమహేంద్రప్రాంతముల రాజ్యస్థాపనము చేసినట్లును చరిత్రమువలన దెలియగలదు.[48] దిగ్విజయములకు వెడలువారు తమతమ మంత్రిపురోహితాదులనుగూడ శిబిరములో చేర్చి తెచ్చుకొందురు. ఆ విధమున నన్నయగారి పూర్వీకులు రాజరాజనరేంద్రుని పూర్వీకులతో కూడ వచ్చినవారై ఆ సంస్థానము నాశ్రయించుకొనియుండినవా రగుదురు. రాజరాజనరేంద్రుడు చాళుక్యుడైయుంట నన్నయభట్టారకునకు దెలియును. ఆదిపర్వప్రారంభముననే యొకచో నుత్తమచాళుక్య[49] డనియు, మరియొకచో శ్రీమచ్చాళుక్యవంశశిఖామణి[50] యనియు ఇత్యాది వర్ణనల జేసియున్నాడు. రామాయణమున నయోధ్యాకాండ[51]లో వసిష్ఠ మహార్షి 'కులపుత్రః' అని వర్ణింపబడియున్నాడు. దీనికి 'సత్కులప్రసూతః' అని వ్యాఖ్యానము చేయబడియున్నదిగాని తన 'కుల' బ్రాహ్మణు డనుటలో కులశబ్దవ్యాప్తి యెట్టిదో 'కులపుత్రః' అనుటలోను అట్టిదిగనే యుండును. "తేషాం త్వమసి నందిని పార్థివానాం యేషాం కులేషు సవితా చ గురు ర్వయంచ"[52] అను వాక్యములోని 'కులేషు' అను ప్రయోగ మీయూహను బలపఱుప గలదు. వాసిష్ఠు లెన్నియో తరముల నుండియు ఇక్ష్వాకుల కులగురువులు.[53] ఉత్తర హిందూస్థానమునుండి తెలుగుదేశమునకు వచ్చి

42. పల్నాటి వీరచరిత్రము; 43. క్రీడాభిరామము; 44. కిష్కింధా. 41-12½; 45. కర్ణపర్వ. ఆ. 2-317; 46. అదే; 47. ఆదిపర్వ 1-9; 48. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్రము సంపుటము 1, పుట 258; 49. ఆదిపర్వ 1-4; 50 ఆది 3-1; 51. అయోధ్యా 100-11; 52. ఉత్తరరామచరితనాటకము; 53. Pargiters Ancient Indian Historical Tradition pp. 308 et seq.

ఇచ్చట స్థావరములు కుదుర్చుకొనిన బొందిలీలు. రాజపుత్రులు తమ యిండ్లలో జరుగు పండుగుపబ్బములలో తమ హిందూస్థానీ బ్రాహ్మణులనే ముందు గౌరవించుచున్నారు. ఇట్టి వాడుకలు అందరికిని గలవు. ఆంధ్రరాజులు అరవజిల్లాల నేలుచుండగ వారి వెంట వారి పురోహితులు, పండితులు, కవులు, శిల్పులు అనేకులు పోయి అరవమండలములలో నిలిచి పోయిరి. ఇట్టి స్థితులలో 'తనకుల' బ్రాహ్మణు డనగా చాళుక్యబ్రాహ్మణు డని యుండును. చాళుక్యు లొక తెగవారుగ నుందురు. వారిలో బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులును ఉందురు. అంతియగాని నన్నయభట్టారకుని చాళుక్య బ్రాహ్మణు డనగనే ఆయన రాజరాజనరేంద్రుని చుట్టము గానక్కరలేదు. బ్రాహ్మణులలో తక్కువగ నెన్న బడనక్కరలేదు. చాళుక్యపరగణానుండి వచ్చినవారుగ నుందురు. సాంప్రదాయ బ్రాహ్మణులు, కళింగబ్రాహ్మణులు, తుళు బ్రాహ్మణులు ఇత్యాదులవలె చాళుక్యబ్రాహ్మణులు నొక తెగవారుగ నుందురు.

అర్జునుని తీర్థయాత్రామిషచే నన్నయభట్టారకుడు సంస్కృత భారతములో లేని వేగీ దేశవర్ణన తన రచనయందు చేర్చి యున్నాడు.[54] ఆంధ్రాభిమానముచే నన్నయ తిక్కన లిద్దరును సంస్కృతభారతమున నుండు 'వేణ్ణా' నదిని పెన్న(ఉత్తరపినాకిని) జేసియున్నారు.[55] తిక్కన నెల్లూరుప్రాంతములవాడు. ఆయనకు విక్రమసింహపురమనా బరగు నెల్లూరి పైనను, పినాకినిపైనను గల ప్రేమాభిమానములను విక్రమార్కచరిత్రయందు రెండు సీసములపై వెలయింపజేసినాడు.[55a] విక్రమసింహపురము "సముదగ్ర సౌధాగ్రతల సమగ్ర శాతకుంభ మహాకుంభజాలగుంభితోరురత్నవినూత్నశృంగార మగుచు సిరుల నొప్పారినది." ఇక పినాకిని యన్ననో—

"చక్రవాకస్తని శైవాలనమ్మిల్ల సందీప్తడిండీరమందహాస
యావర్తవరనాభి యభినవబిసహస్త గాజితరాజమరాళయాన
పికశాలిలనితంబ వికచబంధూకోష్ఠ తరళతరంగావళీవళివిలాస
కంబుకంధర దళితాంబుజాతానన నానావిధవిలోలమీనవయన
యమృతసాగరవిభుని యర్ధాంగలక్ష్మి - యిందుధరునిల్లు పుట్టినయిల్లుగాగ"

నెగడెడిదిగ నున్నది. ఇంతియగాక నెల్లూరికిని పెన్నకును గల భూతలవిన్యాస (Geographical topography) వర్ణనమునకును ప్రసక్తికల్పించుకొని ఆనది పట్టణాంతరసీమ ప్రవహించుచుండినట్టులను జెప్పియున్నాడు. ఏరు ఊరినడుమ పారుచుండుటచేతనే కాబోలు "పెన్నదాటితే పెరుమాళ్లసేవ" యను లోకోక్తి యేర్పడినది. దీనికి సరిపోవు కథ సంస్కృతవిక్రమార్కచరిత్రమున మృగ్యముగ నున్నది.

54. ఆదిపర్వము 8-139; 55. సభాపర్వము 1-72 (వరుణసభావర్ణనము), అరణ్యపర్వము 2-278 (తీర్థకీర్తనము), భీష్మపర్వము 1-38 (భారతవర్ష విశేషములు), అనుశాసనికము 5-270. 55a. విక్రమార్క చరిత్రము, 7-133, 139. పై యుల్లేఖములలోని పెన్న దక్షిణపినాకినిగ నుండరాదటాయని ప్రశ్నించిన అట్లుండదని విన్నపము. తెలుగునాడునకు కడుదూరమున నుండు నదీప్రశంస వీరు ఏమాత్రమును తలపెట్టుకొనియుండరు.

పరవశ్యత సెరుగక నిరంకుశముగ కవితాప్రపంచము నుద్ధరించి పాలించిన మహా కవిసార్వభౌములు ఎడనెడ తమ తమ యొడయులయెడ నిచ్చకముల నివేదించుట గలదు. నన్నయ సభాపర్వమున[56] 'నేలినవానికి' రాజనీతి యుపదేశించియున్నాడు. తనను[57] 'మామ' యనియెడి తన ప్రభువునకు తన భారతము నంకితమీయ నిచ్చగింపని తిక్కయజ్వయు 'నేలినవాని'[58]స్మరణ చేసియున్నాడు. ఇంతియగాక "అనకృన్మత్స్యరాజ్ఞా మే రాష్ట్రే బాధిత మోజసా"[59] యని వ్యాసుడు సుశర్మమీద కొంచెము గౌరవము చూపి చెప్పిన మాటలను సోమయాజి "నాదయిన జీతపుటాళ్లలు" "సంతతంబువానింగడుగాసి చేయు"[60]ననుచు సుశర్మను రాజుక్రింది జీతగానిగ జేసెను. 'ఏలినవాడు', 'జీతపుటాళ్లు' అనుట ప్రభుప్రీతిసంపాదన కొరకని గ్రహింపనగును.

ఉత్తర గోగ్రహణసందర్భమున జమ్మిచెట్టుమీద కట్టగట్టి పెట్టబడియుండిన బాణబాణాసనాదుల దెమ్మని విజయు డుత్తరుని కోరగా,

> "పీనుంగు వంటఁగనను నే- భూనాథతనూజుఁడనకొ పురిలోపక న
> న్నీనీచపుఁబనికిఁ బనుపం- గా నీకుం దగునె..."

యని యుత్తరుడు కోపగించగ

> "...యస్త్ర శస్త్ర సంచయంబుగాని
> శవము గాదు మత్స్యజనపాలతనయ నేఁ-బట్టితెఁ బనుడు నయ్య నిన్ను"

అని బృహన్నల వినయవిధేయతల జూపెను. 'మత్స్యజనపాలతనయ', 'అయ్య' ఇత్యాదులపై వ్యాఖ్యాన మక్కర లేదు.

కొన్నియెడల ధ్వనిగర్భితముగను, కథాసరళి కవిరోధముగను రాజభక్తి చూపబడుచున్నది.

పసగల చేమకూరకవి విజయవిలాసమున నిట్లు చమత్కారమును జూపియున్నాడు:

> "పాలఁజూదిన బరసేన పాలఁజూచు-వింటి కొరగిన రిపురాజి వింటికొరగు
> వేయుసేటికి నలపాండవేయుసాటి-వీరుఁ డిల లేఁడు ప్రతిరఘువీరుఁ డొకఁడు"[61]

ఈ కావ్యము రఘునాథనాయకుని కంకితమని తెలిసిన ఇందలి ధ్వని సుబోధ్యమగును.

భాషాకావ్యములందు సంకల్పపూర్వకముగనో, యాదృచ్ఛికముగనో కవులు స్వోల్లేఖముల[62] జేసికొనినట్లు స్ఫురించు వాక్యము లుండుట గలదు. భారతశల్యపర్వమున ప్రథమాశ్వాసమునందలి 401-వ పద్యాంతమున "ఏమి చెప్పుదుం గురునాథా" యను మాట

---

56. సభాపర్వము 1-38; 57. నిర్వచనోత్తర రామాయణము; 58. విరాట 1-185; 3-182; 59. సంస్కృత భారతము విరాటపర్వము 30-4 (కలకత్తాప్రతి); 60. విరాట 3-120; 61. విజయవిలాసము 1 29; 62. Personal references.

లున్నవి. కథాసరళిలో నివి సంజయధృతరాష్ట్రసంభాషణమునకు సరిపోవుచున్నవి. అచటి కథాసందర్భ మేమన, దుర్యోధనుడు "కాల్నిలువక గుఱ్ఱంబు డిగ్గి గదాకలితభుజుండై యొక్కడు తొలగిచనియె" నను కఠినవార్త సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచున్నాడు. తిక్కన దుర్యోధనునెడ అనుతాపముతో "ఏమి చెప్పుదుం గురునాథా" యని తన లేఖకుడగు కుమ్మరగురునాథుని సంబోధించి చెప్పె నను ఆభాణకము కలదు. తిక్కన లేఖకుడు గురునాథుడే యగునెడ ఈయాభాణకమును సమంజసముగనే యున్నది.

"కలగెం దోయధిసప్తకంబు(క) గిరివర్గంబెల్ల నూటాడె(గ) సం
చలితంబొందె వసుంధరావలయ(చ) మాశాచక్ర మల్లాడె(జ) గెం
దలముం డెం త్రిదశేంద్రు పట్టణము(ట) పాతాళంబు ఘూర్ణిల్లె(డ), నా
కులమయ్యెన్ గ్రహతారకాపలము(త) సంక్షోభించె(ద) నవ్వేళయున్"

ఇచట (క), (చ), (ట), (త) లందు క్రియాపదము ముందును, విశేష్యపదము దాని వెనుకను నున్నవి. (గ), (జ), (డ), లందు విశేష్యపదము ముందును, క్రియాపదము ఆవెనుకను ఉన్నవి. ఈ పరిపాటి ననుసరించి (ద) యందును విశేష్యపదము ముందుండవలసినందుకు క్రియాపదము నిందు ముందు పెట్టుటచే తిక్కనమహాకవి ప్రక్రమభంగదోషమునకు పాల్పడవలసియుండును. అయితే అంతటి మహాకవి ఈ వ్యతిక్రమమును జేయుట కెద్దియైన హేతు వున్నదా యని చూచిన సాక్షాత్తు వేధయే ఆ యుద్ధ సంరంభంబునకు సంక్షోభింపగ, కవిబ్రహ్మయయ్యు మానవవ్యక్తి యగుటచే నీయనయు 'సంక్షోభము' చెంది ఈ వ్యతిక్రమమును ప్రమాదవశమున జరిగించియుండవచ్చునని యొకరు సమర్థకము చెప్పిరి.

కవిసార్వభౌముడైన శ్రీనాథుడు వైదుష్య ప్రపంచమున దిగ్విజయముచేసి డిండిమాదుల నోడించి నిరతిశయప్రభతో విరాజిల్లుచు శత్రుశేషము నొల్లని పట్టుదలతో కవితాసామ్రాజ్యము నుద్ధరించినవాడగుటచే కాశీఖండమున వింధ్య సుమేరుస్పర్థ నాలంబనముచేసికొని ఈ ధీరోక్తి నుద్ఘోషించెను:

"కంటికి నిద్ర వచ్చునె, సుఖంబగునే రతికేళి, జిహ్వకున్
వంటక మిందునే, యితరవైభవముల్ పదివేలు మానసం
బంటునె, మానుషంబుగలయట్టి మనుష్యున కన్నదేనియున్
గంటకుడైన శాత్రవుడొకండు దనంతటివాడు గల్గినన్"[63]

కవి ప్రయోగించిన కొన్నికొన్ని శబ్దములను బట్టి తన దేమండల మనునదియు నాతడే ప్రకటించుకొనిన ట్లూహింప నలవికాదు. 'అడచిరి'[64] అను ప్రయోగమునుబట్టి నన్నపార్యుడు అరవదేశపు తెలుగు వ్రాసెననుట యుక్తముగాదు. రథములకు గుఱ్ఱముల గట్టుటను చెప్పవలసినపుడు సోమయాజి పలుమారు 'పూంచు'[65] అని ప్రయోగించియు

63. కాశీఖండము 1-108; 64. ఆదిపర్వ 1.84; 65. విరాట 4-45.

న్నాడు. బండి కెడ్లను 'పూన్పుట' విశాఖపట్టణ ప్రాంతములలో తరుచుగ వినబడుచుం డును. ఇది నెల్లూర లేదు. ఈ మాటనుబట్టి తిక్కన కళింగత్రైలింగు డన నగునా?

నెల్లూరి ప్రాంతములలో బాలుర యాటలందు ఎద్దిదైన పందెము వేసికొనవలయు నెడల ఒకడు తన పందెమును తెలుపుచు (bet) తన చేతిని చాచును. ఎదటి ఆటకా డాపం దెము నంగీకరించునెడల మొదట చేతిని చాచినవాని యరచేతిలో తన చేతితో పట్టి(చఱచి) ఆ యరచేతిలో గిల్లును. అంతట నాపందె మంగీకరింపబడినట్లు నిశ్చితమగును. అందునుండి వారు పెనుద్రొక్కు నర్షులు గాజాలరు. భారతానుశాసనికపర్వమున కద్రూవినతలమధ్య ఉచ్చైశ్శ్రవ వర్ణమునుగూర్చి పందె మేర్పడినది. ఆఘట్టమున సోమయాజి యిటుల వ్రాసి యున్నాడు:

"నీవు గెల్చిన దాస్యంబు నీకు నేను - సేయఁగలదాన నేను గెల్చినను నీవు
వాకుఁజేయంగఁగలదాన నీకడింది - పన్నిదము సఱమని తెగఁబాఁతి పలికె.

వ. ఇట్లు వినతయుం దెంపుసేసి యత్తెఱంగున కియ్యకొనియె నయ్యిరువురు పంచమహాభూతంబులు సాక్షిగాఁ బల్కి పన్నిదంబు సఱచిరి." (అనుశాసనిక 1-190; 1-192)

మొదటి పద్యములో 'సఱుము', రెండవదానిలోని 'సఱచిరి' అను పదములకు సరియగు పర్యాయపదము సంస్కృతభారతమున నగపడలేదు (కుంభఘోణప్రతి, అనుశాసనిక అ. 2).

"యద్యార్యే దీవ్యసి త్వం వై కః పణో నౌ భవిష్యతి." (శ్లో. 13)
"శ్వా దాసీ భవే ర్త్వే త్వ మహం చాప్యసితేక్షణే." ఇత్యాది. (శ్లో. 14)

ఈశ్లోక భాగములలో పన్నిదమునకు పణ మున్నది. 'చఱచు'టకు 'దీవ్యసి' అను జూదపుమాట యున్నది.

ఇచట తిక్కన తెలుగుకుఱ్ఱల వాడుకను గ్రంథస్థము చేసినటు లున్నది. ఆంధ్ర బాలురలో నీవిధాన మిప్పటికిని కలదు.

మాలశబ్ద మేకాలమున నెట్లు భాషలోనికి జొచ్చుకొనినదోగాని నిందాపర్యాయమై నిలిచియున్నది. ఆంధ్ర జీవయాత్రావృత్తి దుష్పరిణామమును జెంది మాలత్వమును దేవుని కిని వ్యాపింప జేసినది. జ్ఞానవిజ్ఞానసంపన్నుడు, దైవభక్తుడు, మహాపండితుడు, కర్మఠుడు నగు తిక్కనసోమయాజి భీమ దుర్యోధన గదాయుద్ధమున మారుతికి జయము 'మాలవిధా తృని'[66] వలన గలిగిన దని యశ్వత్థామనోట బలికించినాడు. ఇచటి 'మాల' శబ్దమునకు తిక్కన యేమి సమర్థకము నూహించియుండునో? ఈ పట్టున వ్యాసుడు "కాలో... బలవత్తరః"[67] అనియు, "కాలో దురత్యయః"[68] అనియు పదార్థముగానట్టియు, స్వతంత్ర స్వరూపస్వత్వములు లేనట్టియు 'కాలము' మీాద బెట్టినాడు. విధాతృ మాలత్వ మెట్టిదో? మాలవిధాత యొకడును, తదితరవిధాత మరియొకడును నున్నారా? ఇచటి

---

66. [illegible] 1.218; 67, 68. [illegible] 9.61.33 [illegible]

మాలత్వము కార్యమా, కారణమా? ఇట్టి ప్రయోగములు కవిసమయము లని సమ ర్థింపబడును కాబోలు. మాలలతో నెట్టిసంబంధమును లేక అన్యోన్య మస్పృశ్యులుగ నుండు మాదిగలకును చండాలత్వమున నైక్యము చూపబడుచున్నదిగాని విధాత నెవరును మాదిగవిధాతృ డనినటుల లేదు. ఆంధ్రజీవితమున నాటుకొనియుండు ఈ పక్షపాతము సారస్వతమున కెక్కినది. సోమయాజియొక్క 'మాలవిధాతృని' స్థానమున 'మాదిగ ధాతృని' నిలిపినను ఛందోభంగ ముండదు.

సుకవితా యద్యస్తి రాజ్యేన కిమ్మనునట్టి ప్రౌఢోక్తు లున్నను వస్తుతః కవులు పేద వా రనుభావ మామాటలందే యనుక్తముగ ధ్వనించుచున్నది. లోకోత్తరప్రథచే భాసించిన కాళిదాసుగూడ "సరస్వతీ శ్రుతిమహతాం మహీయసాం" (హితాయ ప్రవర్తతాం) [68a] అని శాకుంతలభరతవాక్యమున ప్రార్థించియున్నాడు. పింగళిసూరన ధనాఢ్యుడో, పేద వాడో తెలియదుగాని అతని యభిమానము పేదలగు విద్యాధికుల పక్షమని చెప్పవచ్చును. "ఒక భూవరుఁగని వైభవంబు" [69] బాందవలయు నను ఆశతో సకలశాస్త్రపారంగతులగు నలుగురు పేదబ్రాహ్మణసోదరులు కళాపూర్ణునినూమను జూడబోయిరి. ప్రభుదర్శనము సులభము గానందున

> "భూవరముఖ్యు సన్నిధికిఁ బోయెడు మామిడిపండ్ల పుట్టికల్
> తోవఁగఁ గాలిఁ బుచ్చుకొని మూఢత నుక్కడు గ్రామ్యచేష్టితం
> బావహిలంగ జేఁగి ప్రతిహారజనంబుల కిష్టమైన వా
> చావిధి కొప్పి చొచ్చి ప్రభుసన్నిధిఁ బెట్టిరి పండ్లపుట్టికల్". [70]

అంతట నాబాలుర "జూచి నృపతి యొయ్యన నగుచుఁ" [71] వారి యుదంతము నిక్క ముగ జెప్పు డనుట వారల్" అనువుగ—

> "మాయమ్మనను నీకే- రాయలనై కావ దేవ రాజేశేశ
> మా యాతుమలానిసయడి- పాయక సంతోషమున్న పలమిలపామి" [72]

అని ఛందోబద్ధమగు ప్రత్యుత్తర మిచ్చిరి. ఈ ప్రత్యుత్తర మొక విచిత్ర కవితా కల్పనగ నున్నది. పదచ్ఛేదభేదముచే నిదియే సంస్కృతశ్లోకమును, తెలుగుపద్యమును అగు చున్నది. పద్యభావమును రాజు గ్రహించి వారిని చేరదీసి సన్మానించి దారిద్ర్యవిముక్తి యగునటుల వారిని సంపన్నుల జేసి పోషించినాడు. తరువాత కొంతకాలమునకు కళా పూర్ణుడు వారి నొకపరి చూచి ఇట్టి విచిత్రకవిత మీ మతులకు నిపుడు దోచునా యని ప్రశ్నింప ఆనలుగురలో పెద్దవాడగు ప్రథమాగముండు తటాలున లేచి పద్యరూపమున ప్రత్యుత్తర మిచ్చెను:

---

68a. ఈ సంపుటీకరణ మన్వయసౌలభ్యముకొరకు చేయబడినది; 69. కళాపూర్ణోదయము 6-158; 70 6-158; 71. 6-159; 72. 6-161.

"తా వినువారికి పరవిగ భావనతో నానునతివిభావిసు తేజా
దేవరగౌరవమహిమన మాకలసీవకవిత మరిగి మాకునధీశా" 73

ఇది విచిత్రతరమగు రచన. మొదటినుండి చదివిన నిది కందపద్యము, చివరనుండి చదివిన సంస్కృతశ్లోకము నగును. బహుశః ఈ బ్రాహ్మణ సోదరుల కథ పింగళి సూరన స్వీయచరిత్రమున నొక యాశ్వాసముగ నుండునేమో.

తమ పేదరికమును నిట్టి యద్భుత కవితా సంపత్సంవరణము చేసికొని జీవిత దార్గత్యమున దైన్యము జెందక తమ ప్రాణయాత్రానిమ్నోన్నతముల నాంధ్ర వాఙ్మయచిత్రఫలకమున నిమ్నోన్నతుల74 రూపమున నలంకరించి ధీరులై తెలుగుకవులు భాషామతల్లి సేవ చేసి యాంధ్రజీవిత సారస్వత సంబంధమును వర్ధిల్లజేయుచుండిరి. ఇంకను జేయుచుందురుగాత.

---

73. ఈ పద్యముయొక్కయు, పై 72 సంఖ్యగల పద్యముయొక్కయు పదవిభాగములును, అన్వయములను, అర్థతాత్పర్యములును శ్రీ రెడ్డిగారి ప్రౌఢపీఠికాభూషితమై శ్రీ వావిళ్లవారిచే నచ్చుచేయించబడిన కళాపూర్ణోదయప్రతియందు ఈ రెండు పద్యముల పాదటీకలలో విశదముగ తెలుపబడియున్నవి. ఆ టీకలు లేనియెడల వీని యర్థములు దుస్సాధములుగ నుండును; 74. shade and light = ఛాయాతపములు.

---

# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1941 సం. డిసంబరు నెల) తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నవి. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపులేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్మురానిచో సహజ భాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువరకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1941 సం జనవరి 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. కావున తామెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన బ్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయము వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

A 2, B 5, C 5, 6, 7, D 2, 6, G 4, H 25, 40, 62, 64, 65, 69, 72, K 3, 4, 5, 9, L 2, 4, 5, M 3, N 3, 9, 10, O 3, P 24, 26, 27, 28, R 7, 11, 26, 29, 31, S 1, 2, 6, 27, 28, 30, 35, 37, 48, 74, 75, 76, 77, 78, 79, 82, 83, 85, 93, T 1, V 5, 18, 20, 23, 24, 26, 27, Z 1.



# ఆంధ్ర కవితా శిల్పము

= శ్రీ నాదెళ్ల మేధా దక్షిణామూర్తి శాస్త్రి. =



శ్రీసుర వాగ్వధూమణికిఁ జెన్నగు పట్టివి, పన్నయాత్మరా
భ్యాసముఁ దొట్టి పుట్టిన గృహంబున కెంతయు వన్నె వెట్టి, 'సో
మాసి' నుతిఁ మెట్టి యసమానయశంబు గడించినట్టి నీ
వే సరియౌదు నీకు జననీ! మనుమీ, యిల నాంధ్రభారతీ!

లోకమునఁ బరస్పరేంగిత ప్రకటనార్థ ముత్పన్న మైనవి శబ్దజాలము. ఆయాదేశములయందలి వ్యవహారముల కొలఁది నవే యెన్నెన్నో భాషలైనవి. తత్తద్దేశజుల నాగరికతనుబట్టి యట్టి వాఙ్మయము లభివృద్ధి నందఁగలిగెను. అందుఁ దొలుత సంస్కరింపఁబడి యిచ్చో మెచ్చుఁగొలుపు ప్రాచేతసాది వాక్ప్రచారముల కిరవైనది గీర్వాణభాష. పిదపఁ దన్నుతద్భవముల చేరిక నీరికలెత్తిన "దేశభాషలందుఁ దెలుఁగు లెస్స."

'పలువిద్య లెన్నియైనను
కులవిద్యకు సాటిరావు'

"స్వస్థాన వేష భాషాభిమతా స్సంతో రస ప్రలుబ్ధధియః, లోకే బహుమన్యం తే వైకృతకావ్యాని చాన్య దపహాయ" యను శాసనమున నీ మన మాతృభాషం బరికించుట మనకుఁ బ్రథమకర్తవ్యము. "పలువిద్య లెన్నియైనను కులవిద్యకు సాటిరావు" గదా. దినకలిని బట్టి యలవడిన భాషయందలి పరిచయము నభివృద్ధిపఱచికొనఁదగినది యం దేర్పడి వన్నెఁగన్న కృతులవల్ల నేకదా! ఆకృతులందుఁ గవులు చిత్రించిన యాకృతులే మన సౌదర్యప్రాయములు, సందఱ యాదేశములే యనుష్ఠేయములు నయ్యెను.

"కవిసౌవర్ణికు, లర్థ మర్థ్యరాఖులు, కవు
ల్లిఖింతా వళికవ్రాసి, చి
త్రవిచిత్రాంచితబంధగర్భములఁ గూ
ర్పఁ జేర్చియుక్తి హెచ్చు, నం
దు వచశ్శుద్ధి రసార్థపుష్టి కళకి
వు లయ్యై లోహవ్యర, మీ
రివఁ జెక్కెచ్చెద, రవ్వ నేర్ప వరదా
త్రీ! ముక్తికాంతామణీ!"

సువర్ణమయమౌ భాషకుఁ గవివాక్కే యూత యనియుఁ, గవన మల్లుట యన నొక శిల్పికృత్యమే యనియు "అమలోదాత్తమనీష నే నుభయకావ్యప్రౌఢిఁ బాటించు శిల్పమునం బారగుఁడం, గళావిదుఁడ" నను 'కవిబ్రహ్మ' పలుకులవల్లనే తేటపడుచున్నది. మఱియు, స్వర్ణకారుని పనియందలి సాదా, నగిషీ, కుందనము, తాపడము నను భేదము లట్లే కవిత్వమునందుఁగూడ ఆశువు, చిత్రము, బంధము, గర్భము నను నంతర్భాగములు గలవు. అందందు వెలయింపఁబడిన శృంగారాదిరసములే నవరత్నముల కాంతి నీనును. అర్థాలంకారములన్ననో, వన్నెఁదెచ్చున వౌను. "ప్రాయేణ యమకే చిత్రే

రసవ్యక్తి ర్న విద్యతే" యన్నను, శబ్దాలంకారాదికములు నైమెఱుఁగులు కాకపోవు. కావున్న, "అలంకారేణ రహితం నిరలంకృతి రుచ్యతే"యనిరయ్యె. ఏమైనను, "ఔచిత్యేన వినా రుచిం ప్రతనుతే నాలంకృతి ర్నో గుణా"యన్న ట్లౌచిత్యమే యాదిగఁ బరిగణింపఁ బడవలసినది. కృతి సలక్షణముగా నిర్వహించుట కొ శాస్త్రజ్ఞాన సాహిత్యములే సామగ్రి యన నొప్పు. ధారాళగతి యన్ననో, నైసర్గికమై యొప్పు నేర్పు కొలఁది విలసిల్లు పనియొద్దికయే. పాకసౌష్ఠవ మన్ననో, మొగ్గవిడుచుకొలఁదిఁ బరిమళము హెచ్చుపగిదిఁ దీర్చి దిద్దినట్లయి రాణించు నగపాంకమున కనయాను.

## ‘ఆపరితోషాద్విదుషాం నసాధుమన్యే...’

ఈకవితనకన్న "ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే"యన్నట్టు దోషజ్ఞ బుద్ధికాలోక్లిష్టం బయినంగాని యిట్టిదని నిరూపింపఁగాదు. "గుణకోషా లబ్ధో గృష్ట న్నిందు త్యేషా విపేశ్వరః, శిరసా శ్లాఘతే పూర్వం పరం కంఠే నియచ్ఛతి" యన్నచందానఁ గొందఱు గుణజ్ఞులు దోషప్రకటనముఁ గావింపనివారైనను నందందుఁ బ్రయోగింపఁబడ నర్హ్యేడు దుష్ప్రంగులటంకములుఁ, వాదపూరణపుఁ బొరపాటులు మున్నగాఁ గలవానిని గమనింపలేకపోరు. ఔచిత్యభంగముల నన్ననో, యేవిమర్శకులో తత్త్వవిచార మొనర్చుపట్టున గర్హింప కయుమానరు.

కావున రచయితలకుఁ, బఠితలకుఁగూడ నౌచిత్యజ్ఞాన మత్యావశ్యకము. దానినిబట్టికాని రసాశ్రయత్వము నిరూపింపలేము. సంభాషణమున కది జీవము. కోరత్తిన నద్దానిని బాటింపవలయు. అట్టి యౌచిత్యము యొక్క స్వరూపమును గుర్తించుటకుఁ బ్రాచీనవిమర్శకాగ్రణులౌ క్షేమేంద్ర విద్యానాథాది కర్తృకములఁ దడవుట కిట నదను కాదు. లక్ష్యము లరసి దానఁ గొంతవఱకుఁ దెలిసికొనఁగాను. ఎట్లన, స్వయముద్భవ ధారాప్రవాహమునకుఁ దోడుగ వ్యుత్పత్తి శాస్త్రజ్ఞాన సాహిత్యముల నన్నిటిని మించి సంపూర్ణలోకానుభవ సిద్ధమౌ నౌచిత్యజ్ఞానమును గలిగిన మహాకవులు రూపకముల నిర్వహించుపట్టులందుఁ దా మాయాపాత్రలందు లీనమై చేయు వర్ణనములును, బలుకు సూక్తులును శ్రోతల మనముల శాశ్వతముగా నాటుకొనునవిగా నుండును. అందును గాళిదాసోక్త లగ్రగణ్యములు. "కావ్యేషు నాటకం రమ్యం నాటకేషు శకుంతలా, తత్రాపిచ చతుర్థోఽంక స్తత్ర శ్లోకచతుష్టయ" మ్మనువానిలో నుండు చనిమాతము: "నీయం యాతి శకుంతలా పతిగృహం సర్వై రనుజ్ఞాయతా" మ్మని తన పెంపుడుబిడ్డ నంపఁబోవు కణ్వమహాముని "వైక్లబ్యం మమ తావ దీదృశ మిదం స్నేహా దరణ్యౌకసః పీడ్యంతే గృహిణః కథంను తనయావిశ్లేషదుఃఖై ర్నవైః" యను పలుకుల సారము కూఁతులఁగన్న తలిదండ్రులకే విశదము. ఇంక, "భాగ్యాయత్త మతఃపరం నఖలు త ద్వాచ్యం వధూబంధుభి" యనుటలో నున్నది యౌచిత్యజ్ఞతయొక్క పరమావధి. ఇం దీపరమహంసను మించిన వన్నెఁ గన్నది మన పింగళివారి ‘యంచ’యే. ఆ మరాళి తా నల్లనల్లన యరుగుచుఁ బెంపెసు మాట్కలతోఁజే విరాళిఁగొలిపి ప్రభావతీనాగవల్లరుల స్వాగతమందినదై "సందేహమకొంకైనను వేఱొక పనికినైన వాకది తెలియంబరిగలదె? వీను వాచే వినవలసిన యర్థ మరసి వినిపింతు" ననుచు మొదలిడి, "యెవ్వ రెంతే మన సిచ్చి వచించిరో తాను వారితోఁ బనుపడ నంతమాత్ర ప్రతిభాషణమాడుట యుక్తము" డని నూటిపోటు లాడి, తుదకు వారిచే "వట్టిముబుంగ చెట్టే నడుమం బనిలే దని యెల్ల ఖేరి జోకొట్టుటకాక నిద్దెలుపఁ గూడు నె మాటల" ననిపించుకొని గుట్టు బయలఁ బెట్టింపఁగలిగిన దిట్ట. మాటలు నేర్చికొనవలెనన్న నిట్టి గరువతనంబు నెలయించు వల్ల ఇంచిముగ్ధముబుగన నేర్చికొనఁదగును.

## వర్ణనౌచిత్యము - రసోదయమౌ తెఱఁగులు

ఇంక, వర్ణనౌచిత్యంబును, దాన రసోదయంబౌ తెఱంగుం దెలియ నాయాకవులు తమతమ హృదయములలోఁ గల్పించికొన్న యాకృతులఁ బదములతో రమణీయముగ నెట్లు చిత్రింపఁగలిగిరో పరికించినఁ దేటపడెడిని. ‘సంకుల మిళితాళినీల పరికుంచిత కోమల కుంతల’ నాశకుంతలను జూచి, "సరసిజ మను విద్ధం శైవలే నాపి రమ్యం మలినమపి హిమాంశో ర్లక్ష్మ లక్ష్మీం తనోతి" యనుకొన్నాఁడుగదా దుష్యంతుఁడు,

ఇంక "అనాఘ్రాతం పుష్పం కిసలయ మలూనం కర
రుహై రనావిద్ధం రత్నం మధు నవ మనాస్వాదిత
రసం, అఖండం పుణ్యానాం ఫలమివచ తద్రూప
మనఘ"మ్మనిపించుటలో నాకాళిదాసుని ప్రకృతి
సౌందర్యానుభవము వ్యక్తమై యుత్తమశృంగార రసో
ద్భవ మెందొనో మన మెఱుఁగనయ్యెదము. ఈమాత్రి
నేత్యాదికవీంద్రుమాత్రి "చారుసువర్ణభాసి నవచంపక
భూషయు సింధువార ముక్తారమణీయయు న్వకుళ
దామవతంసయు నై యపూర్వశృంగార విలాసలీల
నెసఁ"గెంగదా. వెండియు, నల 'కవిబ్రహ్మ' చిత్రించిన
పాంచాలి,

"ఎలదీఁగఁగప్పిన లలితపరాగంబు
క్రియ మేన మేదినీరేణు వొప్పఁ
జంపకంబున నవసౌరభం బెసఁగకు
కరణి నాసిక వేఁడిగాడ్పు నిగుడఁ
దోయజదళములఁ దుడి మంచుదోరఁగకు
గతిఁ గన్నుఁగవ నశ్రుకణము లురల
నిందుబింబము మీఁది కెందుచందంబునఁ
గురులు సెమ్మొగమున నెరసియుండె"

విరటునకుఁ జేర వచ్చు నా తెఱఁగెవరి మనములఁ
గరఁగింపకుండెడిని?

"అందంపు మందారకేసరమాలామకరందబిందు
సలిలస్యందంబు లందంబులై తొరఁగం బయ్యెదకొం
గొకింత తొలఁగం దోడ్తో కరాసారముల్ దరహా
సామృతసారముం గురియు"చు 'సర్వాఙ్గోల్లసితయౌ
వనాభామ 'సంగ్రామసీమ' నేలీల హేలాగతిం జరిం
చెనో కంటిరే! తునకు, "ఘుకంపుకొట్టుటక్ సూచిత
వేగపదారవిందరై కేచిక కుచంబులుం కుఱుచు లేనడు
మ్మల్లల నాడ నర్యోషక్ బూచిన యొక్క పోకనను
బోఁదియఁ జేరి విలోకనప్రభా వీచికలం దదీయపదవీ
కలశాంబుధి వెల్లిగొల్పు" నవ్వరూథిని నెవ్వరు గుఱుతు
పట్టలేరు?

వివిధ సౌరభాంచితములౌ సుమములయట్లు
విభిన్నరసోల్బణములకుఁ దావలములౌ సుమకోమలుల
చిత్రము లిట్టు లెన్ని మనోగోచరము లైనవిగదా.
ఇంకఁ బురుషవర్ణనరూపచిత్రము లెన్ని పరికింపఁ
జూచుకంబె 'నాపన్నప్రసన్నం'డౌ పురుషోత్తము
నొక్కని సందర్శింపఁగలిగితిమే. నది యుభయతారక
మౌను. "అల వైకుంఠపురంబులో నగరిలో" నెక్కు
డనో 'యామాల' నున్నవాఁ డాగజేంద్రుని కుయ్యా
లించినంతనే 'సంరంభియై'

"సిరికిం జెప్పక శంఖచక్రయుగముం
జేదోయి సంధింప కే
పరివారంబును జీర కభ్రగపతిం
బన్నింప కాకర్ణికాం
తరధమ్మిల్లముఁ జక్కనొత్తక వివా
దప్రోద్ధత శ్రీకుచో
పరిచేలాంచలమైన వీడక గజ
ప్రాణావనోత్సాహియై"

భూలోకంబున కవతరించుట మనకుఁ గన్నులఁ
గట్టినట్టు లేదా? దీన, మన మనఃఫలకమునఁ దద్వాగ్జాల
తూలికచే లగ్నము సేయఁబడిన చిత్తరువుఁ దుడుప
గలనుపకునా?

ఇట్లాలేసెపల్కు లేచిత్రకారుఁడును జేత
రచింపలేని చిత్తరువులఁ బ్రత్యక్ష మొనర్పఁ
జాలెడిని. అసరపోత్తికుణపొష్టన మెన్నిట నభివర్ణింపఁ
జాలుదుము? ఒక్కెడ 'బట్టు'లవలె 'లలనాజనాపాం
గము'లం గొనియాడు పరసులను 'నాకమ్మగీసేత్రలపైఁ
గయ్యమునకుం గాల్సాఁచు' నామాత్రుఁ జే 'వామ
పాదంబునం దోలఁగం ద్రోయించిన'ను 'ముద్దు'గఁ జే
యుంచును. ఇంతకు స్వయంవ్యక్తిత్వస్ఫోరకములై
యనవ్యానుకృతులౌ కృతులందలి యాకృతులుం, బ్రకృ
తులును రసికజనాంగీకృతు లౌను. లాఁతులు వికృతులై
నికృతి నందనయ్యెడు.

'మందః కవియశఃప్రార్థీ గమిష్య
త్యుపహాస్యతాం'

ఎట్లనఁ, గొందఱు 'కవియశఃప్రార్థు'లై
"ప్రాంశులభ్యే ఫలే లోభా దుద్బాహురివ వామన"
యన్నట్లందని పండుల కఱ్ఱులు సాఁచుచుఁ
గొన్ని పదముల గణబద్ధ మొనర్పఁగలిగిన మాత్రనే
కవుల మైతిమని మురియుచుంట కలదు. ఆ మాత్రము
నసేత్రైనఁ గవి కాఁజేరనివాఁ డెవ్వఁడు? అంగులకే

"పలుక నేర్చుట బహుళతపఃఫలము కాదే" యని యెంచ నేల? ఈ కాలగతి నిట్లెంచజాలు పుట్టి గిట్టియుండరు? "ద్విత్రా ఏవ కవయః ద్విత్రాణ్యేవ కావ్యాని" యని కొలఁదిమందినే కవులుగను, 'కాంతాసమ్మితతోపదేశ' యుక్తములౌ కొన్నిటినే కావ్యములుగను బరిగణింప నేమిటికి? గణబద్ధతయే కవితా ప్రధాన నియమ మేమో యందమన్న నిఘంటురచయితలును, శాస్త్రకర్తలును గవు లౌదురా? కాక, వచనము మాత్రము కవిత కాదా? గద్యరచయిత కవి కాకున్న "బాణా దన్యే కవయః కాణాఃఖలు రూఢమయశ" యనఁ జేరొందిన కాదంబరీకారుఁ డే గణబద్ధపు రచనంబున నట్టికీర్తి నార్జింపఁగలిగె? "దండినః పదలాలిత్య" మ్మనునది యాతని దశకుమారచరిత్రం దేటపడుటలేదా? ఇన్నియేల? లోకోక్తుల నెన్నిట లేదు కవిత్వము? ఏది భావసమృద్ధ మైన వదియే కవితా వైభవముగా నభినంద్య మాయుండును. "వాక్యం రసాత్మకం కావ్య" మ్మన విన మే? కావునఁ గవితకుఁ బ్రధానమైనది గణము కాదు; గుణమే. ఇఁక నీ గుణమా, గాంధర్వహారత్వదానశీలతలట్లులే పుట్టుకతోఁ బుట్టవలసినదే కాని యభ్యసించికొనఁజాలిన వంటునది కాదు. స్వయముద్భవమైన "భావనాశక్తిచే సవర్గశము గాఁ బ్రభవిల్లు భాగముల చక్కఁదనము పారశీక్యబలంబుపై నేర్పడినవానికి రా" దనుట నిక్కువము. అహంకర్తృతాస్ఫురణము లేక నిష్కామకర్మముగాఁ గవిత తనంత నెలువడు నెడ నది యంతయు హృద్యమయ్యెడిని. వానియంత వని రుప్పినవిగా కొరుల మెప్పులై చొప్పింపఁబడిన యలంకృతు 'లెకువ పాముల' గానే తోఁచును. సందర్భానుకూలవర్ణనము లింపుఁ గొలిపిన ట్లసందర్భ దీర్ఘవర్ణనములు కర్ణపేయములు కానేరవు. ఏ పూర్వజన్మసంస్కారముననో, యే జననవేళావిశేషముననో కవితాతేజ మబ్బినవానికి రజః ప్రకాశితవల్ల లోపలినుండి కుమ్మరిపురువు తొలిచి నట్లయి, పిత్తరాగికివలె నపుడపు డుద్రేక మొదవుచుండును. అందులకు దేశకాలనియమము కూడ నుండదు. అట్టి మనోవిజృంభణ మేర్పడునెడ నొక యనిర్వచనీయాద్భుత నూతనశక్తి యావహిల్లినట్లయి, యొక విధమైన యానందము పొంగిపొరలివచ్చి భావనా ప్రపంచ మను నంబరమెల్ల నొక్కమాటుగఁ గప్పిన వాయునవత వ్యాసమువలని వియన్నదీతరంగములఁ గ్రుంకులిడినట్లయి "సుకవితా యద్యస్తి రాజ్యేన కిం" మ్మనిపించును. "దృష్టిరమ్యయో రిత్రితా స్వయం" మ్మనుట కపుడే నిదర్శనము. మనస మానసంబునట్ల కవి ప్రకృతిసాన్నిధ్య సత్కృపాన మొనర్చు సమయ మదియే. అట్టి స్థితియం దతఁడు ప్రకృత్యతీత సచ్చిదానంద పరబ్రహ్మమును జేరు యోగికరణిఁ బ్రకృత్యంతర్లీన సౌందర్యము నానంద రసతరంగడోలికల నూఁగుచు ముక్తిద్వారమును దాఁకఁగలుగును. అపుడున్మత్తుని చూపువలె నై, యాతనికిఁ గట్టెదుట నగపడు నదియు నగపడనిదియే యగును. "రవి కాననిచోఁ గవి కాంచునే కదా" యన్నట్లగపడనిదియు నగపడునదియే కాగాను. ఇది యేమియనో మా ముం బరికించు నాప్రకృతిపురుషులఁ జెల్లఁ దన్మనఃకాంతాకర్షిత మగును. తత్ప్రకృతిసంయోగ కాలజనిత నాదబ్రహ్మమును జేరునైన మహోత్తుంగ కవితా గంగాభంగార్భటి యతఁడు; లేదేని 'తోటిపలుపుల' యగుఁడు. ఏమైన, "శిసుర్వేత్తి పసుర్వేత్తి" యనఁదగు నవ్యక్తమధుర గానానంద మున్న నందే యుండవలయు. అందలి రసమా, "రసజ్ఞుఁ డెఱుఁగుఁ గవి యేమెఱుఁగు" నన్నట్లు తత్కావ్యానయమునుండి వెలువడి రసికమనోపీఠములలోనికి వెల్లువలై బహుముఖంబులఁ బ్రవహించి, తన్మాధుర్యములు వికసింపఁ జేయఁగోరుఁగును. శిల్పచాకచక్యమున్న నప్పటికేదేనుఁ డీ. అప్పటి వాక్కు "పలికించెడివాఁడు రామభద్రుండఁట" యన్నట్లుండును. కాఁదగు నలంకారమదే కావలెఁ గాని, లేనిపోని యలంకారముల తెరువున కామనము పోనేరదు. యుక్తులదెసకైన నాస్థితిలో నాలోచనము ప్రసరింపదు. లోకోక్తులకొఱకు, నిదర్శనములకుఁ దడవవలసిన యవసర మది కానేకాదు. ఎక్కడెక్కడివి వానియంతట నవే దొరలును. అదే కవిత్వము.

'కంటికొకటి యింపు, జిహ్వకొకటి రుచి'

కాని, యుద్గ్రంథముల నిర్వహించునెడ మొదటి నుండి తుదిదనుక నట్టి తాదాత్మ్యభావము నిలుచుట యసంభవము. ఏ మహాకవుల కృతులందైన నట్టి యుత్తమ శిల్పముగాఁ బ్రకాశించు భాగము లక్కడక్కడ

మాత్రమే యుండును. అవి పండితపామర హృదయం గమములు. వానినిబట్టియే తత్తత్కృతులు వన్నెఁగనునది. మిగిలిన భాగము లాలోచనాశక్తిచే యుక్తియుక్తములును, పాండిత్యబలమున నలంకారభూయిష్ఠములును, చిరాభ్యసన నైపుణ్యమున మృదుమధుర నిర్దుష్టశయ్యాపాకవిశిష్టములును, గ్రాహ్యదిక్కులుగా నబ్బు కూర్పునేర్పు కొలఁదిఁ జిత్రబంధగర్భప్రకృష్టములును బూరింతురు. అవి చాలవఱకు విద్వన్మణిమనోహ్లాద్యములు కావచ్చును. కాని, సాధారణులకట్టి భాగము లద్భుతజనకము లయినంతగా నానందసంధాయకములు కానోనన వలను పడదు. ఇందు నానావిధమైన శిల్పవైలక్షణ్యము లేకపోలేదు. తొలుతటిది నిసర్గముల యింపయిన నిది కృతకముల సొంపు. ఒకటి పూవిన పూవుల యందమైన చెండవధి కూర్చిన పూవుల చందము. ఒకటఁ గాచినకాయల చవి యుండ వేఱొకట వేసిన యూరుగాయల చవి యుండును. కంటి కొకటి యింపు; జిహ్వ కొకటిరుచి.

ఇట్లు రుచిభేదబహుళంబౌ కలాప్రపంచంబునం దఖిలాభిప్రాయసంపాదన మొందైన దుర్ఘట మనక తీఱదు. కొందఱ దృష్టికి వంగకలాభిరామము లాకర్షకము లౌను; మఱికొందఱ కన్నులకు నవివర్ణచిత్రము లే యింపుగొలుపును. ప్రకృతిసౌందర్యాభివర్ణనములందలి ప్రీతి యొకకొందఱకైన నన్యులకు శ్లేషయమకాదుల తోడి కృతకవేషభాషాదికములం దెక్కుడాదరము. ఇ ట్లెవరికిఁగాని నచ్చినవే నిలిచెకిరి. ఏవి నిలుచునను నది కాలమే నిర్ణయింపవలెను. ఏవి యెటు లున్నను, తిక్కనసూరనల రచన లాదర్శములుగాఁ గొనఁదగిన వన్నఁ గావను పారుమాత్ర ముండదు. సోమరాజు లొనర్చిన యది యాంధ్రీకరణమాత్ర మేయయినను స్వాతంత్ర్యము, నుచితజ్ఞతయు వెలయించినవాఁడయ్యెను. సందర్భ శుద్ధిగల కల్పనాకౌశలము దీపింపఁ గొలఁత నాటక పాత్రలఁ జిత్రించిన శిల్పకళాచతురుండు నయ్యె.

"తెలుఁగుకవిత్వము న్బహుళ
దీర్ఘసమాసపదాళిఁ గూర్చి సి
వ్వులు రచియించుకన్న పర
సమ్మతిల నచ్చతెనుంగుపల్కులన్
గలపి రచించుటై ఖరి, క
నన్వివ వ్యర్థపదంబు లేమియున్
సలలితవాక్పటుత్వమున
జారుమృదూక్తుల కూర్పునేర్పు నా
రులు కని మెచ్చునట్లు తన
రుంగ, దృ చెప్పిన దెద్ది చెప్పకే
పలుమఱు యుద్ధపద్ధతుల
బంధురభావసమన్వితంబుగన్
బలుకులఁ జేసె లోల్కగతి
భారతమందుఁ బదేనుపర్వముల్
కలుమ విహీనుఁ డాతనికె
కర్గె రచింపఁగఁ దిక్కయజ్వకున్"

'కృతికిని నిలుకడ వలయును'

ఆతని ప్రతిభ యనన్యప్రాప్యము. ఎక్కడనో తప్ప- యిప్పటివేల మహాగ్రంథములోను 'ఏమిచెప్పుదుం గురునాథా' యని యాఁగవలసెనా? ఒరులకో, పేరునకే 'ఘటికాశతగ్రంథకలనంబులు'గాని చిరస్థాయి సత్కీర్తిసంపాదక లేఖిని యే 'నిరుపహతిస్థలంబున'నో కాని నిలువబడ నేరదయ్యె. కావుననే 'నిలుకడవలయుఁ గృతి' కని పెద్దలు నుడివిరి. కావున్న, 'విద్యాపనాథ' శ్రీనాథభట్టమహాకవి యిడినదే తడవడిగా "మనోహర ద్యోతకనో స్తనిభలమగ్రత గోఘృతహాయన ప్రసారాతిరసప్రసార రుచిరప్రతిమంబుగ" నద్వితీయా సుధారాప్రవాహంబును నురిపించి గండపెండేరమును దొడిగించికొన్న 'యాంధ్రకవితాపితామహుఁడు' తన జీవితకాలమంతకు నొక్క వసుచరిత్రమే రచింపవలసెనది? కాను. అట్లోన ర్చెఁగనుకొనే రసజ్ఞుల 'శిరీష పేశల సుధామధురోక్తులం' దన్ని ప్రబంధకృతికర్తలలో నెల్ల నల్ల పెద్దన్న సార్థకనాముఁడు గాఁగలిగె. పిదపఁ దలయెత్తిన రామరాజభూషణు శ్లేషగానము 'ప్రతిపద్యరసాస్పద' విజయవిలాసాదుల కన్నోన్న 'పిల్లవసుచరిత్రలకుఁ' ద్రోవచూపిన దైనది. ఇంకఁ గవికర్ణరసాయనములు సత్యబోధకములు నన్యములుం గొన్ని కీర్తిసాధకములు కాకపోలేదు. కాని తిక్కన నాటక పాత్రసృష్టి, యల్లసాని వాని యల్లిక జిగి, బట్టుశ్లేషయమకాదులు నొక్కటం జేరిన కళాపూర్ణోదయం బన్నదో 'కళాపూర్ణోదయంబు' నన కానాటఁ దెక్కర్త సూరన 'సర్వతోముఖచాతురీధురుయ్యం' డన వెలసెను.

## కవితాశిల్పపు వెనుకంజ

పెండియు, 'రసికజనమనోభిరామము' లాగని పించికొన్నవి కొలఁదిగ వెలసినను క్రమముగాఁ బూర్వ భారత శిల్పౌన్నత్యమువలెనే కవితాశిల్పౌన్నత్యమును వెనుకంజ వేయఁదొడఁగెను. ఒకటి కొకటి నకలుగా దీర్ఘసమాసఘటాయిష్టములు, నష్టాదశవర్ణనాంశ విశిష్టములు, నికృష్ట శృంగారరూప సర్వాంగ వర్ణనాత్మకములు నై ప్రబంధనామకములుగాఁ గొన్ని బయలు వెడలఁ దొడఁగెను. శిల్ప మడఁగినది యనవచ్చును కృతిగాఁ దొలుతఁ జేయఁబడినదానిలో నొప్పమగాని యచ్చుగ్రుద్దినమాత్రాన రసజ్ఞుల మెచ్చుఁగొనవచ్చునా? ఇఁక నీయర్వాచీన ప్రబంధనాయికలా సర్వాంగ సుందరులందలి పద్మగంధులు కొందఱు ముఖములు చేతులు కాళులుం బద్మములంతే చిక్కినందున వారు మాత్రము సుఖముల దిక్కునివా రైపోయిరి. ఇప్పుడు 'దైన్యమునుగుడుచు శుష్కసత్వులకు' వారి చాపీతి బంధప్రక్రియ లేవగింపఁ దగినవియు నయ్యె. ఏమైన నిప్పటి నాటకప్రదర్శనములందు స్త్రీలే స్త్రీపాత్రాభినయ మొనర్చుటలో నెట్టి నయకళా వైలక్షణ్య మంతరించినదో యట్లే "కోమలత మార్దవముం దొలంగిన" యర్వాచీన ప్రబంధ రచయితలు కొందఱు తుచ్ఛస్త్రీ వర్ణనములలో శృంగారముయొక్క శృంగారమే బంగారమైనదేమో! కాదేని, "నివారింపఁబడినదాని కుండు చలి యనివారితముల కుండు" దనుట నిక్కమ కాన, దీన శృంగారమునఁ జవిఁదొలఁగించి పాఠకులకు వైరాగ్య మలవఱప నెంచిరో యనిపించెడిని. "నాటకాంతం కవిత్వ" మ్మన్నదా, రేనాఁడో వెనకఁ బట్టినదయ్యె. 'ప్రయుక్తలక్షణాన్విత ధీరోదాత్త' నాయకునినో యొక్కరీతినే పట్టుకొనివచ్చు ప్రాచీన మార్గానుయాయుల పిచ్చి వదలి, స్వేచ్ఛమై మాటలాడించుటే నాటకరచనముగా భావించి యొక్కొక్క ముక్కతోనే వినాయకుల సృజింపఁజాలిన యైంద్రజాలికశక్తులు పెంపందనైనవి. ఇఁకఁ గవితావిమర్శకులా, కానివా రెవ్వరు? "చాటియాకులు వృద్ధ ప్రచారములు ప్రమాణములు గాక" యెవరి మనస్సు నారికిఁ ప్రేరకముగాఁ గలము సాగింపఁజాలిన జాదిశాలుల మైతిమి. ప్రాచీనాచారములయెడ విముఖత యేర్పడి బుద్ధులు పెడత్రోవలఁ బట్టుచున్నవయ్యె. అన్యదేశీయమార్గానుసరణాభిజ్ఞతయు, నూతనప్రియత్వముం దలసూపెనవయ్యె. తోఁచినట్లెల్ల నేతోత్రియో మొత్తియో పసవ్రాసి యచ్చుపడఁజేయుదురుమయ్యె. ఎవరి యిచ్చ వచ్చినమై వారు సంస్కరించి పునర్నిర్మాణదక్షత చార్జింపఁజూచుటయ్యె: "నిందతి కంచుకమేవ ప్రాయస్సమక్షస్తనీ నారీ" యన్నట్లొకఁడు కవిత నిర్యతిప్రాసమైన మెఱుఁగనుము. మఱియొకఁ డేఛందస్సునను జేరని యేదో కుంటలే భావప్రకటనావకాశము లనును; వేఱొకఁడు గ్రామ్యములఁ గాకలముల నెక్కింపసాగును. ఈనవీన గ్రంథస్థములైయున్నవానికంటె నిట్టివే భావప్రధానము లను సుమతులు సుమతిశతకమును సృష్టితికిఁ దెచ్చికొనఁబోలు. పెక్కేల? లోకుల హృదయములందెల్ల నాటఁబడియున్న వేమన్న సుభాషితములకంటెఁ జేటలెమఁగున భావమును సురిపింపఁగలవారెవ్వరు? ప్రకృతిలో ద్రష్టవ్యమైన దెల్ల నొకటిరెండు మాటలతోనే 'శివముపోసి బొమ్మలాడింపఁగలిగెను' కవియోగిపుంగవుఁ డాతండె కాదే! కుటిలమతాచార వేషధారిత్వాదు లాతఁడు పరిహసింపఁగా నేటువడ్డవారి నోటను 'నవ్వే'వచ్చునన్నఁ గాదనరెవ్వరు? ఇంటిలోని పోరికిఁ జెప్పులోని రాయి, చెవిలోని జోరీగ, కంటిలోని నలుసు, కాలిముంటికంటె నిదర్శనము లింకేమి యుండెడిని?

## పిండితార్థము

ఇట్లనేకములఁ బరికించి 'కవిత్వతత్త్వవిచార' మొనర్చి యొనర్చి, శిల్పవిమర్శనమునఁ దేల్పఁబడిన సారాంశములలోఁ బెక్కులు కవితావిచక్షణులచే సంస్తూయమానములును, భావిశిల్పుల కనుసరణీయములును నై యున్నవి. భావోదయమునఁ బ్రకాశమునకు వచ్చు వస్తుభాగములుమాత్రమే కొన్నిరేఖలతోఁ జిత్రించినట్లుండవలెఁగాని సాంగోపాంగవర్ణన మనావశ్యక మనుట శాస్త్రీయకమే. కవి స్వయముగా దేనినైన వర్ణించుకంటెఁ దాను గల్పించిన పాత్రములచేఁ జేయించునెడ నధికరమణీయతాసంపాదక మనుటయు నిక్కువమే. ఎందైన రూపమాత్రాభివర్ణనముకంటె గుణగణనమునఁ బ్రాధాన్య మెంచుటయు సంస్తవ్యమే. ఇంక నావర్ణన

ములు కథను మించిపోవునంత దీర్ఘములైన విసుపు తోఁ
పకమాన దనుటయు నవుథ్యమై కవేద్యమే. మానవప్రకృతి
నద్దమునఁ బెట్టినట్లు సందర్భశుద్ధిగల లోకోక్తులతోడి
భాషణ ప్రతిభాషణములవల్లఁ దేల్పవలెననఁగా
నదియును శంస్యమే. కథాసందర్భములనుబట్టి యాయా
పాత్రలు కాలానుగుణపరివర్తనము నందినట్లు లగపడ
వలె ననుటయుఁ బ్రశస్యమే. శ్రవ్యప్రబంధములందును
దృశ్యములందువలెనే పాత్రోచితసంభాషణల నెల
కొల్పి వానితోఁ గథ సాగించి యుండలిన్వృత్తము,
నాయాపాత్రల చిత్రములను గనులఁ గట్టినట్లు చేయఁ
గలుగుటయే యుత్తమశిల్పత్వప్రతిపాదక మనుట
యన్నచో నది నిర్వివాదాంశమే. కథాంగము లేక
భావముఁ దాల్చి యొక శరీరముగా నేర్పడఁదగు నను
టయు నట్టిదె. ఇఁక రాజులే కథానాయకులు గావలె
నను నియమము లేక మనసుతోఁ గలిసిన మైత్రిని బ్రవ
ర్తించు సుగాత్రీశాలీనప్రభృతిరసభావపోషక కథా
సందర్భములుకూడ గ్రహింపవలెనన్నను గ్రహింతము.

## ధర్మోపదేశ మత్యావశ్యకము

అంతియేకాని, ఈవాఙ్మయమహాసముద్రమునఁ గృతి
ప్లవముల సాగింపఁజాలు సుధీవరులౌధీవరులు చుక్కాని
మాత్రము విడువరాదు. అదేదనఁగా, గమ్యమేదో నీతి
ప్రతిపాదనము గావలె ననునది. అదిలేదే, నదే, 'దౌర్భా
గ్య' మనిపించుకొనును. సుఖసాధకమౌ శిల్పమున కది
యొక యంగము కాదుగదా యేమిటి కందురేమొ!
కల్పితవిగ్రహాలైనఁ బ్రపంచమునఁ దాత్కాలికసుఖ
దాయకములు గాక శాశ్వతఫలసాధకములును గాఁదగు
నట్లు నిర్మింపఁబడవలెను. భావోద్రేకజనక మానవి
రజస్సే యంబవను మదికిఁ గుదిరికఁ జిక్కించునది
సత్త్వమే కాదే? అన్నము లేని యుదరవు లేమిటికి?
జిహ్వకింపుఁగొలుపునవి యుపరసము లైనను దేహము
నకుఁ బుష్టి యిడఁదగిన ప్రధానరస ముండునది ప్రసాద
మునకేకదా! కావున నిండైన ధర్మోపదేశ మత్యా
వశ్యకము. అది లేనిది కావ్యమే యనిపించుకొనదు.
అందులకే మహాకవు లర్హపాత్రల నరసి వారిచే
నుచితస్థలముల నుచితరీతిని బ్రకోన్నతరమర్యాద ననుస
రించి ధర్మముల నగ్గడింపఁజేయుట కలరు. అట్టియెడల
భీష్మునివి 'పరస్పరాసంగతవిచారము' లనియు, ధర్మ
జునివి 'వదరుఁబోతుప్రలాపము' లనియు ననఁజనదు.
భారతమునకుఁ 'బంచమవేద'త్వసంపాదకములౌ 'గీత
లసంగతప్రకరణములు' గా ననుటమాత్రమే యిప్పటికిఁ
జాలును.

ఇంక నీ 'విచార'కర్త "ఏటుంగునే పసులకాపరి
భావజమర్మకర్మము" లని మున్నెక్కడ నొక్క
తిమ్మన్న యన్నట్లే "కవి ప్రద్యుమ్నునిట్టి నీచపాత్ర
ముం జేయుట యాతఁడు గొల్లఁ డనియా" యని
పరిహసించుట కిరవైన యేవో విరహాసమయ
ప్రలాపములవంటివానిని బట్టి "యశ్లీలదోషము మన
సదాచారములలో నొకటి" యన నొప్పదు. భారత
సాధ్వీమణులను "భర్త సఖకవెట్టెను ప్రాణాయామ
బ్రహ్మ" యని గేలిసేసి "యిక్కడి పతివ్రతలకంటె
నెక్కుడిపలుగాకులైనవే" లనుటయు, మన వివాహ
ప్రక్రియ 'హృదయబహిష్కార'మనుచు "నిజభర్త
కులాభిమాని కాఁడని వదలివేసి యన్యుఁడు దేశభక్తుఁడని
చేరువఁజేర్చికొని" తాను గులమునకు వెలియౌట మేలే
యనుటయు మెండలుగాఁగలవి కేవలపాశ్చాత్యవ్యామో
హజన్యములుగా నెడుగఁదగినవి. వలదనుకొనుచు మన
మందే చొరరాదు. స్వదేశాభిమానముకై దేవులాడు
నిక్కాలమునఁ గేవలపరాశ్రయులము కానేమిటికి ?
ఎక్కడనైన గుణమున్న నదిమాత్రము గ్రహింపఁదగినదే
కాని 'పొరుగింటిపులుసుకూర రుచి'గా స్వీయసదాచా
రములఁగూడ గర్హించి యన్యదురాచారములందుఁ
బ్రీతిఁదగులుట సమంజసము కాదనుట కిది సూచన.

కవితాశిల్ప మనల్పకల్పము బుధాఖ్యాయమానంబు, ప్రా
గ్భవపుణ్యోదయనైపుణీకలిత వాక్చాతుర్యచిత్రాకృతి
ప్రవణోదంచితశేముషీచణయశస్స్వచ్ఛప్రతానంబు తే
జ వహింపందగు భారతావని నిఁక న్శోభారతీ! భారతీ!

# తెనుగు రాత్రి

= శ్రీ శ్రీరంగం నారాయణబాబు =

శూన్యమ్మగు చూపులతో
శుష్కించిన దేహముతో
పేదవాని కడుపుమంట
కాలిపేలిపోవు కోర్కె
గగనమ్మున చుక్క !

శక్తి సన్నగిల్లిపోయి
రక్తము విరిగిన గుర్విణి
హస్తమునన్ చిట్లిపోయి
శత్రుమ్మై బిలుకుమార్చ
మాసిపోని గాజుముక్క —
నెలవంక
సంఘుంపంక !

నోట మన్ను కొట్టు జగతి
నోరు తెరువ పాలకొరకు
బాలికచూలాలి కిడుకుబిడ్డ
తూలిపోవు అసువులె
నీలాలగాలి వీస్తోంది.

తల కాలని తల్లిశవం
తండ్రి పెడ్లికై తహతహ
కడవటి పిల్లకు నేడ్చే
గంపెడుపిల్లల దుఃఖపు
కంటివాన
మిన్నంటి కురియు మంచుసోన.

పసితనమున పెండ్లి
భర్త పరమపదము చేర
విధవ మసకమసక యౌవనమున
కుసుమించే తల్లితలపు
గుండెల్లో పాలపాట
ఆకాశపు పాలబాట.

ఆంధ్రయువక జీవనార్చి
ఆరిన వాడలనుండి
కాలిన మేడలనుండి
ధూమ మ్మెగజిమ్మె
చీకటి దుమ్ము రేగు
తె ను గు రా త్రి ! ! !

— 'రుధిరజ్యోతి' నుండి.

# అఱవము, తెలుగు - వాని ప్రాచీనత

= శ్రీ కోరాడ రామకృష్ణయ్య =

అఱవము, తెనుగు — ఈభాషల ప్రాచీనతనుగూర్చి కీ. శే. కొమఱ్ఱాజు లక్ష్మణరావుగారిచే వెనుక రచియింపబడి మూలపడియుండిన యొక విమర్శవ్యాస మిపుడు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి మూలమున ఆంధ్రపత్రిక వృషసంవత్సరాదిసంచికలో ప్రకటితమగుట తటస్థించినది. అందు ద్రావిడభాషలలో మిక్కిలి పురాతనమైన భాష యేది, అది అఱవమగునా, తెనుగు అఱవమునుండి పుట్టినదా అను విషయములు విమర్శింపబడినవి. మూల ద్రావిడభాషా స్వరూపము తక్కిన భాషలకంటె అఱవమున నెక్కుడుగా గనబడుచున్న దను కాల్డ్వెల్ పండితుని యభిప్రాయముతో శ్రీ లక్ష్మణరావుగా రేకీభవింపక, గ్రియర్సన్ మొదలగువారు చెప్పినట్లుగా అఱవముకంటెను తెనుగు మొదలగు నితరద్రావిడభాషలలోనే ప్రాచీన భాషాసంప్రదాయము నెక్కుడగా నిలిచియున్న దనియు, కాని గ్రియర్సన్ అట్టి నిదర్శనములను జూపలేదు గావున తా మట్టివానిని గొన్ని చూపదలచితి మనియు దెలిపియున్నారు. అందుకుగాను కొన్ని సజాతీయపదములను గ్రహించి తెనుగులో నిలిచియున్న యాపదముల రూపమే తక్కిన యఱవకన్నడ భాషారూపములకంటె ప్రాచీనమని నిరూపింప యత్నించియున్నారు. తెనుగు భాషలో మూలభాషయొక్క పురాతన స్వరూపమును సూచించు చిహ్నములు — అఱవకన్నడములనుబట్టిచూడ గుర్తించుట కవకాశములేనివి — కొన్ని నిలిచియున్నవనుమాట వాస్తవమేకాని, యావ్యాసములో జర్చింపబడిన తెలుగుపదముల స్వరూపము తమిళకన్నడపదములకంటె మూలభాషాస్వరూపమునకు సన్నిహితమని, ఆకారణముచే నవి ప్రాచీనము లని చెప్పుట కవకాశము గలదా యను విషయమమాత్రము పునఃపరిశీలనార్హమని తోచుటచే నే నీవ్యాసము వ్రాయ గడగితిని.

దక్షిణదేశమున వ్యవహారములో నున్న భాషలన్నియు నొక కుటుంబమునకు జెందిన వనియు, ఆ కుటుంబము ద్రావిడభాషాకుటుంబ మనుపేర బరగుచున్న దనియు, తెనుగు, అఱవము, కన్నడము మొదలగు భాష లొక్క కుటుంబమునకు జెందిన సోదరభాషలని చెప్పబడినపుడు వానిలో నేది పురాతనము, దేనినుండి యేది పుట్టినది యను ప్రశ్నలకు తావుసందర్భము లే దనియు, మూలభాషాస్వరూపమునే తత్తద్దేశకాలానుగతములగు మార్పులతో నాయాభాషలు వహించియుండుననియు నీమొదలగు విషయములను శ్రీ లక్ష్మణరావుగా రందు చక్కగ వ్యక్తీకరించియున్నారు.

అఱవము, తెనుగు నొక్క కుటుంబమునకు జెందిన సోదరభాషలు. వీనికి జన్యజనకభావసంబంధము లేదు. కాని తెనుగుభాషపుట్టుపూర్వోత్తరములనుగూర్చి తెలిసికొనదలచినపుడు మాత్రము అఱవభాషయొక్క సాహాయ్య మత్యావశ్యకముగా గనబడును. ఒక్క అఱవముతోడనే కాక తక్కిన దక్షిణదేశభాషలతో గూడ పోల్చి పరిశీలించినగాని తెనుగుభాషయొక్క ప్రాచీనచరిత్రను దెలిసికొన సాధ్యముకాదు. ఈ విషయ మిటీవలనే దక్షిణదేశభాషాతారతమ్యపరిశీలనకు గడగిన కాల్డ్వెల్ పండితుడు మొదలగువారి పరిశ్రమలమూలముగా గనిపట్టబడినది.

తెనుగుభాష పుట్టుక, పూర్వచరిత్రములనుగూర్చి భిన్నమతములు కలవు. "ఆంధ్రభాష వికృతి. అనగా సంస్కృతప్రాకృతములనుండి యేర్పడిన" దని యాంధ్ర వైయాకరణుల మతము. ఇది ప్రాకృతములలో నొకటియే యని, లేదా అర్ధమాగధియొక్కగాని, పైశాచీ ప్రాకృతముయొక్కగాని పరిణతరూపమే యని కొందఱి మతము. సంస్కృతప్రాకృతములనుండి

పదజాలము విశేషముగా దీనిలో జేరినను, తెనుగు భాషయంతయు సంస్కృత ప్రాకృతభవము కాదనియు, తెనుగుటైక్యమునుబట్టియే దాని ముఖ్యలక్షణములను గ్రహింపవలయు ననియు, నాలక్షణములలో దీనికి దక్షిణహిందూదేశభాషలతో సన్నిహితసంబంధము కనబడుచుండుటచే నిది ద్రావిడభాష లనబడు దక్షిణ హిందూదేశభాషలతో సాజాత్యముగలిగిన యొక స్వతంత్రభాషయేకాని సంస్కృతప్రాకృతముల వికృతి కాదనియు మఱికొందఱ మతము.

ఈ దక్షిణదేశభాషలగు తెలుగు, అఱవము, కన్నడము, మలయాళము మొదలగునవి సజాతీయము లని చెప్పువారు వీనికి ద్రావిడభాషాకుటుంబ మని వాడుచుందురు. ఒక మూలభాషనుండి యేర్పడినవై కాలక్రమమున గలిగిన మార్పులమూలముగా భిన్నములు, స్వతంత్రములు నైన భాషలనే, వానికి గల సజాతీయత్వమును బట్టి, యొక భాషాకుటుంబముగా భాషాతత్త్వవేత్తలు పరిగణింతురు. ఇవియన్నియు నొక కుటుంబమునకు జెందినవని చెప్పబడినప్పుడు ఇవి యన్నియు నొక మూలభాషనుండి కాలక్రమమున బయలుదేరిన సోదరభాషలని తలపవలయునే కాని, వీనిలో నెద్దానినుండి యేది పుట్టిన దను ప్రశ్న కవకాశము లేదు. కాని వీనిలో నొక్కొకదానినుండి ప్రాంతీయభాషలు బయలుదేరి యవి మరల స్వతంత్రములైనపుడు ఆయా భాషలలో శాఖ లేర్పడుననుట కవకాశమును లేకపోలేదు. ఒక మూలభాషనుండి యేర్పడిన సజాతీయ భాషలని చెప్పబడుచున్న అఱవము, కన్నడము, తెలుగు మొదలగువాని విషయములో మాత్ర మొకదాని నుండి మఱియొకటి పుట్టినదనికాని, ఒకటి పురాతనము, ఒకటి యర్వాచీనము అనికాని తలచుట కవకాశ ముండదు. కాని యీప్రశ్న తఱచుగా బయలుదేరుచునే యున్నది. అందు కొక కారణము ఎవరి భాషయందు వారికి గల యభిమానాతిశయము కావచ్చును. అది పాటింపదగినది కాదుగదా. ఒక భాషయందు లభించిన వాఙ్మయ మితరభాషల లోనిదానికంటె ప్రాచీనమై యగపడుచుండుటవలన గూడ నట్టి భావ మేర్పడవచ్చును. తెనుగు కన్నడములం దిప్పటికి లభించిన వాఙ్మయముకంటె మిగుల ప్రాచీనమగు వాఙ్మయము తమిళభాషలో గల దనుటకు దగిన కారణము లగపడుచున్నవి. కాని యొక భాషలో నితర సోదరభాషలందుకంటె ప్రాచీనమైన దగిన వాఙ్మయము లభించినంతమాత్రమున దానినుండి యితరములు పుట్టినవని నిరూపింప సాధ్యము కాదు. ఇతరభాషలలోని వాఙ్మయ మేకారణములచే నంతరించినదో, వృద్ధిబొందనేలేదో యను విషయములను చారిత్రకదృష్టితో బరిశీలింపవలసియుండును. తమిళ భాషలో ప్రాచీనవాఙ్మయ ముండుటయే కాక భాషారూపములలోగూడ ననేకము లితరభాషారూపములకంటె ప్రాచీనములుగ గనబడుటచేతనో, ఆభాషతో నితరదక్షిణదేశభాషలతోడి పరిచయముకంటె నెక్కుడుపరిచయము కలుగుటచేతనో కాల్డ్వెల్ పండితుడు అఱవభాష యితరభాషలకంటె మూల ద్రావిడభాషకు సన్నిహితమైయుండు ననియు, మూల భాషాస్వరూపము ఈ భాషలో నెక్కుడు కనబడుచున్న దనియు జెప్పినమాట వాస్తవమే. అది వాస్తవము కాదనియు, తెలుగు మొదలగు నితర ద్రావిడ భాషలలో నఱవమునందుకంటె నెక్కుడు పురాతనములైన విశేషరూపములు కనబడుచున్నవి గావున నఱవముకూడ నితరభాషలవలెనే యొక యుపభాషయే కాని, దీనికంటె ప్రాచీనమని చెప్పుట కవకాశ మేమియు లేదనియు గ్రియర్సన్ పండితుడు మొదలగు వారు చెప్పియున్నారు. విచారింపగా నీ యిద్దరు పాశ్చాత్యపండితుల యభిప్రాయములలోను ప్రమాదకరమైన వైరుధ్యము వాస్తవముగా లేదనియే చెప్పవచ్చును. ఏలయనగా ప్రాచీనమగు మూలద్రావిడ భాషాస్వరూపమును మన మన్వేషించి గుర్తింపవలె నన్నచో నీ యఱవకన్నడాంధ్రాదిభాషలలోని విశేష రూపముల నన్నిటిని సరిపోల్చిచూచి, వానిలో కాలక్రమమున గలిగిన మార్పులను గమనించి, వానిమూలమున నాయాభాషల ప్రత్యేకలక్షణములను నిర్ణయించి వీని మూలముగా జేరే మూలభాషారూపము లెట్టిసంప్రదాయములకు లోనై యాయాభాషలలో కాలక్రమమున నాయారూపములను బొందినవో కనిపట్టిన పిమ్మటనే, యా మూలభాషాస్వరూపమును మనము

గోచరింపజేసికొని, ఆయా భిన్నరూపములందు పొడకట్టిన సామ్యభాగములనుబట్టి ఆ మూలభాషను నిర్మాణముచేయవలసియుండును. కావున నా ప్రాచీనభాషాస్వరూపమును గుర్తించు విషయములో నీ సజాతీయ సోదరభాషలన్నియు మనకు సమానముగ దోడ్పడవలసియే యున్నది. కొన్ని సహజలక్షణము లొకభాషలో మార్పునొందక నిలిచియుండ మఱికొన్ని లక్షణములు మఱికొన్ని భాషలలో నిలిచియుండవచ్చును. కావుననే వాఙ్మయముకూడ లేని తుళుభాషలోని లక్షణములు కొన్ని యతిప్రాచీనములని తద్భాషాపరిశీలకులు చెప్పుదురు. అట్లే మధ్యపరగణాలలోని గోండు, కుయి, రాజమహల్ భాషలు, బ్రాహుయిభాష మొదలైనవికూడ మూలభాషాస్వరూపనిర్ణయమున చాల ప్రయోజనకరము లగునని తెలుపబడుచున్నది. కాని యీ నడుమ పాశ్చాత్యులగు భాషాతత్త్వవేత్తలు కొందరు ఈ మధ్యపరగణాలలోని ఆటవికజాతులు వ్యవహరించు గోండు మొదలగు ద్రావిడభాషలే ద్రావిడభాషాతత్త్వపరిశోధనము విషయమున తమిళభాషకంటెనుగూడ నెక్కువగా తోడ్పడగలవనియు, నాకారణముచే నీ పరిశోధనము దక్షిణపు కొననున్న తమిళభాషతో ప్రారంభించుటకన్న మధ్యదేశమందలి యాటవికుల భాషల పరిశీలనముతోనే ప్రారంభించుట మిక్కిలి ప్రయోజనకారి కాగలదనియు చెప్పజొచ్చిరి.* ఈ పరిశోధనము విషయమున సంస్కారముగలిగిన తమిళాదిభాషలకు గల ప్రాధాన్యమును సంస్కారహీనములగు గోండు మొదలగువానికి నివ్వవలసియుండునని చెప్పుట న్యాయమేమో కాని, తమిళాదిభాషలకు గల ప్రాధాన్యమును తగ్గింపజూచుట సాహసమనక తప్పదు. ఒకభాషలో నెంత ప్రాచీనమగు వాఙ్మయము లభించిన నంత ప్రాచీనకాలమువరకు నాభాషయొక్క స్వరూపపరిణామము నన్వేషించుటకు సులభావకాశము దొరకును గదా. వాఙ్మయశూన్యములగు భాషలలో గొన్ని యతిప్రాచీనలక్షణములు నిలిచియున్నను, వాని ప్రాచీనత యిట్టిదని నిర్ణయించుటకు దగిన యాధార ముండదు కావున నితరవిధముల జేసికొనిన నిర్ణయముల సరిపోల్చుకొనుటకుమాత్ర ముపయోగించును. అవి సంస్కారహీనములగు భాషలగుటచే నాభాషారూపములు తొందరతొందరగా నెక్కుమార్పులకు లోనగుచుండుట యూదబుస్థింపవచ్చును.

పైని చెప్పిన జూలిస్ బ్లాక్, టటిల్ పండితుల యభిప్రాయము దక్షిణదేశీయములగు ద్రావిడభాషలకు ఉత్తరదేశీయములగు నార్యభాషలపై గల ప్రభావమెట్టిదియను విషయమునుగూర్చి చర్చించునపుడు తెలుపబడినదేయైనను ద్రావిడభాషాదిమలక్షణములను దెలిసికొనవలదలచినప్పుడు తమిళభాషయొక్క ప్రాముఖ్యమును తగ్గించుట కేవిధమును నవకాశము లేదనియే చెప్పవలసియున్నది. ప్రాచీనద్రావిడభాషాలక్షణములు దానినుండి బయలుదేరిన భాషలన్నిటిలోను గనబడుచుండు ననుట సహజమేయైనను, తమిళభాషకు దక్కినవానికంటె ప్రాచీనకాలముననే సంస్కారమేర్పడుటచేతను, వాఙ్మయము బయలుదేరుటచేతను, అవి మనకిప్పుడు లభ్యములై యుండుటచేతను వానినిబట్టి తక్కినభాషలలో నేయేకాలమున నెట్టిమార్పులు గలిగెనో, వాని పరిణామక్రమ మెట్టిదో సరిపోల్చి తెలిసికొనుట

---

* *"If we want to understand the history of the languages of the South, we should begin from the Northern side"— E. Tuttle of America.*

*"The Dravidian language which has almost always been chosen for comparison is Tamil, which, in fact is best known of all the dialects for various reasons. Even if we admit that from the Vedic up to the present time, Tamil has changed very little, there still remains the fact that the domain of this Dravidian dialect is the further most off from the region of Vedic civilization on this principle alone, it should have been the last one to be taken into consideration for the sake of comparative study. If we want to understand the history of the languages of the South we should begin from the Northern side." (Pre- Aryan & Pre- Dravidian)*

శబ్దకోశ మేర్పడుచున్నది. ఈవిషయమున దీనివలన గలుగు ప్రయోజనము విశేష మనియే చెప్పకతప్పదు. గ్రియర్సన్ పండితుడు తమిళభాషయొక్క ప్రాముఖ్యమును గూర్చి కాల్డ్వెల్ చెప్పిన యభిప్రాయము నించుక యాక్షేపించుచు, తక్కిన భాషల సమప్రాధాన్యమును గూర్చి నొక్కి చెప్పదలచినవాడైనను, తెనుగు మొదలగు భాషలలోనుండి గ్రహింపదగిన ప్రాచీనభాషాలక్షణములను గూర్చిన ప్రత్యేకనిదర్శనములను దువను జూపకయే విడిచిపెట్టవలసినవాడైనాడు. కారణము బహుశః అది యంత సులభమైనపని కాకపోవుటయే యైయుండును. ఈవిషయమునుగూర్చి శ్రీలక్ష్మణరావుగారే యావ్యాసమున దెలిపియున్నారు. పిదప గ్రియర్సన్ పండితుడు తలపెట్టిన విషయమునే తాము నిర్వహింపబూనుకొని తమిళాంధ్రములలో తమిళముకంటె తెనుగే ప్రాచీనభాషాలక్షణములను మనకు సువ్యక్తముచేయగలదని చూపదలచినప్పుడు వారీ భాషలలోని పదములను నిదర్శనముగా గ్రహించుటలో బాగుగ నాలోచించి చేసినట్లగపడదు. ఆలోచింపకపోవుటయు గాదు. ఒకవిధమగు భ్రమకు లోనై యుండురు. దానికి గారణ మప్పటికి మనవారికి సంస్కృత ప్రాకృతభాషాలక్షణములు, సంప్రదాయములు దెలిసినట్లుగా ద్రావిడభాషాసంప్రదాయములు బాగుగా తెలియకపోవుట యైయుండవచ్చును. అవి యప్పటికంటె విశేషముగా బరిశీలింపబడలేదు. ఇప్పుడుమాత్రము తెలిసి రూఢిజెందినవని చెప్పవచ్చునా యను ప్రశ్న రావచ్చును గాని, ఏదో కొంతపరిశ్రమ జరుగుచున్నదనిమాత్రము చెప్పకతప్పదు.

తమిళముకంటె తెలుగుయొక్క పురాతనత్వమును జూపుటకు నిదర్శనముగా గ్రహించిన శబ్దములలో, తెనుగునందలివాని రూపములు సంయుక్తాక్షరయుతము లగుటచే నవి వాని పురాతనత్వమును సూచించు ననియు, తమిళరూపములు విడిపోయిన సంయుక్తత్వము గలవిగావున నర్వాచీనములై యుండు ననియు దెలిపిరి. అట్లనుటకు గారణ మేమనగా సంయుక్తాక్షరములు గల శబ్దములు మొదటివిగ నుండు ననియు, తరువాత నందుండి వికృతిశబ్దములు పుట్టునప్పుడు ఉచ్చారణసౌకర్యార్థమై సంయుక్తాక్షరములు విడదీయబడునవుటయు దెల్లమే యగుట. ఇందుల కింకను నిదర్శనము వలయునన్న ప్రాకృతవ్యాకరణములను జూడవలయునని వారి వాదము. ఈవాదమంతయు యుక్తియుక్తముగనే యున్నట్లగపడును గాని వాస్తవస్థితిని దెలుపుచున్నదా యనిమాత్రము పరిశీలింపవలసియున్నది. సామాన్యముగాను, అందు ప్రధానముగ ద్రావిడభాషలలోను, ప్రాకృతభాషలలోనుగూడ సంయుక్తాక్షరములతో గూడిన సంస్కృతాద్యన్యభాషాపదములు స్వీకరింపబడునప్పుడు వానియందలి సంయుక్తాక్షరములు విడదీయబడి నడుమ నేదోయొక అచ్చు చేర్పబడుచుండు నాచార ముండిన నుండవచ్చును గాని, యీపద్ధతి, ఆచారము నింతప్రబలముగా తమిళ కన్నడాదిద్రావిడభాషలలోను, ప్రాకృతములలోనుమాత్రమే కనబడుచుండుటకు గల కారణ మేమి యని మనము విచారింపవలసియున్నది. సంస్కృతభాషలలోను, ఆంగ్లము మొదలగు భాషలలోను సంయుక్తాక్షరములతో గూడిన పదము లనేకము లున్నవి. కాని యాభాషలలో నవి యుచ్చారణ సౌకర్యార్థమై, ఆభాషను వ్యవహరించు జనులచే, నాసంయుక్తాక్షరములు విడదీయబడి పలికినట్లుగాని, ఆభాషలో నట్టి శబ్దములకు ద్వైరూప్యము కలిగినట్లుగాని కనబడదు. కాని ఆపదములు ద్రావిడభాషలను వ్యవహరించు జనులచే నుచ్చరింపబడినప్పుడు అందలి సంయుక్తాక్షరములు తప్పక విడదీయబడినవే పలుకబడుచున్నవి. ఒకవేళ విడదీయబడి నడుమ అచ్చు చేర్పబడనిచో, నా సంయుక్తాక్షరములోని యొక వర్ణము రెండవదానితో సావర్ణ్యమును బొంది, అది ద్విత్వాక్షరముగా నేర్పడుచున్నది. తమిళాంధ్ర కర్ణాటకాదిభాషలలో నేనిఘంటువును తెఱచిచూచినను పెక్కుపదము లిట్టివి మనకు వెంటనే గోచరింపగలవు.

| సం. శ్రీ. | తె. సిరి. | త. తిరు. |
|---|---|---|
| అగ్ని | తె. అగ్గి | అగిని |
| ఉద్యోగ | | ఉత్తియోగం |
| యుక్తి | జుత్తి | ఉత్తి |
| ఋక్ష | రిక్క | |

బ్రాహ్మణ   బమ్మ   పిరమిన
శుక్ర   చుక్క
Hospital తె. ఆసుపత్రి

సంస్కృతాదిభాషాశబ్దము లీ ద్రావిడభాషలలో బొందిన మార్పులను బట్టి చూడగా నందలి భిన్నాక్షరసంయోగము నుచ్చరించుట కలవాటుపడనివా రాపదముల నుచ్చరింపవలసివచ్చినపుడు స్వోచ్చారణసంప్రదాయముల కనుగుణముగా జేసికొనిన మార్పులకు లోనైనవిగా కనబడుచున్నవే కాని కేవల ముచ్చారణసౌలభ్యముకొరకు మాత్రమే యేర్పడిన ట్లగపడదు. ఏలయనగా సంయుక్తాక్షరములతో గూడిన సంస్కృతశబ్దములు తద్భవములై దక్షిణదేశభాషలలో నెద్దాన ప్రవేశించినను ఒక్కరీతినే యాయక్షరముల సంయుక్తత్వము విశ్లేషతను బొందుచున్నది. తెనుగున తత్సమరూపమున ప్రవేశించినవానిలో మార్పు లేకున్నను, తద్భవరూపము లన్నిటిలోను తమిళము నందువలెనే సంయుక్తవర్ణత్వము సహింపబడుటలేదు. దీనినిబట్టి పదములందు సంయుక్తవర్ణాసహిష్ణుత్వము ద్రావిడభాషాముఖ్యలక్షణములలో నొకటిగా గ్రహింపవలసియున్నది. పదములయందు అనునాసికలతో తప్ప నితరవర్ణములకు సంయుక్తత్వము సహింపకుండుట, మహాప్రాణములను వ్యవహరింపలేకుండుట, రెండు మూడుపదములను మించిన దీర్ఘసమాసములు లేకుండుట మొదలగునవి యీ భాషలకు సహజలక్షణములు. ఇట్టి యుచ్చారణసంప్రదాయముల కలవాటుపడినవారు గనుకనే తొలుత సంస్కృతభాషతో వీరికి సంసర్గము గలిగి యాపదములను వీరు వ్యవహరింపవలసివచ్చినపుడు అందలి సంయుక్తాక్షరములను విడదీసిపలికియు, మహాప్రాణముల నల్పప్రాణములను జేసియు నాయాపదములను తమ భాషలోనికి దెచ్చికొనిరి. ఇది ఈ భాషలకు సహజసంప్రదాయసిద్ధ మగుటచేతనే కాని, కేవల తాత్కాలికసౌకర్యముమాత్రమే కారణముగా జరిగిన పనికాదు. అట్లైయైనచో సంస్కృతము వ్యవహరించువారిలో గూడ నిట్టిమార్పుకలిగి, సంస్కృతభాషలోనే యాయా పదములకు ద్వైరూప్యము సిద్ధించియుండునుగదా.

ఇక సంస్కృతజన్యము లనదగిన ప్రాకృతములలో నట్టిమార్పు కలిగియుండలేదా అను ప్రశ్న కలదు. ప్రాకృతభాషలలో నట్టిమార్పు కలుగుటకు ప్రధానకారణ మా సంస్కృతభాష నతి ప్రాచీనకాలమున నవలంబించి వ్యవహరింపవలసిన యార్యజనసంఘమునందలి క్రిందితరగతివా రగు సామాన్యప్రాకృతజనులలో నీద్రావిడులో, లేదా ఈ ద్రావిడభాషాసంప్రదాయముల కలవడినవారో విశేషముగా నుండియుండుటయే యని చెప్పవలసియున్నది. హిందూదేశపు వాయవ్యదిగ్భాగమున నిలిచియున్న బ్రాహూయిభాషనుబట్టియు, మధ్యపరగణాలలో నిప్పటికిని వ్యవహరింపబడుచున్న గోండు, కుయి, రాజమహల్ మొదలగు భాషలనుబట్టియు, నింక ననేక కారణములనుబట్టియు నొకకాలమున నుత్తరహిందూదేశమునగూడ ద్రావిడభాషలను వ్యవహరించు జనులు నివసించియుండురని యూహింపకతప్పదు. ఈద్రావిడ భాషాసంప్రదాయముల కలవడిన యుత్తరహిందూస్థానమునందలి ప్రాకృతజనుల మూలముననే - అనగా వీ రాదేశమున వ్యాప్తిలోనున్న యార్యభాషను స్వీయోచ్చారణసంప్రదాయానుసారముగా వ్యవహరించుటచేసియే హిందూదేశమునందలి ప్రాచీనార్యుల వైదికభాష కాలక్రమమున ప్రాకృతభాషగా మారిపోయియుండును. కావుననే దక్షిణదేశమున నెలవుకొనిన ద్రావిడభాషల సంప్రదాయములు కొన్ని యుత్తరహిందూస్థానమునందలి ప్రాకృతభాషలలోను, విశేషముగా దత్ప్రాకృతభవములగు నాధునికార్యభాషలలోను గానవచ్చుచుండుట. అట్టి లక్షణములలో సంయుక్తాక్షరములను విడదీసికాని, లేదా సావర్ణ్యమును బొందించికాని పలుకుట యనున దొకటి. కావుననే యీలక్షణము దక్షిణమందలి ద్రావిడభాషలకును, ఉత్తరదేశమునందలి ప్రాకృతాద్యార్యభాషలకును సమానమైన దగుట తటస్థించినది.

ఇదియే ద్రావిడభాషలకు సహజలక్షణమైనచో తెలుగు కన్నడమలయాళములలో ననేకపదములలో సంయుక్తవర్ణములు కనబడుచున్నవే యను ప్రశ్న కలదు. దీనికి ప్రధానకారణ మాభాషలపై సంస్కృతభాషకు గలిగిన ప్రబలప్రభావమే. అదిట్లైనను సంస్కృతసమశబ్దములలో గానవచ్చునే కాని దేశ్యశబ్దములలో విశేషముగ గానరాదు. సంస్కృతసమ మీభాషలలో గలిపి

నట్లుగా దమిళ భాషలో గలిసియుండలేదు. ద్రావిడ భాషాసంప్రదాయానుసారముగా వర్ణసంస్కారమును బొందని సంస్కృతశబ్దమునకు తమిళ భాషలో ప్రవేశమే లేకపోయినది. కావుననే యా భాషలో తక్కిన తెలుగు కన్నడములందువలె ననునాసికలతో దప్ప భిన్నవర్ణసంయోగముతో గూడిన శబ్దములే కనబడవు.

ఇట్టిది ద్రావిడభాషాసహజమగు సంప్రదాయమే యయినట్లయినచో, తెలుగునమాత్రము అందులో పదాదిని సంయుక్తవర్ణముతో గూడిన యిన్ని పదము లెట్లు వచ్చిన వన్న ప్రశ్న నిలిచియున్నది. దీనిని గురించి మఱియొక విశేషము గమనింపదగియున్నది. తెనుగున పదాదిని సంయుక్తాక్షరము గల పదములలో ననేకములు—బహుళః సర్వమును గూడ—రేఫసంయోగముతో గూడినవే కాని మఱియొకటి కాదు. ద్రావిడ భాషాసంప్రదాయమును బట్టి పదమధ్యమునసైన ద్విత్వరూపాక్షరసంయోగ మొప్పనుగాని పదాది నదియు రాగూడదు; రాదు. అట్టి సందర్భములో తెనుగున సైతము పదాదియందు రేఫసంయోగము వచ్చుట వింతగా కనబడకమానదు. ఇట్టిపదము లితరద్రావిడ భాషలలో నెచ్చటను గనరావు. కావున నాంధ్రమున నిది యొక వికృతలక్షణ మనకతప్పదు. ఇది సంస్కృతభాషాసంసర్గబలముచే వచ్చినదై యుండిన నుండవచ్చును. ఈ భాషలో ప్రత్యేకముగ వెలసినదని చెప్పినను జెప్పవచ్చును. ఇది యితరద్రావిడభాషలలో నెచ్చటను గానరాకుండుటచేతను, విదేశీయ భాషలనుండి సంగ్రహించిన, సంగ్రహింపబడుచున్న పదములలో నిప్పటికి నీ భాషలన్నిటిలోగూడ నట్టి సంయుక్తత్వము తొలగింపబడుచునే యుండుటచేతను ఇది తెనుగునకు మాత్రమే యొకకాలమున గలిగిన విశేషలక్షణ మనియు, సామాన్య ద్రావిడభాషాసంప్రదాయసిద్ధము కాదనియు జెప్పవలసివచ్చుచున్నది.

తెలుగులోని యీవిశేషరూపములు 'వర్ణప్లుతి' యను స్వరసూత్రము(Phonetic principle)ననుసరించి యేర్పడినవై యున్నవి. దీనినే Metathesis అని ఆధునికశబ్దశాస్త్రప్రవేత్తలు చెప్పుదురు. వర్ణప్లుతి యనగా నొకపదమునందలి సమీపాక్షరములలోని యొకవర్ణము తన స్థానమునుండి యెగిరిపోయి ప్రక్క వర్ణముపై నిలుచుట. 'విరల్' శబ్దములోని రేఫము తనకు సన్నిహితమునందున్న 'వి' అనుదానిలోని ఇకార వ్యవధానమును తప్పించుకొని వకారముపై నెగిరిపడగా వ్ + ఇ + ర్ + అ + ల్ > వ్ + ర్ + ఇ + అ + ల్ = వ్రిఅల్ - వ్రేల్ - వ్రేలు అని వకారరేఫసంయోగము ప్రాప్తించి తరువాత నున్న ఇకార అకారసంయోగముచే ఏత్వసిద్ధి కలిగి వ్రేల్ > వ్రేలు రూపము సిద్ధించుచున్నది. ఇది యథాస్థితియొక్క వర్ణనము మాత్రమే. భాషలో నిట్టిమార్పు లనేకస్థలముల గలుగుటను జూచి, అది యా భాష కొక ప్రత్యేకలక్షణముగా గ్రహించి, యిట్టివి యితరభాషలలో నెచ్చటనైన నున్నచో వానికి గల కారణముల నారసి భాషాతత్త్వవేత్తలు కొన్ని సామాన్యస్వరసూత్రముల General Phonetic laws) నేర్పాటుచేయుదురు. ఈవర్ణప్లుతి యనునదియు నట్టివానిలో నొకటి. ఇట్టిది గలుగుటకు మూలకారణ మేమి యని విచారించినచో ఒకపదములోని వర్ణముల నుచ్చరించుటలో గలుగు త్వరయే యయియుండునని చెప్పవలసియుండును. ఆ త్వరితోచ్చారణమునుబట్టి వర్ణములు తారుమారగుచుండును. ఇట్లొక రేఫమేకాక ఒక పదమందలి యక్షరములే మాఱుచుండుటయు గలదు. అప్పు డాపదములకు ఒక్క భాషలోనే ద్వైరూప్యము సిద్ధించును. చూడుడు :

అరల్ - అలర్ - అలరు = పువ్వు. cf. క. అరల్ - to expand, to open.

గులివి - గువిలి

ఎలల్ - ఎరల్ cf. తె. తెమ్మెరలు. కన్న. తెంబెలర్

అగప - అబక

చమురు - చరుము

పాడగము - పాగడము

పిచ్చిలు - చిప్పిలు cf. తమి. పిచిర్ - to drizzle

దబ్బ - బద్ద cf. తమి. తప్పై = Split bamboo

కుతకుత - తుకతుక

పొక్కిలి - క. పొక్కుళ్; త. కొప్పుళ్

పిగిలు - క. పిళిసు. cf. త. పిళ్ = to ne rent

సం. ఆత్మశబ్దమునుండి(ఆత్పమూలముగా)అత్తశబ్ద మేర్పడుటకు గారణ మీ వర్ణప్లుతియే యని పిషెల్ పండితుని యభిప్రాయము. 'వారాణసీ' శబ్దమునుండి వర్ణప్లుతిచేత 'వాణారసి' యను రూపము గలుగుట చేతనే ఇంగ్లీషులో 'బెనారస్' (Benares) అను శబ్ద మేర్పడినది. ఇట్టి వనేకములు కలవు.

దీనినిబట్టి యుచ్చారణమందలి త్వరనుబట్టి పలుకునప్పు డొక పదమునందలి వర్ణములు తడబడుచుండును, లేదా తారుమా రగుచుండును అని తెలియుచున్న దిగదా. ఈ కారణముచేతనే తెలుగుభాష మూల ద్రావిడభాషనుండి విడివడి ప్రత్యేకభాషగా నేర్పడిన పిదప నెప్పుడో కొంతకాలమునకు ద్వితీయాక్షరము రేఫగా గలిగిన మూలభాషాపదముల యుచ్చారణమున గొంతమార్పు గలిగి యందలి రేఫము తొలివర్ణము నొద్దికి దూకివచ్చి దానితో గలియుటచే బదాదియందు రేఫసంయుక్త వర్ణములు గలుగుట తటస్థించినది. పదాది యందలి రేఫసంయుక్తవర్ణముతో గూడిన రూపమే ప్రాచీనము. ఉచ్చారణసౌకర్యమునకై నడుమ నచ్చుచేరుటచేతనే తక్కినరూపము లేర్పడిన వన రాదా యన్నచో, పదాదియందు సంయుక్తాక్షరము గలుగుట యీ భాషలకు సహజలక్షణము కాదనియు, పదాదియందే కాక పదమధ్యమందైనను ద్విత్వాక్షరములు తక్క స్పర్శవర్ణములకు పరస్పరసంయోగము పొసగదనియు నిదివరకే సూచించియున్నాము. ఇదియే సహజలక్షణ మని చెప్పగలుగుట యెట్లన్నచో నీభాషలలోని పదజాలముయొక్క వైఖరిని పరిశీలింపు డనియే చెప్పవలసియుండును. ఇతర ద్రావిడభాషలలోనే కాదు, తెనుగునందలి కోశములను బరిశీలించినను దేశ్యపదములలో నీ రేఫసంయోగముతక్క సంయుక్తాక్షర మాదియందుగల శబ్దము లేమియు గానరావు. ఇంతేకాక సజాతీయములగు భాషలన్నిటిలో నీశబ్దములు సంయుక్తవర్ణ రహితములై కనబడుచుండగా నొక్క తెనుగుననే యిట్లుండుటనుబట్టి యిది యీ భాషకు విలక్షణ మని తలపవలసినదేకాని యొక్క భాషలోమాత్రమే కనబడు విశేషలక్షణమును సజాతీయభాషల కన్నిటికి సహజలక్షణమనికాని, యది దాని ప్రాచీనతకు చిహ్నమనికాని గ్రహించుట యెంతమాత్రమును యుక్తము కాదు. ఈ భాషలలోని శబ్దములు సామాన్యముగా రెండుమూడక్షరములకు మించినవిగా నుండవు. సంస్కృతమందువలె దీర్ఘసమాసములు లేవు. భావభేదములను సూచించుటకుగా నొక ధాతువునకు, లేదా శబ్దమునకు మఱియొక ధాతువును, లేదా శబ్దమును జేర్చుటయే వీని సంప్రదాయము. అనగా 'శబ్దపల్లవము'లను కల్పించుటయే యీభాషలకు సహజలక్షణముగాని దీర్ఘసమాసములను గూర్చుట కాదు.

'కొను' ధాతుసహాయమువలన ఎత్తికొను, మార్కొను, మూర్కొను, చేకొను మొదలైన వెన్నో కలవు. అట్లే పడు-తలపడు, నిలబడు, విడివడు, ఒపబడు మొ. ఎంచు-వీసరెంచు, తోతెంచు, అరుదెంచు, కడతేరు, తీతెంచు మొ. ఆడు-మాటాడు, వేటాడు, కొట్లాడు, పోలసాడు, తిరుగాడు, చెరలాడు మొ. ఇట్టి వనేకములు.

ఇటీవలి భాషలో సంయుక్తాక్షరములతో గూడిన పదములు కొన్ని కానవచ్చినను, అవి సామాన్యముగా ఉచ్చారణవేగమునుబట్టి కలిగిన యల్లోపముచే నేర్పడిన యర్వాచీనరూపములు. ఉదా: కలికి-కల్కి, ములికి-ముల్కి, కోరిక-కోర్కి, చెలువు - చెల్వు, గెల్వు, కల్వ, కుదురుచు-కుదుర్చు, అమర్చు, కూర్చు, చేర్చు మొ. తెగను-తగ్గు (తగ్గ), మాఱుమాట-మార్మాట, నీరువాయి-నీర్వాయి మొ.

పదాదియందు రేఫసంయుక్తాక్షరము గలిగిన పదము లిట్టి యల్లోపముచే నేర్పడినవి కావు. కాని యవి ద్వితీయాక్షరము రేఫగా నున్న ప్రాచీన పదములలో గలిగిన రేఫప్లుతివలన నేర్పడిన యర్వాచీన రూపములనుటకు సందేహము లేదు. ఇది తెనుగునందే విశేషముగా గానవచ్చుటచే నిది దీని కొక విశేషలక్షణ మనవలసి వచ్చినది. ఇది యొకకాలమున భాషలో బయలుదేరినను ఇది సామాన్యముగా ద్రావిడభాషాసంప్రదాయమునకు విరుద్ధమగుటచేతనేకాబోలు నిటీవల నిది యీభాషలో గూడ నిలువక మరల మార్పునొందుట తటస్థించినది. కావుననే పదాదిరేఫసంయోగ మీభాషలో నిటీవలికాల

మున సంతరించినది. ఆపదములలోని రేఫము లోపించి రెండవ వర్ణమాత్రమే నిలుచుట తటస్థించినది. అనగా మరం-మ్రానై, మరల మానైనది. విరల్-వ్రేలై, మరల వేలైనది. ఇట్లే భాషలోని పదాద్యక్షరము లోని రేఫము లోపించుటచే నాపదము లన్నిటికిని ద్వైరూప్య మిప్పుడు సిద్ధించినది. పదాదియందు సంయుక్తాక్షరము నిలుచుట యీ ద్రావిడభాషా సంప్రదాయ మేమాత్రమును కాదని చెప్పదగియుండుట చేతను, అందుకు నిదర్శనముగా వేయితర భాషలో గాని, యీ తెలుగులోనే కాని మఱి రేఫపదములలోను ఆదిని సంయుక్తాక్షరము కనబడకపోవుటచేతను కొన్ని తెనుగుపదముల చెంతకు చేరిన యీ రేఫసంయోగము మధ్యకాలమున నెప్పుడో వచ్చి, సహజసంప్రదాయ సిద్ధము కాకపోవుటచే మరల సంతరించినదని తలప వలసినదేకాని యది యీ తెనుగుపదముల పురాతనత్వమునకు చిహ్నముగా గ్రహింపగూడదు. ఆ పదముల పరిణామక్రమము నించుక పరిశీలింతము:

| త | మ | క | తు | తె | ధాతువు |
|---|---|---|---|---|---|
| మరమ్ | మరమ్ | మర | | మ్రాను | మాను | మర ? |
| విరల్ | విరల్ | బెరల్ | బెరల్ | వ్రేలు | వేలు | విరు = to expand |
| పొటుదు | పొల్దు | పొత్తు | | ప్రొద్దు | పొద్దు | పొల్ = to shine, shoot |
| తిరుప్పు | తిరుప్పు | తిరువు | | త్రిప్పు | తిప్పు | తిర్ = to turn |
| పరుత్తి | పరుత్తి | పత్తి | | ప్రత్తి | పత్తి | పర = to spread |
| పొటిల్ | | పొటల్ | | ప్రోలు | ప్రోలు-వోలు | — |
| పరమ్పు<br>పమ్పు | పదరు | పబ్బు<br>పర్వు | | ప్రబ్బు<br>పంబు<br>పర్వు | పంబు | పరె = to spread, extend etc. |
| ముఱంగు | ముఱఙ్గు | మొఱగు | | మ్రోగు<br>మ్రోయు<br>మొరయు<br>మొరగు | మోగు | ముఱ |
| కురుడక్ | కురుడన్ | కురుడ | కురుడ | గ్రుడ్డి | గుడ్డి | — |
| కురుంగు | | కుల్గు<br>కుసుగు<br>కుగ్గు<br>కుంగు | | క్రుంగు | కుంగు | కురు = to bend, shrink |
| కొఴు<br>కొఴుప్పు | కొఴు<br>కొఴుప్పు | కొబ్బు<br>కొర్వు<br>కొబ్బు | | క్రొవ్వు<br>కొవ్వు | కొవ్వు | కొఴు = To grow fat |
| | కఴుగఱ | కర = an imitative word for some harsh grating sounds | | క్రంగు | కంగు | (ధ్వని విశేషము) |
| కరై | కరక్కు | కరంగు, కరగు = to be dissolved, to melt | | క్రాగు = తపనము | కాగు | కర = to melt |
| కురువు | | కురువు = grating scraping | | క్రుప్పు | కుప్పు | కురు = to grate scrape |

వికృతి యెప్పుడును శబ్దోచ్చారణమును సులభము చేయునేకాని కఠినపఱచదను సిద్ధాంతము చాలవఱకు సమంజసమైనదే. ఆ సిద్ధాంతమునుబట్టి 'వ్రాన్' నుండి 'వరన్', 'వ్రేల్' నుండి 'విరల్' పుట్టినవనుట యుక్తియుక్తముగనే కనబడునుగాని, వాస్తవస్థితిని తెలుసుకొనుట కొకప్పుడింకను లోతుగా బరిశీలింపవలసివచ్చుచుండును. అనగా నాయాపదములయొక్క పూర్వచరిత్రము, వాని నిర్మాణక్రమము, మూలధాతుస్వరూపము మొదలగువానిని గ్రహించి తత్పరిణామక్రమము నన్వేషించినగాని యిదమిత్థమని నిర్ణయింప వీలుండదు. వీనికితోడుగా నాయాభాషల సహజలక్షణములనుగూడ గమనించి పరిశీలింపవలసియుండును. పదాదియందు సంయుక్తాక్షరము పలుకుట ఈ భాషలలో స్వభావవిరుద్ధము, కష్టతరము నైనను పొఴుదు, పుఴోలు, ముఴంగు, కొఴుప్పు మొదలగు శబ్దములు ద్రుతతరోచ్చారణముతో వ్యవహరింపబడినపుడు ఆ త్వరలో నచ్చులు లోపించుట, లేక వర్ణములు తారుమారగుట మొదలగు మార్పులు జరుగుటచే ప్రొద్దు, ప్రోలు, మ్రోగు, క్రొవ్వు మొదలగురూపము లేర్పడినవి. అట్లేర్పడినపుడు పదాది సంయుక్తవర్ణోచ్చారణమునందలి కాఠిన్యము పాటింపబడదు. కాని యీ భాషను వ్యవహరించువారి కది పరిపాటిలోనిది కాకపోవుటచేతనే కాబోలు కాలక్రమమున రేఫము మరల జాఱవిడువబడుట తటస్థించినది.

మఱియొక విశేషము : పైశబ్దములందు కొన్నిటిలో ద్రావిడభాషలలో వింతయక్కర మనబడు 'ఴ'కార మొకటి కనబడుచున్నది. ఇది తమిళకన్నడ మలయాళములలో ప్రధానముగ మూలధాతువులందు గానవచ్చుచున్నది. కన్నడమున ౧౩-వ శతాబ్దినుండియు, తెనుగున ౧౦, ౧౧-వ శతాబ్దిప్రాంతమునను నంతరించినను, నన్నయకు బూర్వపు శాసనములలో ననేకశబ్దములందు పొడసూపుచునేయున్నది. కావున నితరద్రావిడ భాషలతోపాటు ప్రాచీనకాలమున తెనుగునగూడ నీవర్ణము వ్యవహారములో నున్న దనకతప్పదు. ప్రాచీన భాషలో నీ 'ఴ'కారము రెండవయక్షరముగా గూడిన శబ్దములలో నిది రేఫముగ మాఱి వర్ణవ్యత్యయముచే పదాదిసంయోగమునకు కారణమైనది. ప్రొద్దు, ప్రోలు, మ్రోగు, క్రొవ్వు మొదలగు తెలుగుశబ్దములే మూలద్రావిడభాషారూపములైనచో, నందలి తొలిసంయుక్తాక్షరము విడదీయబడినపుడు పొఴుదు, పుఴోలు, ముఴగు - మొఴగు, కొఴుప్పు మొదలగు రూపము లేర్పడునేకాని వీనిలోని రకారస్థానమున నెప్పుడో తరువాతికాలమున 'ఴ' కారము వచ్చినదనుట సమంజసముకాదు. ఒక్క తెలుగులో తక్క తక్కిన ద్రావిడభాషలలో-ముఖ్యముగా తమిళ కన్నడ మలయాళములలో పొఴు, పుఴోల్, ముఴి కుఴి మొదలగునవి మూలరూపములుగా గనబడుచున్నవి. వీనిపైని దు, అగు మొదలగు ప్రత్యయములనో, పదములనో చేర్చినగాని పై రూపము లేర్పడుటలేదు. ఈ కారణములచే తమిళ కన్నడరూపములకంటె తెనుగు రూపములు ప్రాచీనములని కాని, మూలభాషకు సన్నిహితములనికాని చెప్పుటకు వీలులేదు. ప్రాకృతభాషలలోని యీ సంప్రదాయములు సంస్కృతమునుండి వచ్చినవికాక, ద్రావిడభాషాసంపర్కముచే వచ్చినవియే కావున నీవిచారణలో వాని సామ్యము ప్రయోజనకారి కాదు.

ప్రాయిల్లు, క్రీగాలు మొదలగు సమాసపదములలోగూడ ప్రా, క్రీ రూపములు ప్రాచీనము లనుటకు వీలు లేదు. వీని తమిళ కన్నడ రూపములు పఴ, కీఴ్ (పఴయిల్ కీఴ్ క్కాల్) అనునవి ద్రావిడ వింతయక్కరమగు 'ఴ' కారముతో గూడియున్నవి. ఈ 'ఴ' కారము సామాన్యముగా 'డ' కారముగా తెలుగులో మాఱుచున్నది. పఴం = పండు, కీఴ్ = కీడు. ఈ దృష్టిచేతనే వెనుక నిచ్చిన పట్టికలో 'కొఴుప్పు' అనుదానిని 'కొడుప్పు' అనియు, 'పొఴుదు' అనుదానిని 'పొడుదు' అనియు శ్రీలక్ష్మణరావుగారు వ్రాసియుండిరి. ప్రొద్దుపొడిచిన దన్నప్పుడు, 'పొడుచు' లోని డకారముకూడ 'పొఴుదు'లోని, లేదా 'పొఴు' లోని 'ఴ' కారమునకు సంబంధించినదే. 'అప్పుడు' లోని 'డు' వర్ణముకూడ 'అ + పొఴుదు' = 'అప్పొఴుదు' లోని 'ఴ' కారమునకు సంబంధించినదే. కొన్ని శబ్దములలోని 'ఴ' కారము తరువాతికాలమున రేఫముగగూడ మాఱియున్నను రేఫము 'ఴ' కారముగ

మారినదని చెప్పుటకు తెనుగుభాషలోని యీరూపములు తక్క తక్కిన భాషలనుండి నిదర్శనము లగపడవు. కొన్ని సంస్కృతశబ్దములు కన్నడమునజేరినప్పు డాశబ్దములలోని ట, స, త, రకారములకు బదులుగా కన్నడమున 'ఱ' కారము వచ్చినట్లే (అట్లు వచ్చినదని కేశిరాజు శబ్దమణిదర్పణమున చెప్పియున్నాడు) తెలుగునందలి యీపదాద్యక్షరమందలి రేఫము తమిళకన్నడాదులలో 'ఱ' కారముగా మారియుండకూడదా యను వాదము యుక్తియుక్తముగా గనబడినను సమంజసము కాదు. దేశ్యశబ్దములలోను, అందును పెక్కు భాషలలోను 'ఱ' కారముతో గూడిన శబ్దము కనబడినపు డదియే దాని ప్రాచీనరూపముగా గ్రహించుట న్యాయ్యముగాని, యొక భాషలో గొన్ని రూపములలో మాత్రమే కనబడు రకార, డకార, శకారాముల స్థానమున నీ 'ఱ' కార మిటీవల వెలసిన దనుట యుక్తముగా లేదు. శకటరేఫమునుగూర్చిన వీరి వాదమే దీని కుపబలకము.

ఈ ఱ కారముతో డిదే యీ ద్రావిడ భాషలకు ప్రత్యేకవర్ణమని చెప్పదగిన శకటరేఫ మనునది మఱియొకటి కలదు. దీనికి పూర్వకాలమున స్వతంత్రోచ్చారణ ముండి, యది క్రమముగ నశించి రేఫయొక్క యుచ్చారణమును, దీని యుచ్చారణమును సమములగుటచే బూర్వము బండిరాగ బలుకబడిన శబ్దములు క్రమముగ రేఫయుతముగ బలుకబడ దొడగెననియు, వాకారణముచే బండి 'ఱ' యుక్త రూపములే పురాతనములుగ నిశ్చయింపవలయునని యు వారు చెప్పియున్నారు. తెనుగున రేఫ శకటరేఫముల భేద మంతగా నిటీవల పాటింపబడక పోయినను, అప్పకవి మొదలగు లాక్షణికులు రేఫ శకటరేఫములతో గూడిన పదముల పట్టికను తయారు చేసి వాని భేదమును నిలువబెట్టియే యున్నారు. యతిప్రాసములలో వీని భేదమును బాటింపనివారిని లాక్షణికకవులుగా గ్రహింపక తూలనాడినారు. అట్లయినను యతిప్రాసములలో సంకరము గలిగినప్పు డట్టి వానికి ద్వైరూప్యమును సాధించి సరిపెట్టుకొనినారు. ఈరీతిగా తెనుగుపదములలోని రేఫశకటరేఫములను నిర్ణయించుటకు నిష్కృష్టమైన సాధనము లేదు. వాని నితరద్రావిడభాషాపదములతో బోల్చిచూచుటయే కొంతవరకైన నిశ్చయించుటకు సాధనము కాగలదు. అట్టి సందర్భములలో గూడ తెనుగురూపములలో శకటరేఫము కనబడినంతమాత్రమున వానిని ఇతర భాషారూపములకంటె పురాతనములుగా గ్రహింపవలె నని వాదించుచు, తెనుగులో నన్నయకుబూర్వ కాలముననే యంతరించిన 'ఱ'కార మితరభాషాపదములలోను, మూలధాతువులలోనుగూడ గనబడినపుడు, ఆపదములనే ప్రాచీనములుగా గ్రహింపక, తత్స్థానమున వచ్చిన రేఫయుక్తపదములనే ప్రాచీనములుగా గ్రహింపవలె ననుట యెట్లు పొసగును? ఇచ్చట నుచ్చారణసౌకర్య మను స్వరసంప్రదాయమునకు ప్రాధాన్యమిచ్చితిమని వారు వాదింపవచ్చునుగాని, యది యితర సంప్రదాయవిరుద్ధము కాకుండినచే సమంజసము కాగలదు. కాని అట్లు గానిచో గ్రాహ్య మెట్లగును? ఇక శకటరేఫమువిషయమునగూడ తెనుగుననే యనేక పదములకు ద్వైరూప్యము గలుగుటచేతను ఇతర భాషారూపములతో బోల్చి నిర్ణయింపవలసియుండునే కాని, యీ భాషారూపములనుబట్టి యేది రేఫమో, యేది శకటరేఫమో నిర్ణయింప వీలులేదు. పెక్కు భాషలలో శకటరేఫ మున్నప్పుడుగాని, లేదా యితర కారణములనుబట్టి యది శకటరేఫమని నిర్ణయింపదగినపుడుగాని యారూపము ఏభాషలోనున్నను ప్రాచీనమే యగును. మేర యను నర్థముగల 'వఱకు' అనునది వీరు గ్రహించినవానిలో తొలిపదము. దీని విషయముననే యీదిక్కు విశేషముగా గనబడుచున్నది. దీనికి ద్వైరూప్యము కలదని లక్ష్మీనారాయణీయనిఘంటువు ఆంధ్రపదపారిజాతమునుబట్టి తెలుపుచున్నది. కావున నిది మొదట సందేహమునకు గారణము. ఈసందేహమును దీర్చికొనుట కితరభాషారూపములను బరిశీలించినచో, తమిళమందలి వరై, వరైప్పు, వరమ్బు లనువానిలోను, కన్నడమందలి వరె, బరె, వరెగం (=Limit, boundary, upto, until, as far as) అను పదములలోనుగూడ రేఫమే కానవచ్చుచున్నది. ఇంతేకాక కన్నడనిఘంటుకారుడగు కిటెల్ వరె—వరెగం అను పదమును దేశ్యముగాగూడ గ్రహింపలేదు; తద్భవ శబ్దముల

క్రింద జేర్చినాడు. ఇంతేకాక దీనికి "నీళ్లు వచ్చుట కేర్పరచిన కాలువ, లేక పొలములోని కట్టవ" అనునర్థముగల 'వరప' అను శబ్దముతో సంబంధము కల్పించినాడు. ఇట్టి సందర్భములో తెనుగునందే ద్వైరూప్యము గలిగి యితర భాషలతో పొందిక లేకయున్న యీ 'వఱదు' అను శకటరేఫయుక్తరూపము గ్రహించి యిదియే మూలరూప మనికాని, దీనివలన నా భాషయొక్క పురాతనత్వము ద్యోతక మగునని కాని యెట్లు చెప్పనగును? మఱియొకదానిని గ్రహించి చూతము: 'తేఱు' అనుదాని కఱవమున రేఫయుక్తరూపమున్నట్లు చెప్పినారు. కాని ఆ భాషలో 'తేఱు' (To be clarified, to become clear as water) అని శకటరేఫయుక్తరూపము కలదు. కన్నడమున మాత్రము 'తేరు' (To reach as the end) అని రేఫమే కనబడుచున్నది. తెనుగునగూడ తేటపడు అను నర్థమున 'తేరు' రూపము కలదని ఆంధ్రపదపారిజాతము సూచించుచున్నది. ఇప్పుడు నిర్ణయ మెట్లు? 'వఱదు' శబ్దమువలెనే ద్వైరూప్యమునుబట్టి త్రోసిపుచ్చుటా అని విచారింపగా, పైని దీని కర్థముగా జెప్పబడిన 'తేటపడు' అను శబ్దమే ఇందలిది శకటరేఫ మని మనకు సూచించుచున్న దనవచ్చును. 'తేట' అనునది 'తేఱు' అనుదానినుండి యేర్పడిన నామవాచకరూపమే. శకటరేఫము ద్విత్వమై యుచ్చరింపబడినపుడు 'ట్ర' అనుదానివలె పలుకబడుట ద్రావిడభాషాసంప్రదాయములలో నొకటి. తమిళ మలయాళముల నామవాచకరూపము 'తేఱ్ఱ' అనునదే. ఇది యుచ్చారణలో 'తేట్ర' యై తుదకు 'తేట' యైనది. ఈ రూపమే తెనుగునందే కాక కన్నడమునగూడ 'తేట' అని నిలిచియున్నది. కావున శకటరేఫముతో గూడినదే యీ శబ్దమని మనము నిర్ణయింపవచ్చును. కాని దీని ప్రాచీనత తెలుగు రూపమునుబట్టిమాత్రమే నిర్ణయింపనగునా? శకటరేఫము టవర్ణముగా బరిణామమందిన రూపము లీ భాషలలో ననేకములు గలవు. cf. చిఱు-చిట్టి, చిటి; మాఱు-మాట; కఱచు-కాటు; మిఱ్ఱు - మిట్ట, మెట్ట; నఱుకు-నాటు; నిఱు-నిట్టుపవాసము; గీఱు-గీటు; కుఱు కుట్టి, కుట్టుసురు; ఊఱు-(తె. నీరూరు. తె. ఊఱు - ఊఱ్ఱు - ఊట్టు?) ఊట మొ. 'ఎఱుపు' శబ్దమువిషయము సందేహమే. తమిళకన్నడముల రెంటను రేఫమే కనబడుచున్నది. తెనుగులోవలె నా భాషలలో నుచ్చారణభేదము సంపూర్ణముగా రూపుమాసిపోలేదని తద్భాషావేత్తలు చెప్పుదురు. కన్నడమున ఎర అనగా ఎఱ్ఱనిరంగు (dark red colour) అనియే కాక తమిళమున 'ఎరువై' అనగా రక్తము, రాగి (blood, copper) అను నర్థములు కలవు. దీనినిబట్టి రక్తము, రాగి అనువానినిబట్టి వానికి గల రంగు అను నర్థము వచ్చినదేమో యనియు దలపవచ్చును. మొత్తముమీద తెలుగులోని 'ఎఱుపు' శబ్దము అఱవమునందలిదానికంటె శకటరేఫమునుబట్టి పురాతనమని మాత్రము చెప్పుట కవకాశ మేమాత్రమును లేదు. తేఱుశబ్దమునకును ద్వైరూప్యము కలదని తెలుగులాక్షణికుల మతము. నిర్ణయించుటకు వేఱుసాధనములు లేవు.

ఇక రెప్ప, రెక్క, రేయి మొదలగు తెలుగు శబ్దముల పురాతనత్వమును సాధించుటకుగా తమిళ భాషాసంప్రదాయము సహాయముగా గైకొనబడినది. ఈ ద్రావిడభాషలలో పదాదియందు సంయుక్తాక్షరము రానట్లే పదాదియందు రేఫ ళకార లకారములుకూడ రావు. తమిళకన్నడములలో నట్టిశబ్దము లేవియు లేవు. సంస్కృతాద్యన్యభాషలనుండి యట్టిపదము లీభాషలలో ప్రవేశించినచో వాని మొదట అ, ఇ, ఉలలో నేదో యొక వర్ణము చేర్చబడును. రాజన్ అనుశబ్దము తమిళమున 'అరశన్' అయినది. రామ-ఇరామన్, లోకం-ఉలగం మొ. ఈపద్ధతినిబట్టి విచారించగా, అనగా సంస్కృతాద్యన్యభాషాపదము లీ భాషలలో బొందు మార్పుల ననుసరించి చూడగా రకారముతో ప్రారంభింపబడిన రూపము మొదటి దనియు, అచ్చు చేర్చబడిన రూపము తరువాతది యనియు తెలియవచ్చుచున్న దన్నమాట నిజమే. అట్లగుటకు కారణ మేమనగా రకారాదిశబ్దముల నుచ్చరించుట ప్రాచీన ద్రావిడజనులకు నలవాటు లేకుండుటయే. కావుననే యట్టిపదము లా భాషలలో లేకుండుటయే సంభవించినది. అట్టి పదము లితరభాషలలోనివి వారు వ్యవహరింపవలసి వచ్చినపుడు ఉచ్చారణసౌకర్యమునకై అకారేకారోకారములను ముందు జేర్చికొని యుచ్చరించెడివారు.

ఇది తమిళమునమాత్రము నిలిచినది. తక్కిన భాషలలోను, తెనుగున నంతరించినది. రథము > అరదము మొదలగు వానినిబట్టి తెనుగున నొకప్పుడీసంప్రదాయ ముండె నన వచ్చును. స్కూలు అను నింగ్లీషుపదమునందలి తొలి సంయుక్తాక్షరమును పలుకలేక, యుచ్చారణ సౌకర్యమునకుగా 'ఇ' కారమును జేర్చి పలుకుట తెలుగునను గలదుగదా! స్కూలు – ఇస్కూలు; తమి. స్టేషన్ – ఇస్టేషన్. ఇట్లు అన్యభాషాపదముల విషయమున గలిగిన సంప్రదాయము దేశీయపదములపట్లగూడ నన్వయింపగూడదు. అట్లు చేసిన నాసంప్రదాయమే తారుమారగుట తటస్థించును. వీలయిన దేశీయపదములలో రకారాదులే యుండవుగదా! అయితే పదాదిని రేఫము పలుకుట ద్రావిడులకు అలవాటు లేకపోవుటచేతనే యట్టిపదము లీ భాషలలోనే లేవని చెప్పబడినచో తెలుగులో రెప్ప, రెక్క మొదలగుపదము లెట్లు వచ్చినవి అను ప్రశ్న బయలుదేరకమానదు. దీనికిని జనకటి క్రారతో గూడిన శబ్దముల విషయమందు వలెనే ద్వితీయాక్షరము రేఫగా గలిగిన శబ్దములలోని రేఫ వర్ణప్లుతియే ముఖ్యకారణము. ఇందువలననే తెనుగున పదాదిని రేఫసంయుక్తవర్ణము గలిగినట్లే, రేఫలకారములతో గూడిన శబ్దములుగూడ బయలుదేరినవి. ఇఱక్కై > ఎఱక్కై > ఎఱక > ఱెక్క; ఇరవు — ఇరా > రేయి; ఉరల్ > ఒరల్ > రోల్ > రోలు; ఇరట్టి (ఇరండు) రెట్టి — రెట్టింపు మొదలగునవి. తెనుగు కన్నడ కోశములలో జూచినచో నిట్లు రకారాదులగు దేశీయపదములు పది పదునైదుకంటె నెక్కుడుగా కనబడవు. కొన్నిటికి మూలరూపములు తెలియకపోయినను, అవియన్నియు నజాదిపదములలో ద్వితీయస్థానమందున్న రేఫవర్ణముయొక్క ప్లుతిచే నేర్పడిన వనియే చెప్పవచ్చును. లకారాదిపదములు పట్టివే కైయుండు ననుటకు సందేహము లేదు. మిగిలినపదములనేకము లున్నను అవి సంస్కృతాద్యన్యభాషలనుండి వీనిలో సంక్రమించినవై యుండునే కాని దేశీయములు కావు.

శ్రీ లక్ష్మణరావుగారీ రేఫాదిపదముల విషయమున నీవాదము నెఱుగనివారు కారు. కావుననే 'ఇరప్పై' మొదలగు రూపములే మొదటి వనియు, వానిలోని మొదటియచ్చులు కప్పగంతులువేసి రకారమందలి యచ్చులో గలిసి రెప్ప మొదలైన రూపములు సిద్ధించెనని తలచు లాక్షణికులు గలరనియు చెప్పుచు, నది స్వభావవిరుద్ధమైనదని వారి తాత్పర్యమగుటచే, దానిని త్రోసివేసి రేఫాంత తెలుగుశబ్దముల పురాతనత్వమును సాధింపగడగిరి. అచ్చు పూర్వమందుగల రేఫ ముచ్చారణకు సులభమని, దానిని రేఫాదిగా మార్చుట కఠినమగుటచే నస్వాభావికమని వారిమతము. నిజమే కావచ్చును గాని, వర్ణోచ్చారణమందలి సౌలభ్యాసౌలభ్యములు ఆయా భాషలను మాటలాడు జనుల యుచ్చారణసంప్రదాయములు, నలవాటులను బట్టి యుండును. ఇతరభాషాసంసర్గముచే నివి యొక్కొక్కప్పుడు మారినను మారవచ్చును గాని సహజసంప్రదాయములు కొన్ని యుండుననుటకు సందేహము లేదు. ఒక దేశమునందలివారికి, లేదా ఒక భాష మాటలాడువారికి కఠినముగా దోచిన యుచ్చారణము మఱియొక భాష మాటాడువారికి సులభముగనే కనబడి వారికి పరిపాటి యగు సంప్రదాయ మగుటయు దటస్థింపవచ్చును. వీని నన్నిటిని గమనించికాని యేనిర్ణయమునకును రాలేము. సంస్కృతమునందు సహజములగు మహాప్రాణాక్షరములు ద్రావిడభాషలలో లేవు. ఆ వర్ణములతో గూడిన పదములు ఎరువు తెచ్చుకొన్నప్పుడుగూడ నామహాప్రాణములను దొలగించి వాని స్థానమున నల్పప్రాణములను జేర్చుకొనియే వీరు గ్రహింతురు. అనగా సంస్కృతభాషావ్యవహర్తలు సులభముగా నుచ్చరింప నలవాటుపడిన మహాప్రాణములను ద్రావిడభాషలను వ్యవహరించు జను లుచ్చరింపలేకపోయి రనుట. కాని యిందలి శకటరేఫ 'ఱ' కారము లను వింతయక్షరము లితరులకు కష్టతరముగా గనబడును. హిందూస్థానీభాషలకు సహజమగు కంఠ్యకకారోచ్చారణ మితరభాషలవారికి కష్టతరమగునుగదా. సంస్కృతమందలి 'గౌః' మొదలగు శబ్దములలోని 'గ' కారము గ్రీకుభాషలో సన్నిహిత సంబంధమేమాత్రమును లేని 'బ' కారముగా మారినది. సం. గౌః – గ్రీకు. 'బౌస్' (bous). కావున నుచ్చారణ సౌలభ్యముకొఱకుగా గలుగు మార్పులవిషయమైన సామాన్యసూత్రములు కొన్ని సహజములు, సదికములు గనే కనబడినను, ఆయా భాషలలో ప్రత్యేకసంప్ర

దాయము లెట్టివో యను విషయమునుగూడ తత్తద్భాషాలక్షణపరిశీలనముమూలముగా తెలిసికొనవిది వానిని సర్వత్ర అన్వయింపగూడదు. 'ఇరవు' నుండి 'రేయి' పుట్టినదనుట స్వభావవిరుద్ధమని వారి తాత్పర్యముగా చెప్పుటయేకాక 'ఇరాత్రి' నుండి సంస్కృతమందలి 'రాత్రి' పుట్టిన దనరాదా యనికూడ లక్ష్మణరావుగారు ప్రశ్నించుటచేతనే ఇంత విపులముగా నీ విషయమును జర్చింపవలసివచ్చినది. 'రాత్రి' శబ్దము సంస్కృతమనుట ప్రసిద్ధము. రేఫాదిశబ్దముల నుచ్చరింపలేకపోవుట ప్రాచీన ద్రావిడ సంప్రదాయసిద్ధము. కావున 'రాత్రి' శబ్దమును వీరుచ్చరింపవలసినపుడు దాని కొక అచ్చును ముందు చేర్చి 'ఇరాత్రి' ని జేసియుందురు. కాని 'రేయి' శబ్దము అన్యభాషాపదము కాదే. వీరి భాషోచ్చారణసంప్రదాయములనుబట్టి వీరి భాషలో రేఫము పదాదిని రాకూడదుగదా. తెలుగుభాషకూడ అఱవముతోపాటు ద్రావిడ కుటుంబమునకే చెందినదని చెప్పుచు నీ భాషలోమాత్రము దేశీయమగు 'రేయి' అను రేఫాదిశబ్దము కలదనియు, ఇదియే మూలభాషకు సన్నిహితమని, అరవమునందలి 'ఇరవు' అనుదానికంటె పురాతనమని, సజాతీయమగు తెలుగుభాషలోని 'రేయి' అనుదానిని పలుకలేక సౌలభ్యముకొఱకు అరవమున 'ఇ' కారము చేర్చబడినదని, దీని మూలముగనే అరవముకంటె తెనుగుయొక్క పురాతనత్వము సాధిత మగుచున్నదని వాదించుట యెట్లు? కావున వారిచ్చిన రేఫాదులగు తెనుగురూపములు పురాతనములు కావు; అరవరూపము లాధునికములు కావు. అయితే వస్తుస్థితి యేమి, వీని పౌర్వాపర్యమునకు నిర్ణాయక మెద్ది అని అడుగవచ్చును. ద్రావిడసంప్రదాయమునుబట్టి రేఫాదిశబ్దములు ప్రాచీనభాషలో నుండవుగదా. కావున దేశ్యశబ్దములు రేఫాదులు తెనుగునను ఉండకూడదు. ఇప్పుడగపడుచున్న శబ్దములన్నియో అవి యిటీవలికాలమున నేర్పడియుండవలయును. తమిళ కన్నడశబ్దములతో వీనిని బోల్చి యివి యీభాషలలో నెట్లేర్పడియుండునో, వీని మూలధాతువు లేవో పరిశీలించినచో తెలియనగు వాని పరిణామక్రమమునుబట్టి మనము వీని పౌర్వాపర్యమును నిర్ణయింపవలసియుండును. 'రేయి'శబ్దము సంస్కృత'రాత్రి' శబ్దభవ మన్నచో దీనినుండి తమిళమందలి 'ఇరాత్తిరి'గాని, 'ఇరవు'గాని వచ్చెననుట కర్థ్యంతరము లేదు. కాని ఇది దేశీయపదమే యన్నచో దీనిని తమిళమునందలి 'ఇరా'శబ్దముతోను, ఈరెంటిని తమిళ కన్నడాంధ్ర తుళుభాషలు నాలుగింటిలోను గానవచ్చు ఇరుళ్, ఇరులు, ఇర్లు మొదలగు రూపములతోను బోల్చి చూడవలసియున్నది. వీనికిగల చీకటి-అంధకారము అను నర్థమునుబట్టి 'ఇరవు' అను శబ్దముతో సంబంధముకల్పించినచో ఇరా,ఇరవు అనువాని ప్రాచీనత్వము, ఇరా > రే > రేయి అను తెనుగుశబ్దముయొక్క నిష్పత్తిక్రమము తెలియనగును. ఇరుళ్ అను పద మీనాలుగుభాషలలోగూడ గనబడుచుండుటచే నిదియే మూలభాషకు సంబంధించిన దనవలసియున్నది. దీనికి సంబంధించియే ఇరా, ఇరావు, ఇరవు అనునవి యేర్పడియుండుననుట సంభావ్యము. 'ఇరా' నుండి తెలుగులో 'రేయి' తరువాతికాలమున నేర్పడియుండును. ఈ వర్ణప్లుతి యనునది తక్కినభాషలలోకంటె తెనుగున నేదోయొకకాలమున ప్రబలమైయున్నట్లగపడుచున్నదని యిదివరకే గ్రహించితిమిగదా.

ఇట్లే తెనుగున రేఫాదిశబ్దముల యర్వాచీనత్వము ఈభాషలలో గనబడు సజాతీయ మూలశబ్దములు, లేదా ధాతువులనుండి వాని పరిణామక్రమము నన్వేషించినచో వ్యక్తము కాగలదు. ఉరల్ > ఒరల్ > రోలు అయినది గాని 'రోలు' ఉరోలు-ఉరలు కాలేదు. cf. త. ఉరల్; మల. ఉరల్; కన్న. ఒరళు; తుళు. ఒరల్. ఇట్లిది యీనాలుగు భాషలలోను సమానరూపము గలదై యున్నది. ఒక్క తెలుగులోనే 'రోలు' అయినది. దీనికి మూలధాతువు త. ఉరుళ్; క.మ-ఉరుళ్. తెనుగునగూడ ధాతువు ఉరలు-ఉర్లు అనునదే. ఇది తిరుగు,భ్రమించు(=to roll, tumble over and over, revolve)అను నర్థముల గలదు. ఉలూఖల మన్న యర్థమున తెనుగున 'ఱోలు' అని శకటరేఫరూపముకూడ నేర్పడినది. కాని యితర భాషలలో దేనిలోను శకటరేఫము లేకుండుటచేతను, మూలధాతువు రేఫసహితమే యగుటచేతను 'ఱోలు' అను రూప మపభ్రంశ మనవలయును. తెలుగులో శకటరేఫముతో నీ 'ఱోలు' శబ్ద మగపడుచున్నది గనుక

ఇదియే పురాతనరూప మని, తక్కిన నాలుగుభాష లలో రేఫయుక్తములై యున్న వర్వాచీనములని వాదించిన నెంత యాభాసికముగా నుండునో విచారింపుడు.

త. ఇఱక్కై < ఎక్క. తమిళమునందలి 'ఇఱక్కై' అననది తెనుగు 'ఎక్క' అనుదాని నుండి యేర్పడిన యర్వాచీనరూపమని తమిళనిఘంటు చూపుచున్నది. అనగా 'ఎక్క' అను తెనుగు పదము తమిళమున నిటీవల సంక్రమించిన దనట. మూలభాషనుండి యేర్పడినవికాక ఒకభాషలోని పదములు మఱియొకభాషలో నాయాకాలముల సంక్రమించుచుండుటయు గలదు. కాని తమిళమునందలి దీని ప్రాచీనరూపము 'ఇఱగు' అనునది. త. ఇఱకు; మ. ఇఱహు; క. ఎఱకె. తెనుగునగూడ 'ఎఱక' శబ్ద మున్నది. తెనుగున తక్కినభాషలతోపాటు తొలి కాలమున నేర్పడియున్న 'ఎఱక' శబ్దమునుండియే తరువాతికాలమున వర్ణలోపముచే 'ఎక్క' శబ్ద మేర్పడినది. ఇదే మరల 'ఇఱక్కై' అని తమిళములోనికి బోయినది. ఈ సందర్భములో తెలుగు 'ఎక్క' తమిళ 'ఇఱక్కై' అయినదని, తెలుగురూపము తమిళముదానికంటె ప్రాచీనమని చెప్పిన చెప్పవచ్చునుగాని దీనినిబట్టి తెనుగుభాష యొక్క పురాతనత్వముమాత్రము సాధితము కానేరదు. ఈ 'ఎఱక' అను శబ్దము త. 'ఇఱంగు', తె. క. ఎఱగు, మ. 'ఇఱఙ్ఙు'అను ధాతువునుండి యేర్పడియుండును. దీనికి క్రిందికిదిగుట (to descend, get down, to alight) అని యర్థము. 'ఎఱక'లు పక్షులు దిగుట కుపయోగించునవిగావున నాధాతువునుండి యీశబ్దము వచ్చియుండునని తలపవలెను. 'ఎఱగు' - వ్రాలు, నమస్కరించు (prostrate) అను నర్థములను గలిగినది.

తెనుగునందలి మఱికొన్ని రేఫాదిశబ్దములు, వాని ప్రాచీనరూపములు:—

తె. రెండు, త. ఇరణ్డు, క. ఎరడు, తు. రడ్డు- ధాతువు-ఇర్, ఇరు. cf. తె. ఇరువురు, ఇరుగడ, ఇర్నూరు < ఇన్నూరు మొ.

తె. రాయు; త. arai; క. అరె. ధాతువు - అరె, అరై (to grind, pulverise) cf. తె.రాయి, అరుగు, అరుగదీయు.

తె. రేగు, రేచు. రేపు=పైకెగురగొట్టు. cf. తె. ఎగురు. ధాతువు - త. క. మ.-ఎల్ (to rise, stand up, go up etc) cf. తె. ఎత్తు, ఎక్కు, ఎగయు మొ. క. ఎల్తర, ఎచ్చు మొ.

తె. రేవు-ధాతువు-ఇఱ్, క్రిందికిదిగుట, ఇఱ్ < డిగు < దిగు, cf. త. ఇఱంగు.

తె. రుబ్బు; త. మ. ఉరై, ఉరి (to grind) క. ఉర్దు (to rub on) < ఒ-రుద్దు. క. ఒరెగల్; త. ఉరైగల్; తె. ఒరగల్లు-ఒరపిడిరాయి.

రోజా, రొట్టె, రుసుము, రవీసు, రుజావు, రుమాల్ మొదలగు రేఫాదిశబ్దములు విదేశీయ భాషల నుండి ఎరువుతెచ్చుకొనినవిగాని దేశ్యములుకావు.

దీనినిబట్టి తెనుగునందలి రేఫాదిశబ్దము లాభాష లోని కెట్లు వచ్చినవో, అరవకన్నడమలయాళ తుళు రూపములకంటె వాని పురాతనత్వ మెంతవఱకు సాధింప నగునో గ్రహింపవచ్చును.

ఇక తెనుగునందలి నాలుక - నాల్క యను రూపములు శ్రీ లక్ష్మణరావుగారనినట్లుగా తమిళము నందలి 'నాక్కు'అనుదానికంటె పురాతనములు కావచ్చును. 'నాక్కు'అనుదానికి 'నా'అనికూడ మఱియొక రూపము కలదు. కాని నాలుక (tongue) అనునర్థమున నిక్కడి పురాతనకాలపుటరవమున 'నాల్కు' అను రూప ముండె ననుట పొరపాటుగా గనబడు చున్నది. వారు చూపిన పొనరర్ ఆఱ్ఱుప్పడై యను గ్రంథమున గల 'నాల్కు'అను శబ్దమునకు నాలుగు (four)అని యర్థమేకాని నాలుక అనునర్థమున ఈ శబ్దము తమిళభాషలో లేదని తద్భాషావేత్తలు చెప్పు చున్నారు. అచ్యుత రథమునకు నాలుగశ్వములను బూన్చు సందర్భమున 'నాల్కు'శబ్దము ప్రయోగింప బడినది. 'నాలుక' అనునర్థమున తమిళము,మలయాళముల 'నా','నాక్కు' అను రూపములే కానవచ్చుచున్నవి, కన్నడతుళుభాషలలో 'నాలగె', 'నాలాయి'యను రూపము లగపడుచుండుటచే నీ'ల'కారముకూడ మూల శబ్దములో నుండియుండు నని యూహించుట కవ కాశము లేకపోలేదు. తెలుగున 'నాలు'అను ధాతు వంతరించిపోయినను తమిళమున 'వ్రేలాడు' (to hang,

to be suspended,) అనువర్థమున 'వాల్'-వాలు అను ధాతువు నిలిచియున్నది. దీనినుండియే 'వాలుక' వచ్చియుండును. 'నాయి' (కుక్క) శబ్దముకూడ దీనినుండియే వచ్చినదని చెప్పుదురు. దీనికి తెనుగులో వ్యవహార మంతగా లేదుగాని నన్నిచోడుడు తెనుగుకవిత్వమున దీనిని చేర్చినాడు. తమిళమునుండి తెను గెరువుతెచ్చికొనిన శబ్దములలో నిది యొకటిగా దలపవచ్చును. నాల్క శబ్దములోని లకారము కకారముతో సవిూకరణము (assimilation) నొందుటచే 'నాక్క' రూప మేర్పడియుండును. అయినను తెనుగులో నాలుకతో నాకుటయే కాని 'నాల్కుట' లేదు. 'నాకు' అను ధాతువునుండి 'నాక్క' అను నామవాచకరూప మేర్పడవచ్చును గాని 'నాల్క - నాలుక' యేర్పడిన దని చెప్పుటకు వీలులేదుగదా. కావున తెలుగులో నిలిచిన 'నాకు' అనునది యిటీవల నేర్పడిన ధాతువేకాని మూలధాతువు కాదనియు, 'నాలుక - నాల్క' యను తెలుగునందలి నామవాచకశబ్దమునకును, తమిళమునందలి 'నాక్కు' అనుదానికినికూడ 'నాలు-నాలుకు' అను నదే మూలధాతువై యుండుననియు నూహింపవలసి యున్నది. ఇట్లే మన భాషలో వైయాకరణులు సామాన్యముగా ధాతువులని చేర్కొనువట్టివి - వచ్చు, పుచ్చు, వెలుగు, తునుగు, ఎక్కు, తన్ను మొదలగునవి మూలధాతువు లని తలచుట కవకాశము లేదనియు, వీని నితరభాషలలోని ధాతురూపములతోడను, ఈ భాషలలోని యితర సన్నిహితశబ్దములతోడను పోల్చి చూచినగాని మూలధాతుస్వరూపమును నిర్ణయించుట సాధ్యము కానేరదనియు దీనినిబట్టి మనము గ్రహింపవలసియున్నది.

తెలుగున మూలార్థము నిలిచి తమిళాదులలో అర్థము మాఱిపోయిన శబ్దముల కుదాహరణముగా 'మగఁడు' అనుదానిని వారు చూపిరి. ఇట్టి వింక ననేకము లుండుననుటకు సందేహము లేదు. కార్ష్ణ్యము అను నర్థమున నల్ల, నలుపు అను శబ్దములు తెలుగున గలవు. 'నల్ల' యనగా నిప్పటి తమిళ వ్యవహారమున 'మంచిది' (good, excellent) అని యర్థము. కాని ప్రాచీన తమిళమున నలు పనునర్థము కలదట. 'నల్లం' అనగా బొగ్గు (charcoal), నల్లందనము (blackness, darkness) అనునర్థములు కలవని తమిళకోశము తెలుపుచున్నది.

వ్యాకరణరూపముల విషయమున నొక్క 'పోదుము' అను తద్ధర్మార్థకరూపమే కాక భూతకాలిక క్రియారూపములు, తుమున్నంతరూపములు మొదలగు మఱికొన్నిటి విషయమునగూడ తెలుగున నిలిచియున్న రూపములు తమిళ కన్నడాదులందలి రూపములకంటె పురాతనస్వరూపమును వహించియున్నవనియేకాక, అట్లుండుటచే మూలభాషనుండి వీని పరిణామక్రమము నన్వేషించుట కెక్కువ తోడ్పడుచున్నవనియు చెప్పుట కవకాశము కలదు. అట్టివానిని గూర్చి మఱియొకవ్యాసమున వివరించెదను.

ఈ రీతిగా నొక్క కుటుంబమునకు జెందిన భాషలలో నొక్కొక్కదానియందు కొన్ని ధాతువుల యొక్క కాని, పదముల యొక్క కాని, క్రియారూపముల యొక్క కాని మూలరూపములు కాలగతిని ఉచ్చారణభేదములవలన గలుగు పరిణామములకు లోనుగాక నిలిచియుండుట తటస్థింపవచ్చును. అట్టివి యీ తెనుగు, అఱవము మొదలుగాగల వాఙ్మయసంస్కారములతో గూడిన భాషలలోనేకాక, సంస్కారరహితములైయున్న కోదు, కుయి మొదలగు ననాగరక భాషలలోగూడ గనబడవచ్చును. కావుననే యీ కుటుంబమునకు జెందిన భాషలలోని సమానార్థకములగు నామరూపముల నన్నిటిని పోల్చి పరిశీలించి శాస్త్రసంప్రదాయానుసారముగా వాని పరిణామక్రమమును దెలిసికొనినగాని మూలభాషాస్వరూపమును గుర్తించుట కవకాశము లేదని చెప్పబడుచుండును. ఏవోకొన్ని పదముల సాదృశ్యము నెత్తిచూపినంతమాత్రముచే అఱవమునుండి తెనుగు పుట్టినదని సాధింప యత్నించిన యీకాలమునందలి యఱవపండితుల వాదమును ఖండించు నుద్దేశముతో శ్రీలక్ష్మణరావుగారీవ్యాసమును వ్రాసియుందురు. ఆ వాదమును ఖండింప యత్నించి నందులకు వీరు ప్రశంసనీయులు. కాల్డ్వెల్ పండితుడైనను తమిళమును తక్కిన భాషలకంటె బాగుగా

చెప్పినవా డగుటచే దానినుండి యుదాహరణము లెక్కువగా నిచ్చి, కొన్ని సంప్రదాయముల విషయమునను, కొన్ని రూపములవిషయములోను తమిళము మూలభాషాస్వరూపమును నిలువబెట్టుకొనియున్నది గావున నామూలభాషాలక్షణముల నన్వేషించుటలో మన కెక్కువ తోడ్పడగలదని చెప్పెనేకాని యితర భాషల సహాయ మక్కరలేకయే తమిళము మూలభాషా స్వరూపమును మనకు దెలుపుచున్నదని చెప్పియుండ లేదు. కావున అరవము తెనుగునుండి కాని, తెను గరవమునుండి కాని పుట్టినదను వాదమును చాటింప నక్కరయే లేదు. వీని పురాతనత్వమువిషయముగూడ నట్టిదే. ఒక భాషలో గొన్ని పురాతనరూపములు నిలిచి యుండవచ్చును. మఱియొక భాషలో నవి మాఱి పోయినను మఱికొన్ని నిలిచియుండవచ్చును. సజాతీయ భాషారూపముల నన్నిటిని బోల్చి పరిశీలించిన గాని వాని పరిణామక్రమము, పురాతనత్వము నిర్ణయింప వీలుకాదు. ఒక కుటుంబమునకు జెందిన సోదర భాషలన్నప్పుడు వానిలో దేనినుండి యేది పుట్టినది, ఏది పురాతనమైనది అను ప్రశ్నలకు దావులేదు. ప్రాచీన ద్రావిడభాషాస్వరూప నిర్ణయము విషయమున నివి యన్నియు సమానప్రయోజనము కలవే. ఆయాభాషా రూపముల పౌర్వాపర్యము, పరిణామక్రమము ధాతు స్వరూపనిర్ణయమునుబట్టి, మూలరూపముల నిర్ణయమును బట్టి మారవచ్చును. తెలుగున దేశ్యశబ్దముల స్వరూపము విశేషముగా మారినట్లున్నను, భాషారూపములలో ప్రాచీనత ఎక్కువగా గనబడుచున్న దనుటకు సందేహము లేదు.

---



# స్మరణ

[కథానిక]

= శ్రీ మాధవపెద్ది గోపాలకృష్ణ గోఖలే =

అదొక చిన్న వూరు. ఆవూళ్లో వున్న చింతల తోపుకు మరూన వున్న కుంటకు అవతల చిన్న చిన్న దుబ్బులు వుండివున్న ఖాళీ ప్రదేశానికి చివరగా వుంది కనకమ్మ, ఆరేళ్ల కొడుకు వెంకటాద్రీ వున్న యిల్లు.

దగ్గరగా అటూ యిటూ కొన్ని యిళ్లు వున్నా, గుబురైన చింతలతోపు కావటంలో వెన్నెలరాత్రిళ్లలోనే బెబుకుమంటుంటే, యింక చీకటి రాత్రిళ్లలో చెప్పనే అక్కర్లా. వురుగూ బుడతా అంటూ తిరుగుతూ నిమహాని కోకేక పెనుభూతావుంటై చింతచింతగా.

నల్ల పరదాపట్టాలలాగ చల్లచల్లగా మేఘాలు కమ్మి ఆరాత్రి వాన చిటపట పడ్తుంటే, కుంటఒడ్డున చేరి సంతోషంకొద్దీ గంతులేస్తూ వాలుగా వున్న ఓ బేరంకప్పను గభాల్న ఒచ్చి పట్టుకుంది ఓ గుమ్మడి మచ్చల జెర్రిపోతుపాము. కప్ప భయంతో బెకబెక అరుస్తూ కొట్టుకుంటున్నది అమ్మపక్కలో పొర్లుకున్న వెంకటాద్రిని కలతపెడ్తా.

"ఆ అరిసేదేంటే అమ్మా?"

"కప్పనేదో పాము పట్టుకున్నట్టుంది!"

చటుక్కున అమ్మను కరుచుకున్నాడు వెంకటాద్రి, భయంతో ఒణుకుతూ.

"అమ్మా, బయమే!"

"బయం దేనికిరా, ఎంకా?"

"సూడమ్మా ఎత్తా ఏడుత్తుందదో, ఆకప్ప?"

"నువు ఏడుత్తే నిన్నెవురు సూత్తారూ?"

"నువ్వేగామ్మా!"

"అమ్మ సచ్చిపోయిం దనుకో, అప్పుడూ?"

"మాఅమ్మ సచ్చిపోదేం! మాఅమ్మ మంచిదిగా?"

"మంచోళ్లే తొందరగా సచ్చిపోతారు ఎంకా! నేను మంచిదాన్ని కాను."

"నువ్వు మంచిదానివి కాకుంటే అత్తా, ఆపాము ఆకప్పను అత్తా సంపుతుంటే, నేను బయపడ్తుండేవాన్ని కాదమ్మా!"

"మనుసుల్ని మనుసులు విరిసి సంపుక మింగి తింటుంటే, పాములూ కప్పలూ ఏంలెక్కలో కొచ్చి బయపెడ్తై, ఎంకా?"

యీసారి మరీజాలుగా అరిచింది కప్ప.

"బయమే, అమ్మా!" అంటూ బావురుమన్నాడు వెంకటాద్రి.

"సంపుతా, యెదవా, బయం అన్నావంటే."

మరికొంచెం పొర్లింది వెంకటాద్రికడుపు మెరుస్తున్న ఆనీలాల కళ్లముందా.

"ఎదవ బతుకులు!" అన్నది కనకమ్మ, ఎంతో లోతునుండి.

"_ఆఁ?_" అన్నాడు వెంకటాద్రి అమ్మ మొహంకల్లి చూస్తూ ఆమాట తన కేమన్నా పనికొస్తుం దేమో అన్నట్టు.

"నీ కో సిన్న కతలాంటిది సెబుతా, యీపాలి సరిగ్గా యింటావా?"

"సెప్ - సెప్. - సెప్పమ్మ."

ఆకప్ప యింకోసారి అజాలిఅరుపు అరిచే ముందుగా అందులో కలిసి కనకమ్మ ఆ చిన్నకథను మొదలు పెట్టింది, కప్పరొద తెలియనీయకుండా.

" అదొక సిన్న వూరు, ఎంకూ! ఆవూర్లో యిద్దరు పుగాకుయాపారస్తు లుండారు. ఒకడేమో బాపనాయన. పేరు నూరయ్య. రెండో ఆయన కాపు. పేరు ఏదవుతే ఏం! మొదుట్లో యీపుగాకుయాపారం సాగించింది కాపాయిన. పుగాకును ఆడీడ సౌక దరకు కొంటూ, దరలు లెగిసినప్పుడు బత్తీలలో వుండ ప్యాక్ట్రీలకు మంచిలాబంకాడికే సరఫరా సేత్తుండే వోడు. కమేనా ఆ లాబాలతోవ మెట్టబూములు కొని సొంతగా లంకపుగాకు పండిచ్చి యీవూరిజనానికి యింకో సెబ్బరపుగాకు రానీకుండా, తన మంచిపుగాకును సరసంగా అమ్మతా, నలుగుర్లో కాత్తె పలుకుబడి సంపాదిత్తా, వాడినీ మంచోడుగనక మంచో డనిపించు కుండాడు ఆ నలుగురినేత, యాపారం వృద్ధి సేసు కుంటూ.

"అంతకుముందు అల్లాళ్లకు ఏంయవారా లుండమోగ్యా మనకవుతే బాగా తెలవదు,_ యిదంతా సూసి ఆ ఆశపాతక బాపననూరయ్యకు కల్లు కుట్టినై. ఆ తప్పుడు లెక్కలూ, ఆ బూటాకోరుప్యాంసరీ నోట్లూ, ఆ తప్పుడెవారాలేందో ఆటితో కుదటన పడకూడదూ? వుహూఁ! అట్టా కాక తనూ సాగించాడు యీయాపారం, అంతే మాగానిబూమి వుండా కడుపునిండక, పకోళ్లకొట్టో దుమ్మేసి ఆడమ్ముమడుసుల్నే యిరిగి మింగుతేగాని తన కడుపాత్రం తగ్గదన్నట్టు.కోడియదవ! ఆ ఏరుకుతింటానికి ఎంత నైపోగు సెత్తయినాసరే_"

"పక్కింతి సెంచామోళ్ల కోళ్లు నైసెత్తనే కదమ్మ తింతం?" అన్నాడు వెంకటాద్రి మధ్యగా, తనకు తెలిసిందేదో.

"నువు మద్దెన కుంటి పిల్లెలు ఎయ్యమాకు! సెంచాయికోళ్లు నైసెత్త తింటంలో గన తేం వుందీ! అది మడిసికోడి. కోడి కుండాల్సిన లచ్చనాలు అంతకు ఎక్కువగా యింకెవుర్లోనూ వుండవ్ _ ఆసికితప్ప!" అని చీత్కరించింది కనకమ్మ ఆ లోపలవుండే మంట బయటపెడ్తూ.

"వుఁ!"

"వూఁ ఏముందీ! కమేనా నూరయ్య సాగించాడు పుగాకుయాపారం! ఆళ్లకేం, అత్తిపరులు. ఎంత యిట్టం లేకున్నా నలుగురూ ఆయినకు కాలం ఎయ్యకతప్పదు అవసరాన్ని బట్టి.బత్తీలల్లోనైనా ఆకోడి కూతలే కూసి పని సాగించుకున్నాడు ఎంత దగా యాపారానికన్నా పాలుబడ్డా. పుగాకుకరజా ఎక్కువగా వుంటంవల్ల సరిపోయిందిగాని, బజార్న పడి బలానోడి యాపారం యింతని దగుల్బాజీయవారాలు నడిపిత్తుంటే, పదికూతల్లో ఓకూతన్నా నమ్మరూ, యినే జనం? ఎందుకు నమ్మరూ? కాపాయిన ఎంత మంచోడనుకుండారో అట్టాగే అంత పెద్దోడనుకుంటానికి ఏం నాయం అక్కర్లేకపోయినా సాలామటుకు సబబుగా వుంటుందిగాని, పుగాకుకరజా ఎక్కువగా వుంటంవల్ల యిద్దరికీ పోటీతో పనిలేకుండా వుంటానికి యీ లంటూండగా, సెరిగొద్ది నాలుగుడబ్బులు తెచ్చుకుంటూండగా, సిన్నమొన్నటాయినకు గిట్టక అవతలోడు ఎందుకు బాగుపడాలని కడిగుడ్డలు సానబడ్తుంటే, దాని కేం నాయం పాయం వుండక్కర్లా? మంచి పెద్ద ఆడ ఏం యిశారించక్కర్లా?"

"వుఁ."

"అసలు తమాశా యాడుందంటే, 'ఏం కాపాయనా, బాగుండావా?' అంటాడు బాపనాయన. 'ఏందండీ నూరయ్యగారూ, మీరూ మీ

వోరంతా బాగుండారా?' అంటాడు కాపాయిన మొంగం యింత సేసుకుని, యినయంగా. 'నీ యాపారం ఏమన్నా లాబంగా వుందంటోయ్?' అంటాడు మారయ్య. 'మరేనండి. యాడదండీ, తమకు తెలవకుండా!' అంటాడు కాపాయిన గోల్లు గిల్లుకుంటా. 'యి కూల దరలు పెరిగినయ్యంట, ప్యాక్ట్రీకి బత్తాలు ఎత్తుదాం వేంటీ?' అంటాడు మారయ్య. 'పిత్తం. మీరు పట్టబట్తే నాకుమటుకు నట్టం తగల్దంటండీ?' అంటాడు కాపాయిన, యీ యవారం తన పెల్లానికి ఎంత యిట్టం లేందీ తెలవకుండా.

"ఓ రోజున కాపాయిన పెల్లాంతో అన్నాడు-'మన లంకపుగాకు మెరకబూమి రెట్టింపు దరకాడికి మారయ్యగారు కొంటా నంటున్నాడు. అమ్మిదా మంటావా' అని, పెల్లానికి పెద్ద మనిపిత్తా. 'బాగే వుంది! మద్దెన నాదా ఎట్టా పెత్తనం? యాపారస్తుడివి నవ్వుగాని, అదెట్టా తగలబడ్తే నాకేం! కాపాయిన యాపారం వలుపు తిరిగిందని వలుగు రనుకుంటుంటే అనుబవించేది నేనుగాని! మంచి దర లుండ య్యని నీ సేత యాపైకాడికి అమ్మిచ్చటం ఏందీ, యవకాడ్తే తను అరసైకాడికి రాబట్టుకోటం ఏందీ! యింతకు ముంగల యాపారానికీ, యిప్పటిదానికీ యాడన్నా సంబందం వుందీ? సేతులు యిరుసుకుని సంపాయించుకున్న బంగారం లాంటి బూమిని అమ్మతానంట! నీబూమి కొని, అవుండ బత్తాలు కొని ప్యాక్ట్రీలల్లో, వూళ్లల్లో నీ పేరు ఎవరికి స్తుంటే, యింకా కొన్నిరోజులకు యీ కాపాయిన మొంగం మూడను ఎవురికి వస్తుందీ, బలాన మారయ్య అంటారుగాని! ఆడు నిన్న పాతాల్లోకానికి అనగ తొక్కుతుంటాడని వూళ్లో అ తమందీ అనుకుంటుండా నీకు తెలవకుండా పోతుండదేం? కావుదోరలకు యాపారా లెందుకోయ్ అనికాదూ నే బావికాడి కెల్లి నీలు తెత్తుంటే ఆ పెద్దమడిసి బజార్లో అంటుండెదీ? ఆయొయ్యా దారి! ఎవకటికీమల్లే బలాన యాపారస్తుడి బార్యనని యికముందు సెప్పుకు మురిసే బాగ్గం నాకు వస్తుంది గనక తెగుదునమ్మంటు సెప్పొచ్చానా!'

అని పెల్లాం బాగా మూరిపోసేతలికి మల్లీ తెప్పరిల్లుకుని కొత్తె దారిన పడ్డాడు కాపాయిన.

"ఓపాలి పరీచ్చగా మారయ్యకల్లల్లో మూదులు సుచ్చుకున్నట్టు, ఆఏడు కాపాయినవుగాకుపంట బంగారపు పంట పండింది, బారెడు బారెడు పాయలేసుకుని. ఆపంట తన కమ్మమన్నాడు మారయ్య. కట్టపడి పండించిన ఆపంటమీన తనకే యొక్కువ అబిమానం వుందన్నాడు కాపాయిన, తన పెల్లాం యింటే మురిసేటట్టు. 'నీకెంత అబిమానం వుందీ నాకుమటుకు తెలవదంట్రా? మాటసా మెరకు అవగాల్సొచ్చిందిగాని!' అని ఎల్లిపొయ్యాడు మారయ్య, పళ్లు కొరుక్కుంటూ.

"మరసనాడు కాపాయిన మెట్టబూమికాడి కెళ్లే ఏముందీ? యింకో రెండుడివాలల్లో పాకానికి రానుండ ఆటుగారపు పాయలంతా గొడ్డమంద పీలికలు పీలికలుగా తొక్కి కదిలిపరిసివుండ యావ్వ మెట్టబూమి నేలంతా.

"కళ్లెంట నీటిబొట్లు బొటబొట జారుత్తా నేలను మూన సెత్తిన నేతు లేసుకుని వలవల ఏకదారగా కాపాయిన ఏడుత్తుంటే, పక్కన వుండే సుంకోల్ల పిల్లో డొచ్చి సెప్పాడు 'మారయ్యగోరి జీతగాడు ఎంకయ్య ఆల్ల బర్రెలమందతో రేత్రి మెట్టనిబ్బలమీన సాలానేపు ఆడుకుండా'డని.

"ఆకాకమీన కాపాయిన పోయినపోటం నేరి కండిన ఓ ఒసికర్ర వూడపెరుక్కుని వూళ్లోకి లగెత్తుకుంటా ఎల్లి, అప్పుడే మారయ్యయింటోనుండి బయటికొత్తుండ ఎంకయ్యను రాత్తామీన పడేసి ఒల్లు సితగకొడ్తుంటే ఆడు పెట్టిన రొదకు నలుగురూ సేరి తన్ని పెడరెక్కలు యిరిసి పట్టుకుండేంతవరకూ తెలవలా అసలు తనేం సేసిందీ.

"యీ సమాచారమంతా కడుపుతో వుండ కాపాయిన పెల్లాం యిని ఎంకయ్య తిన్న దెబ్బలకన్న ఎంత ఎక్కువగా బాద అనుబవించిందీ ఆబగమంతుడికే తెలవాలి.

"ఆరేత్రికి కాపాయినను మునుసబు కొట్లో పెట్టి మరసనాడు బత్తీకి తీసెల్లారు యిశారనకు

గాను. 'ఏపనైనా యిశారించకుండా అంత తొందర పడి సేయకూడదు. పాపం, ఎంత అబిమానవస్తుడు! ఏం సిచ్చ యిదిస్తారో' అని అనూరయ్య ఎంతె యిశారం పన్నా పడ్డాడు, సేయవలసిన యవారమంతా పొందిగ్గా పాటున సేసుకుంటా, కాత్తై డబ్బు కరుజయినా యవారం ఎనకకు పానీకుండా.

"ఒళ్లుపగిలిన ఎంకయ్యకు యిప్పట్లో పాపు రా దని డాక్టర్లు వ్రాసీయిచ్చినాక, పదిలీగ్గా రాత్తామీన ఓ నిండుమడిసిని కూనీ సెయటానికి పెయత్నించినందు కుగాను కాపాయినకు ఏడేళ్లు కటినసిచ్చ వేశారు.

"యింక పుగాకు పెట్ట తన కేంపట్టిందీ! పూర్లో ఎవు రేం అనుకుంటుండనీ తన కేం కావాలి! ఏదో పున్నెం సేసుకుని అనూరయ్యగారు యింత తెరిపిన పడగలిగాడుగాని, తను యాపారి పెల్లాన్నని ఎంతె కొడిక్కైనా అనిపించుకోగలిగినందుకే తనకు పదివేలు అని కాపాయిన పెల్లాం మతిసెడి పలవరిత్తుంటే, ఓదా ర్చను నూరయ్యగా రొచ్చాడు.

" 'యిశారించి లాబం లేదమ్మా! ఒత్తావుంటై కట్టాలు! నే సెప్పిన మాట యినకయ్యా అంటే యిన్నాడా? యింత అలజడి వుండేదా అప్పుడు? యిప్పుడికైనా నీకు అబ్బెంతరం లేకపోతే, అబ్బాయిని నువు నాకు అమ్ముకోవచ్చు. ఎవురన్నా నూషకల్ని నోట్ల వుండాలనిగాని అంతకన్న మరేం లేదు. నవు సెమ్మనిగానే తెలియసెయ్యొచ్చునే!' అని సల్లగా తన మనుసుకు బయిటపెట్టాడు. 'అయ్యా, మీరు సేసిన వుపకారానికి ఒచ్చే జనమలో ఎటూ నేను మీ కడుపున పుట్టకతప్పదు. యిప్పటికి యీ జనముకు మమ్మల్ని యిట్టా పోనిత్తే, ముందుకు మీ అంత మంచి నూరయ్య లుండరు' అని ఏడ్చింది కాపాయిన పెల్లాం నోట బలం పోయి.

"ఆ ఏడేళ్లూ బగమంతుడిమీన బారం ఏసి ఎట్టాగైనా గడపాలనుకుంది కాపాయిన పెల్లాం, తన కడుపున పుట్టిన సిన్న కాపాయినతో.

"ఆ కాపాయినమీనుండే సెనుకు పెల్లానికి ఆశె అంటూ ఏమాత్రం వుండా, సిన్న కాపుకు నాలుగో ఏడు నిండకతలికే ఆయువ్పటకూడా తీరింది. కొట్లో పడ్డ కాపాయినకు యిశారాన్న కయవస్త తగిలి, తీసుకుంటునట్టు తెలుత్తే, మరపవాడు సైకుంట ఏకాకంగా పెల్లోణ్ణి బుజానేసుకుని వూరికి దచ్చినపు దిక్కుగా ఏడుత్తూ ఎల్లింది పెల్లాం కాపాయిన దక్కతా పడే సెరుకొద్దీ.

"ఆ మూడో రోజు రేత్రికి సిన్న కాపుతో తిరిగొచ్చేసింది కాపాయిన పెల్లాం కుంటా, సెట్లూ, దుబ్బలూ దాటుకుంటా, ఆ జీబురుమంటుండే యింటోకి.

"ఓ ఏడాదిపాటు ఏమీ తెలవని సిన్న కాపుతో ఎల్లబోసుకుంది తన సొద తా, కడాకు తన గుండె రాయికిమల్లె మారేంతవరకు. గుండె నీరవుతుండే ఆ రోజుల్లో పుట్టావు. అందుకనే నీగుండె అట్టా ఏడ్చింది ఆకప్పఅరుపు యిని. యింక ముందుముందు యీ మడుసుల అరుపులు నీగుండె ఏవిదంగా బరిస్తుందో!—"

■■ ■■ ■■

వెంకటాద్రికి ఎప్పుడు నిద్ర పట్టిందో! కప్ప అరుపు వినపడటంలా. ఎప్పటిమో స్తరు బయట సిమి కాకుండా వుండి ఆగడియకు తగ్గట్టు.





# కావ్య జగత్తు

[గత సంచిక తరువాయి]

= శ్రీ జి. వి. కృష్ణరావు =

ఇంతకూ కావ్యజగత్తుకూ, సామాజికజగత్తుకూ భేదం లేదని అభిప్రాయం కాదు. కావ్యజగత్తు ఆనంద ప్రదంగా ఉంటుంది. ఆనందప్రదం కాకపోతే అది కావ్యజగత్తు కాదు. సామాజికజగత్తు అంటేనో అలా కాదు. సుఖమో, దుఃఖమో కలుగుతుంది. ఆనంద మనేది చాలా తక్కువ. మృగ్యమనే చెప్పవచ్చునేమో. సాధారణంగా అనుభూతిమీదనే సుఖదుఃఖాలు కాని, ఆనందంకాని ఆధారపడిఉంటాయి. సామాజిక కావ్యానుభూతులు ఒకటే అయినప్పుడు వీటివల్లకలిగే వేదనలుకూడ ఒకటిగా ఉండాలికదా! అలాంటప్పుడు కావ్యానుభూతి నియతంగా ఎందుకు ఆనందప్రదంగా ఉంటున్నది, సామాజికానుభూతి ఎందువల్ల సుఖ ప్రదంగాను, దుఃఖప్రదంగాను ఉంటున్నది? దీన్ని పట్టియైనా కావ్యజగత్తు అలౌకికమని ఋజువుకావడం లేదా అని శంకించవచ్చును.

సమాజంలో సుఖం ఎలా కలుగుతున్నదో విచా రిద్దాము. ఇలా తేలిన విషయాలకు కావ్యానందం అతిక్ర మించిపోతే కావ్యజగత్తు అలౌకిక మౌతుంది. ఏసూత్రాల వల్ల లోకంలో ఆనందం కలుగుతున్నదో ఆ సూత్రాల వల్లనే కావ్యజగత్తు ఆనందం కలిగిస్తే లౌకికమౌతుంది. అయితే యీ పని చాలా కష్టసాధ్యం. పైగా కాలం కమంగా లేలేదికాదు. దీనికితోడు శ్రీనాథు డన్నట్లుగా "బహుధావిప్రతిపత్తిఁ బొందిన విషయముల్ పాడైన శాస్త్రార్థముల్." అయితే యథాశక్తిని పరిశీలిద్దాం.

"బాహ్యవస్తువుల అధీనమై వున్నదంతా దుఃఖం; మనస్సునకు స్వాధీనమై వున్నదంతా సుఖం" 30 అని మనువూ, "మనస్సుచే దుఃఖచింతన చెయ్యకపోవ టమే దుఃఖనివారణమునకౌషధ"31 మని వ్యాసుడూ చెబుతున్నారు. "విషయాలను ధ్యానించటంచేత పురుషు డికి వాటియందు ఆసక్తి కలుగుతుంది. ఆ ఆసక్తివల్ల కామం, దానివల్ల క్రోధం కలుగుతుంది. క్రోధంవల్ల మోహం, మోహంవల్ల విస్మృతి, విస్మృతివల్ల బుద్ధి నాశనము, దానివల్ల తానే నశించటం జరుగుతుంది. రాగద్వేషవిముక్తమై తనవశమైన ఇంద్రియాలవల్ల ఇంద్రియవిషయా లనుభవిస్తున్నప్పటికీ, స్వాధీనా త్ముడు నిర్మలు డౌతున్నాడు. ఇంద్రియనిగ్రహం లేని వాడికి ఆత్మవిషయకబుద్ధీ, భావనా ఉండదు. భావించ లేనివాడికి శాంతిఉండదు. శాంతిలేనప్పుడు సుఖ మేలా కలుగుతుంది?" 32 అని గీత చెబుతున్నది.

---

30. సర్వం పరవశం దుఃఖం సర్వమాత్మవశం సుఖమ్,
ఏతద్విద్యాత్సమాసేన లక్షణం సుఖదుఃఖయోః.
(మనుస్మృతి, ౪-౧౬౦)

31. భైషజ్య మేత ద్దుఃఖస్య యదేతన్నానుచింతయేత్.
(మ. భా. శాం ౨౦౫-౨)

32. గీత, రెండో అధ్యాయం, 62, 63, ౬౪, 66 శ్లోకాలు.

ఈ సిద్ధాంతం ప్రకారం మనశ్శరీరాల్లో మనస్సు ముఖ్యమైందనీ, మనస్సును స్వాధీనం చేసుకొంటే శారీరక దుఃఖాన్నీ, మానసిక దుఃఖాన్నీ లేకుండా చేసుకో వచ్చుననీ తేలుతుంది. శరీరం లేకుండా మనస్సు ఉంటుందా? మనస్సు ముఖ్యమైతే మనస్తత్వం ఎందుకు మారుతున్నది? ఈ ఆధ్యాత్మికవాదాన్ననుసరించి మనస్తత్వం మారకూడదు. కాని సైకాలజీ ఇది మారుతూవుందని నిరూపిస్తావుంది. మనోగుణమైన హాస్యాన్నుంచి బయలుదేరే హాస్యం ఎలా పరిణామం చెందుతూ వచ్చిందో గ్రైగ్ గ్రిగరీలు చక్కగా నిరూపించి చెప్పారు.[33]

మరొకవిషయ ముంది. ఆధ్యాత్మికవాదుల సిద్ధాంతం ప్రకారం హిట్లరు ప్రజలను అణచి పెట్టినట్లే మనస్సు ఇంద్రియాలను దమిస్తే మానవుడు స్వాతంత్ర్యం అనుభవిస్తాడు. భౌతికవాదులమని చెప్పుకొనే సరియలిస్టులూ, సైకోఎనలిస్టులూ ఆవశ్యకతను గుర్తించకపోవటమే స్వాతంత్ర్య మంటారు. నిజానికి, స్వాతంత్ర్యమంటే ఏంజిల్సు చెప్పినట్టుగా ఆవశ్యకతను గుర్తించటమే.[34] మనకు ఆకలి అవుతున్నదనుకోండి. ఆకల్ని అణచివేసుకోవడంవల్ల స్వాతంత్ర్యం లభించదు. ఆకలిని తృప్తిపరచవలసిన అవసరముంది. ఈ ఆవశ్యకతను గుర్తించి భోజనంచేస్తే ఆకలిబారినుండి బయటపడతాము.

ఈకారణాలవల్ల ఆధ్యాత్మికవాదులు సుఖాన్ని గూర్చి చెప్పిన విషయాలు సమంజసంగాలేవు. సైయాయిసులమతమే సత్యానికి దగ్గరగా వుంది. వీరు వేదనను శారీరకమనీ, మానసికమనీ ఒప్పుకుంటారు. దీన్ననుసరించే సమాజంలో సుఖం ఎలా కలుగుతుందో విచారిద్దాము.

ఈ సుఖాన్ని గూర్చి విచారించేటప్పుడు జ్ఞానేంద్రియాలు, అవ్యక్తం, బుద్ధి వీటిని గురించి ముఖ్యంగా విచారించాలి. జ్ఞానేంద్రియాల వ్యాపారము స్వాభావికవృత్తికి అనుకూలంగా ఉంటే సుఖం, లేకపోతే దుఃఖం. పిడుగుపడ్డ చప్పుడు చెవిని పడుతుందనుకోండి. మన చెవికి అది సుఖం కాదు. దానివల్ల ఈ ఇంద్రియం దెబ్బతింటుంది. సాధారణంగా వినటానికి వీల్లేని చిన్నచప్పుడు వినవలసివస్తుం దనుకోండి. అది చెవికి సుఖప్రదం కాదు. అయితే ఈ జ్ఞానేంద్రియాల సౌఖ్యం కొంతవరకు వాసనలమీదా, బుద్ధిమీదా ఆధారపడివుంటుంది. వాసనలు గాని, బుద్ధిగాని ప్రేరేపించటంవల్ల జ్ఞానేంద్రియాలవ్యాపారం స్వాభావిక వృత్తికి వ్యతిరేకంగా ఎక్కువకాలం సాగవలసివస్తే, ఆకాలంలో దుఃఖప్రదం కాకపోయినా తరువాత అవుతుంది.

అవ్యక్తంలో వాసనలు దాగివుంటాయి. ఈ వాసనలు ప్రతిమానవునికీ ఉంటాయి.[35] కర్మప్రవృత్తికి ఈ రతి, హాస, శోక, క్రోధ, భయ, ఉత్సాహ, జుగుప్సా, విస్మయాదులు (దానం, దయను మన ఆలంకారికులు ఉత్సాహం క్రిందికి పెట్టారు) కొంతవరకు కారణాలు. వీనివల్ల సుఖ మేలా కలుగుతుందో తరువాత చూద్దాము.

బుద్ధి అనేది జ్ఞానేంద్రియానుభూతివల్ల ఏర్పడి పరిణామం చెందుతూవుంటుంది. అందువల్లనే శిశువుల బుద్ధీ, పెద్దవాళ్ల బుద్ధీ ఒకటి కాదు. బుద్ధికి స్మృతి, భావన అనే రెండు ముఖ్యశక్తులున్నాయి. స్మృతివల్లనే భావన ఏర్పడుతుంది. స్మృతివల్ల మనసులో నిలిచిన ప్రత్యక్షాంశాల ఛాయలను ఒక ఉద్దేశంతో ప్రస్తరించటమే భావన. జ్ఞానకర్మేంద్రియాల అవశ్యకాలను కొంతవరకు గుర్తించటంవల్లనూ, బుద్ధిచే దమింపబడని వాసనల అవశ్యకాలవల్లను బుద్ధిలో ఇచ్ఛ బయలుదేరుతు—[36]. ఈ ఇచ్ఛావాప్తికోసం మానవుడు

33. "*Psychology of Laughter*" by Gregory.

34. "*Freedom is the recognition of necessity*"—Engels.

35. దీన్ని అభినవగుప్తుడు గుర్తించాడు. అందుకనే, "జాత ఏవహి జంతు రియతీభిః సంవిద్భిః పరీతో భవతి" అన్నాడు.

36. ఇచ్ఛావాప్తికీ ఫ్రాయిడ్‌వాడే wish fulfilment' కీ సంబంధం లేదు. ఇచ్ఛావాప్తి బుద్ధిప్రాధ్యకమైనది; wish fulfilment అట్టిది కాదు.

కర్మప్రవృత్తు డౌతాడు. ఇచ్ఛ[37] నెరవేరకపోతే దుఃఖం, నెరవేరితే సుఖం. అకాలత తెగకుండా, ఈ ఇచ్ఛ ఎంత కష్టసాధ్యమైతే అంత సుఖం కలుగుతుంది. బుద్ధిచే దమింపబడని వాసనల్లో అంతర్యుద్ధం ఎంత గాఢంగా బయలుదేరి తుదకు పరిష్కారం పొందితే అంత సుఖం కలుగుతుంది. కలుగుతూవున్న దుఃఖం ఆగి పోయినా సుఖమే. గీతలో చెప్పిన నిష్కామకర్మం ఇంద్రియాలకూ, వాసనలకూ హానికరం కానట్లైతే సుఖమే.

అనుకరించటం,[38] గుర్తించటం, అనుకున్నట్లు జరగటం సుఖాన్ని యిస్తాయి.

సామాజిక జగత్తులో సుఖదుఃఖాలు ఎలా కలుగుతున్నాయో విచారిస్తున్నప్పుడు స్వప్నాన్ని విడిచి పెట్టటానికి వీల్లేదు. స్వప్నంకూడ లౌకికమేనని తేల్చు కున్నాం. దైవప్రేరణకాని, అలౌకికవిషయాలు కాని స్వప్నానికి కారణాలు కావని గుర్తించాము.

జాగ్రదవస్థలోని వేదనలు స్వప్నావస్థలో మారి పోతాయి. జాగ్రదవస్థలో బోనులోని సింహాన్ని చూచినా హృదయం బేజారెత్తిపోతుంది. స్వప్నంలో భయం లేకుండా దాని జూలు పట్టుకొని ఈడుస్తాము. దాహబాధలు లేకుండా అగ్నిలో నడుస్తాము. ముఖం గోడకు కొట్టుకుని బొప్పికట్టినా బాధ ఉండదు. ఈగారడీ అంతా ఏమిటి? స్వప్నంలో ఏ కవితాప్రతిభ వేదనలను తలక్రిందులు చేస్తున్నది?

స్వప్నతత్త్వాన్ని పరిశోధించిన ఫ్రాయిడ్ దీని కీలక మేమన్నా కనుగొన్నాడేమో చూతాము.

స్వప్నంలో బుద్ధిపూర్వకంకాని[39] ఇష్టావాప్తి జరుగుతుంది. ఈ బుద్ధిపూర్వకంకాని యిష్టం అవ్యక్తం లోని అసంతుష్టవాసనలది. ఇల్లాంటి యిష్టాన్ని పురస్కరించుకొని బయలుదేరే ఆలోచనలవల్ల కలిగే వేదనలు సాధారణంగా సంతోషకరంగా ఉంటాయి. శిక్షాక స్వప్నాల్లో[40] మాత్రం అవ్యక్తంనుంచి ఇష్టావాప్తిని పురస్కరించుకొని బయలుదేరే ఆలోచనలవల్ల కలిగే వేదనలు దుఃఖకరంగా వుంటాయి. మొదటితరగతి ఆలోచనలు ఉపబుద్ధివల్ల మార్పు చెందుతాయి. సింహాలను పురస్కరించుకొని వచ్చిన స్వప్నాన్ని తీసుకొందాము. అవ్యక్తంలో బయలుదేరిన ఆలోచనల ప్రకారం ముగ్గురూ మానవులే. ఉపబుద్ధివల్ల ముగ్గురూ మూడు సింహాలయ్యారు. మానవులను చూచినప్పుడు భయపడవలసిన పని లేదు. మొదటి వేదన అలాగే ఉందికాబట్టి సింహాలను చూచినప్పుడుకూడ భయం కలుగలేదు.

ఒక్కొక్కప్పుడు ఉపబుద్ధినిషేధంలోని వేదనలు అవ్యక్తంనుంచి బయలుదేరిన వేదనలతో కలుస్తాయి. అవ్యక్తపువేదనలు సాధారణంగా సంతోషకరంగా ఉంటాయి. ఉపబుద్ధివేదనల్లో దుఃఖం లేకపోతే స్వప్నం సంతోషకరంగా వుంటుంది. మొదటి వేదనలు ఎంత సంతోషకరంగా వుంటాయో రెండో వేదనలు అంత దుఃఖకరంగా వుంటే స్వప్నం దుఃఖప్రదంగాగాని, సుఖప్రదంగాగాని ఉండదు. అలా కాక ఈ రెండు వేదనల్లో దేనిబలం ఎక్కువగా ఉంటే ఆ వేదనలు కలుగుతాయి.

శిక్షాకస్వప్నాల్లో ప్రథమవేదనలు ఉపబుద్ధినిషేధంవల్ల తలక్రిందు లౌతాయి. దుఃఖకరంగా ఉండవలసిన స్వప్నం సంతోషప్రదంగా ఉంటుంది; సంతోషప్రదంగా ఉండవలసినది దుఃఖప్రదంగా ఉంటుంది.

ఈ స్వప్నశిల్పాన్నే ధ్వనివాదులు హెచ్చరించేది. విశ్వనాథుడు ఒకధ్వనికి లక్ష్యంగా "ఓయి బాటసారీ! గ్రామమున సంస్తరము లేదు, ఉన్నత పయోధరములు చూచి నిలుతువేని నిలిచిపొమ్ము"[41] అన్నదాన్ని యిచ్చాడు.

37. గీత ఈ ఇచ్ఛను త్రుంచివేసి నిష్కామ కర్మం చెయ్యమంటుంది. ఇది మానవుడికి అనర్థదాయకం. వివేచన, అభివృద్ధి పోతాయి. జంతువుల్లై అవ్యక్తవాసనలను పట్టి పోవలసివస్తుంది. ఇలాంటిది పరాజితజాతి చెప్పుకొనే వేదాంతం.

38. అరిస్టాటల్ వ్రాసిన *Poetics*.

39. *Un.conscious*

40. ***Punishment.dreams***

41. పథిక! నాత్ర సంస్తర మస్తి మనాక్ప్రస్తరస్థలే గ్రామే,
ఉన్నతపయోధరం ప్రేక్ష్య యదివససి తద్వస.

దీన్ని చదువుకొని సనాతనులు ముసిముసినవ్వులు నవ్వుతుంటారు. ఎవరైనా చలంగారి లాగా, "ఓయి బాటసారీ, ఈ గ్రామంలో వ్యభిచార దోషం లేదు. వర్షం వచ్చేట్లుంది. పండుకోటానికి చాపకూడా దొరకదు. ఏమైన స్తనాలను చూచేవా ఉండిపో" అని వ్రాస్తే పచ్చిబూతుగా, అసభ్యంగా ఉందంటారు. నిజానికి నీతి అనే పేరుతో ముడికట్టుకొని ఆనందిస్తున్నది ఏమిటి? "ఓయీ యిచ్చట ధర్మం లేదు, అందువల్ల దయాదాక్షిణ్యాలుండవు. అయినా బ్రహ్మాండంగా మేఘాలు ఆవరించాయనుకుంటే ఉండిపో" అనేదాన్నేనా? ఎప్పటికీ కాదు. మొదటిదాన్నే. అయితే తమ హృదయాన్ని దాచుకోటానికి ఇలా చేస్తున్నారు.

పచ్చిబూతుగా కనిపించేది అవ్యక్తంలోని ఇష్టం. ఉపబుద్ధిసూత్రం నీతి పేరు పెట్టి నిషేధించటం వల్ల చాపకు సంస్తరం, స్తనాలకు పయోధరం వాడబడ్డాయి. శాస్త్రము, మేఘము కనిపించేటప్పటికి ఉపబుద్ధి ఊరుకున్నది. అవ్యక్తంలోని యిష్టం తన అభిప్రాయాన్ని మార్చుకోకుండా ఉపబుద్ధినిషేధం తప్పించుకొని వెలువడింది. ఇలా నిషేధం తప్పించుకొని రావటంలోనే స్వప్నశిల్పం, ధ్వనిశిల్పం ఉన్నాయి.42

ఇంతకూ తేలిన విషయం: స్వప్నంలో వేదనలు మారుతాయి. లౌకికంగా భయం కలగవలసిన చోట స్వప్నంలో సంతోషం, సంతోషం కలగవలసినచోట దుఃఖం కలగవచ్చును. ఇలాగే కావ్యజగత్తులోకూడ లౌకికవేదనలు ఆనందంగా పర్యవసించవచ్చును.

ఇంతవరకూ టూకీగా తేల్చుకున్న లౌకికసౌఖ్య సూత్రాలు కావ్యానందానికికూడ అన్వయిస్తున్నాయా అని చూడవలసిఉంది దీన్ని తేల్చుకోకముందు కావ్యం వల్ల ఎలా ఆనందం కలుగుతున్నదో విమర్శకులూ, ఆలంకారికులూ చర్చించి తేల్చిన విషయాలనుకూడ గమనించాలి. అప్పుడే కావ్యానందం లౌకికానంద సూత్రాలమీద ఆధారపడ్డదో లేదో తేల్చుకోవటం సులభం.

అయితే విమర్శకులూ, ఆలంకారికులూ తలా ఒకదారి త్రొక్కారు. ప్రతి దేశంలో ప్రతివిమర్శకుడూ ఈ కావ్యానందంకోసం అన్వేషించాడు. అందరి అభిప్రాయాలనూ ఇక్కడ చెప్పటానికి వీల్లేదు. అందువల్ల ముఖ్యులైనవారి మతాలనే తీసుకొంటాను.

మన దేశంలో పూర్వం వేదాంతంవలెనే43 చక్కని విమర్శలు బయలుదేరాయి. రసాన్ని గూర్చి వ్రాసినవారిలో భరతుడు, భట్టలోల్లటుడు, శంకుకుడు, భట్టనాయకుడు, అభినవగుప్తుడు ముఖ్యులు.

భరతుడు44 రసాన్ని సాహిత్యానికి అన్వయించి చెప్పలేదు; నాట్యాన్ని గురించి చెబుతూ చెప్పాడు. "విభావానుభావవ్యభిచారిసంయోగాద్రసనిష్పత్తిః" అని సూత్రించాడు. ఈ సూత్రంలోని సంయోగనిష్పత్తులను ఏ అర్థంలో వాడాడో ఎవ్వరూ చెప్పలేదు (అభినవగుప్తుడు సహితం తన మతాన్ని భరతునకంట గట్టాడు). అరిస్టాటిల్ వాడిన 'ఇమిటేషన్', 'కెథార్సిస్' అనే రెండుశబ్దాల అర్థంకోసం యూరోపియన్ విమర్శకులు ఎంత శ్రమపడ్డారో, ప్రాచీన భారతీయ ఆలంకారికులుకూడ అంత తంటాలుపడ్డారు.

(సశేషము)

---

42. ధ్వనిశిల్పాన్నంతా స్వప్నశిల్పానికి ఉదాహరణగా ఇవ్వవచ్చును. "శైవాలంబు సైకతంబు లెరువై చంద్ర ప్రవాళాంబుజ, గ్రావాకాశభుజంగ రూపములు దూరంబయ్యె." ఇలాంటి ధ్వనిలోకూడా స్వప్నశిల్పమే ఉంది. ఇది స్వప్నసంకేతీకరణానికి లక్ష్యం.

43. తాత్త్విక సిద్ధాంతాలనే మన ఆలంకారికులు సాహిత్యానికి అన్వయించారు. భట్టలోల్లటుడు మీమాంసాసిద్ధాంతాన్ని, శంకుకుడు న్యాయాన్ని, భట్టనాయకుడు సాంఖ్యాన్ని, విశ్వనాథుడు అద్వైతాన్ని, రూపగోస్వామి చైతన్యవాన్ని పురస్కరించుకొని సాహిత్యాన్ని గూర్చి చర్చించి రసస్వరూపాన్ని చెప్పారు.

44. రసవాదాన్ని లేవనెత్తినవాడు భరతుడు. అంతేకాని వేదాల్లోనే ఈ రసవాదం ఉందని 'రసో వై సః' అని పండితులు చూపి చెప్పటం సమంజసం కాదు.

# కళింగ రంగంపై

## ఆంధ్రరాష్ట్రోద్యమము - ఆంధ్రప్రబోధము

[నవంబరునెల 21, 22 తేదులలో విశాఖపట్టణమునందు జరిగిన 22-వ ఆంధ్ర మహాసభ వార్షిక సమావేశమునకు అధ్యక్షత వహించి శ్రీ సర్ విజయానంద గజపతిగారు గావించిన ప్రసంగములోని ముఖ్యభాగము.]

"ఇరువదిసంవత్సరములనుండి రాష్ట్రేతరప్రాంతములయందుండినను నే నెల్లప్పుడును ఆంధ్రుడనే. సంయుక్తరాష్ట్రములలోనివారు నన్ను సంయుక్త రాష్ట్రీయునిగా ఎంచుకొనుచున్నారు. అయినను నేను కేవలము ఆంధ్రుడనే యని వారికి ఎల్లసమయములందును తెలియపరచుచుంటిని. ఇట్టి భావప్రత్యేకవ్యక్తిత్వము మన ఆంధ్రసోదరులందరి యందుగల సహజగుణమే. నే నీయాంధ్రావనియందు జన్మించుట ఎంతయో సుకృతమని తలచుచుందును. అనేకసంవత్సరములనుండి ప్రజోపయోగకరమగు ఉద్యమములతో సంబంధము కలిగియున్నటువంటి విజయనగరకుటుంబమునకు చెందియుండుటచే నే నెంతయు ధన్యుడను. నన్నీ సభకు తమరందరు అధ్యక్షునిజేసి ఆదరించుట తమకం దగకును మా కుటుంబమునందు గల గౌరవచిహ్నమే.



అధ్యక్షులు
శ్రీ సర్ విజయానందగజపతిగారు

### భాషాప్రయుక్త ఆంధ్రరాష్ట్ర విభజన

హిందూదేశము విశాలమై అనేక భాషలను కలిగియున్నది. పరిపాలనసౌష్ఠవముకొరకుగాని, కేవలము సూత్రములను ప్రతిపాదించుటకుగాని దేశమును భిన్నభిన్నములుగా జేయుట సమంజసము గాదు. హిందూదేశ సమాఖ్య సంస్థాపనయందు రాష్ట్రములు తగినంత ప్రజాబాహుళ్యమున్నచో భాషాప్రయుక్తముగ విభజింపబడుట శ్రేయస్కరము. జాతీయ మహాసభ గాంధిగారి యాజమాన్యమున రాష్ట్రీయ సంస్థల నేర్పాటు జేసినప్పుడు ప్రత్యేక విజ్ఞాన భాషా ప్రయుక్త విభజన నంగీకరించి త్రికోట్ల ఆంధ్రదేశీయుల ప్రత్యేక రాష్ట్రీయార్హతను గమనించినటుల విదితమైనది. అమెరికా సంయుక్త రాష్ట్ర రాజ్యాంగమునందు వ్యక్తి రాష్ట్రములన్నియు వాటి వాటి ప్రత్యేకార్హతలను, నియోజక హక్కులను, స్వాతంత్ర్యములను సంరక్షించుకొనుచు అఖిలసమాఖ్య ప్రభుత్వమునకు విదేశవిషయములు, ఆర్థికము, దేశసంరక్షణ వదలి ప్రత్యేకతనుపొందియున్నవి. ఆంధ్రమహాసభ వాంఛించుచున్న ప్రత్యేకరాష్ట్రనిర్మాణము భారతభూమి స్వతంత్రప్రాప్తి నొంది భావిరాజ్యాంగవిధానము నిర్ణయించునపుడు సిద్ధించగలదని నా దృఢమైన నమ్మకము.

ప్రత్యేకరాష్ట్రము ఆంధ్రుల కున్నచో ఆంధ్ర వ్యక్తిత్వమునకు, విజ్ఞానవికాసమునకు, సంగీత చిత్రరచనాది కళాప్రకాశమునకు, సాంఘికసంస్కారోద్యమపరిపక్వమునకు, అభివృద్ధికిని అవకాశమును గల్పించును. మహాసభకు ప్రస్తుత రాజకీయ విషయములతో తోక్యము లేదు. సాంఘిక విజ్ఞానాదర్శముల నభిలషించు సంఘము. అయితే ఈ రోజులలో మన ప్రస్తుత స్థితిగతులలో విజ్ఞానాదికములకు, రాజకీయములకు గల భేదము అతి స్వల్పము-పరిగణింపదగినది కాదు.

## మన చిక్కులు

ఆంధ్రులపక్షమునుంచి అవలోకించినచో ప్రస్తుత స్థితిగతులు ధైర్యజనకములుగా లేవు. కాలము గడచిన కొలది మనకష్టము లధికము లయినవిగాని తగ్గియుండలేదు. ఉద్యోగీయుల ప్రతికూలభావము, జాతీయ సమర ప్రతిఫలములు, పాకిస్థాన్ ఉద్యమము, సన్నిహిత ప్రాంతీయుల అననుకూలత, రాయలసీమ — ఉత్తర సర్కారులకుగల పరస్పరవిభేదములు కష్టములను చిక్కులుగను చేయుచున్నవి. ఆంధ్రులు కాంగ్రెసు భక్తిపరులని బ్రిటిషువారు భీతిల్లుచున్నారు. ఇంకొక కాంగ్రెసురాష్ట్రముగాని, కాంగ్రెసు నామోదించు రాష్ట్రముగాని బ్రిటిషువారికి పనికిరాదు. మద్రాసు శాసనసభలలో జరిపిన ఆంధ్రరాష్ట్రతీర్మానానంతరము రాష్ట్రనిర్మాణారంభ బాధ్యత ఇండియా సెక్రటరీ ఆఫ్ స్టేటుపైనను, పార్లమెంటుపైనను గలదు. ముస్లింలీగు ఇంకొక హిందూరాష్ట్రము తయారగునని భయపడుచున్నది.

## ఆంధ్రరాష్ట్రము-కాంగ్రెసు

కాంగ్రెసు కార్యనిర్వాహకసభ ఆంధ్రరాష్ట్రమునుగురించి గావించిన తీర్మానము ఆశాజనకముగ లేదు. తనుపరి "యింతగా మేము నమ్మినందుకు తమరున్న మా ప్రతికక్షులలో చేరినారా" అని మనము సంశయించి ప్రశ్నించినటుల దోచుచున్నది. కాంగ్రెసునందు ఆంధ్రులకు గల భక్తిపారవశ్యతకు కార్యనిర్వాహకవర్గతీర్మానము తగు పారితోషికము గాదు. ఇట్టి తిరస్కృతి నొందినను సత్యాగ్రహోద్యమము ప్రారంభింపబడిన వెంటనే ఆంధ్రులు ఒక్కుమ్మడిగ అనుసరించి దేశాభ్యుదయమునకై కాంగ్రెసు శిక్షణకు లోబడియుండుట ఆంధ్రులకుగల జాతీయ మహాభాషాభిమానమునకు నిదర్శనము. ఆంధ్రులు ఇక ఎంతకాలము రాష్ట్రముకొరకు నిరీక్షించవలెనని కాంగ్రెసు అభిప్రాయము? పరిపాలనసౌకర్యమునకు సంబంధించిన విషయము మహాజాతీయసమస్యా పరిష్కారమువరకు ఏల వేచియుండవలెను? ఇట్టి కాలమున సమాఖ్య ప్రభుత్వ విధానము నంగీకరించి పరిపాలనసౌలభ్యముకొరకు భాషాప్రయుక్తరాష్ట్ర విభజనముకోరుట దేశీయాదర్శములకు, జాతీయోద్యమమునకు భంగకరము కాదు. ఈ సమస్యను పునర్విమర్శ చేయవలెనని మనము కాంగ్రెసు కార్యనిర్వాహకవర్గమును తిరిగి కోరవలసియున్నది. ఆంధ్రరాష్ట్ర సంపాదనసమస్యకు ప్రాముఖ్యస్థానము నివ్వవలసినదని ఆంధ్రనాయకులను ప్రార్థించుచున్నాము. ఇప్పుడైనను మరికొంతకాలమునకైనను ప్రజాప్రభుత్వ మేర్పడినప్పుడు ఆంధ్రరాష్ట్రము సిద్ధించనిచో, ఆంధ్ర మంత్రివర్గమంతయు ఒక్కుమ్మడి నిరాజీనామా ఇవ్వవలయును. నైతికనిరోధసూచకముగ భవిష్యత్ప్రభుత్వముతో ఆంధ్రులు సహాయ నిరాకరణము జరుపవలెను. మన నాయకోత్తముడు దేశీయసమస్యల నయితేనేమి, బాహ్యసమస్యల నయితేనేమి సాధించుటకు మహదాయుధమును ప్రసాదించినాడు. ఆంధ్రరాష్ట్రము వచ్చునంతవరకు ఆంధ్రమండలములనుంచి వసూలు కాబడు ద్రవ్యమంతయు ఆంధ్రదేశమునకే వ్యయపడునటుగాను ప్రత్యేక బడ్జెటు ఉండవలెనను వాదనము గలదు. ఈ సమయమున ఈ ప్రభుత్వము నిందునుగురించి మనము కోరుట ఉచితమా? ఒక పర్యాయము ఆలోచించుకొనుడు. ప్రస్తుతప్రభుత్వము ౧౯౩౫ సం. ఇండియాశాసనము యొక్క అత్యవసర చట్టములక్రింద ఏర్పరచిన శ్రీ సార్వభౌమిక ప్రభుత్వమే గాని ప్రజాసమ్మతిపై నాధారపడినది గాదు. అట్టి ప్రభుత్వమును కోరుట పాడియగునా యను విషయము తామే నిర్ణయించవలెను. తాము కోరినచో తమ అనుమతి ననుసరించి నేను సర్వవిధముల కృషి చేయగలవాడను. అయితే ప్రప్రథమమున మన మవలంబించు చర్యావిధాన పరిణామము బాగుగ గుర్తించగోరెదను.

## యుద్ధానంతరము - ఆంధ్రవిధి

శీఘ్రముగా ప్రస్తుత భయానకయుద్ధము ఈశ్వర కటాక్షమువలన అంతమొందు గాక. హిందూదేశమునకు నూతనరాజ్యాంగనిర్మాణసమయము సంప్రాప్తమగు గాక! యుద్ధవిరమణమయినను, ఆఖరైన రోజునచే రాజ్యాంగనిర్మాణము జరుగునను అపోహ మనము

పడకూడదు. గతచరిత్రనుబట్టి యోచించినయెడల యుద్ధానంతరము వెన్వెంటనే రాజ్యాంగనిర్మాణము గావింపబడునని అమెరీగారు మనకు అభయహస్త మిచ్చియున్నను రాజ్యాంగనిర్మాణమునకు పూర్వము ఎన్నియో కాన్ఫరెన్సులు కమిటీలు వగయిరా మూలముగా కాలవిలంబన మెంతయో జరుగును. ఇది ఇట్లుండగా క్రొత్త రాజకీయ ఏర్పాటులు జరుగునంతవరకు, ప్రాత ౧౯౩౫ ఇండియా ప్రభుత్వశాసనము అమలులోనే యుండును. తిరిగి ఎన్నికలు జరుగును. ప్రజాప్రభుత్వములు ఆచరణలో నుండును. ఒకప్పుడు యుద్ధమధ్య సమయమందుగూడ పరిస్థితులుమారి ప్రజాపక్షములు ప్రతిరాష్ట్రములోను అధికారము స్వీకరించుటకు అనుకూలము కావచ్చునని నా యభిప్రాయము. ఇంతకును నేను మనవి చేయునదేమనగా ఎప్పుడైనను ప్రజాప్రభుత్వ మేర్పడినయెడల—యుద్ధ మధ్యముననే గాని, లేక యుద్ధానంతరమున గాని—మనము గట్టిగా ప్రయత్నము చేయవలయును; బలముగ కృషిచేయవలయును.

## మంత్రివర్గములో చేరుటకు షరతు

అటువంటి ప్రభుత్వమేర్పడినప్పుడు మన ఆంధ్రేతర సోదరులు మనకు సహాయము చేయవలసియున్నది. ఆంధ్రులకు నిర్ణీత సమయములో, అనగా ఒకటి రెండు సంవత్సరములలోగా రాష్ట్రమివ్వనిచో వారు మంత్రివర్గ నిర్మాణమునకు సాయపడమని నిశ్చయముగ చెప్పవలెను. అట్టిషరతుతో వాగ్దానమునకై బ్రిటిషుప్రభుత్వమును కోరవలెను. ఆంధ్రులకు రాష్ట్రమిచ్చుట మంచిదని ఆంధ్రేతరులు కేవలం తీర్మానించుటచే తృప్తి కలుగదు. తమ తీర్మానము నాచరణలో పెట్టుటకు వారు సర్వవిధముల తోడ్పడవలెను. లేనిచో అట్టి తీర్మానములవలన ప్రయోజన మేమి? కేవల వాక్సహాయము నిజమగు సహకారి గాదు. ఇంతవరకును కేవలవాక్సహాయము ఏ యుద్యమమును ముందుకు సాగించలేదు. ఆంధ్రరాష్ట్రవిభజనము ప్రత్యేకషరతుగా జేసి అభిసమ్మతిగా జేసి, మంత్రివర్గనిర్మాణమునకు బూనుకొనిననేగాని మన ఆంధ్రేతర సోదరుల సత్యపరిపాలన ధ్రువపడదు. మంత్రుల అధీనములోనే ఈప్రశ్న పరిష్కారముండినచో తక్షణం యిచ్చివేసి వుండేవారమని అనవచ్చును. నిజమే, మంత్రులచేతులలో ఈ విషయము ఎంతమాత్రంలేదు కనుకనే మంత్రివర్గనిర్మాణ సమయమందు బ్రిటిషువారివద్దనుంచి ఆంధ్రరాష్ట్రమును సంపాదించుట అవసరము. అన్నిరాష్ట్రములను ప్రభుత్వభారమును వహించి పరిపాలించుచు మద్రాసు వ్యవహరించకయుండినచో పార్లమెంటు ఈవిపరీతపరిస్థితిని గమనించితీరును. ఇండియా కార్యదర్శి తన పలుకుబడిని వినియోగించును. మనరాష్ట్రము మనకు సిద్ధించును. ఈలోపల హిందూదేశమునకు స్వాతంత్ర్యమే లభించినచో పార్లమెంటులోగాని, కార్యదర్శిలోగాని ప్రసక్తియే యుండదు. మనసోదరులే మన భావిస్థితిని నిర్ణయించవలసి వుంటుంది. ఆంధ్రేతరులు మనకు సాయపడ నిచ్చగించనిచో మనదోవ మనమే చూచుకొనవలెను. అటువంటివారితో ప్రజాప్రభుత్వ నిర్మాణార్థము సహకార మొనర్చుట మన ఆత్మగౌరవమునకు లోపము. ఎంతకాలము మనము మంత్రివర్గమున చైతన్యవిహీనమయిన భాగస్థులుగా నుండగలము?

## నైతిక నిరోధము

ఒక ముఖ్యకారణము ననుసరించి సహాయ నిరాకరణము గావింతము. మన నాయకులు గాంధీగారేమి చేయుచున్నారు? సత్యాగ్రహోద్యమము నేల నడపుచున్నారు? సద్యఃఫలితముల నేమైన సంపాదింప గలిగినదా? అయితే కాంగ్రెసు దానినే అవలంబించుటేల? యింతవరకూ కాంగ్రెసు నాయకులు యేదో ఒకరీతిగా ప్రభుత్వపరిపాలన గావించలేకపోయిరా? అధికార విరామము గావించి కారాగారములకు వెళ్లుటచే మానవజాతియొక్క ప్రాథమికహక్కు సంరక్షణార్థము నైతిక నిరోధమును సూచించిరి. ఏకమత్యముగ ప్రత్యేకాంధ్ర రాష్ట్రమును కోరుట మనధర్మము. ప్రత్యేకరాష్ట్రము ఆర్థికముగ లాభదాయకము కాదని అనవచ్చును. అటులే యయినచో అది మనకర్మము. సత్ప్రభుత్వమైనప్పటికిని యెన్నటికీ స్వతంత్ర ప్రభుత్వమునకు సాటిగాదు. మన మధోగతిలో యున్నామనిన్ని, అశక్తులమనిన్ని పిరికి భావము మనలో అంతరించవలెను. గాంధీగారి ఔన్నత్యమునకు కారణము ఆయన భయమనే గుణమునకు కేవలము అపరిచితుడు. మనమందరము సమాలోచనము జేసి కార్యసాధన మగునంతవరకు విశ్రాంతి గైకొనకూడదు. మృదువచనములవలన ప్రయోజనము లేదు. తీర్మానములు గావించుట, సభలు జరుపుట వీటిచే ఉపయోగముండదు. మంత్రివర్గనిర్మాణమునకు ఏ మాత్రము సహాయమును చేయకూడదు. నైతికనిరోధనముచే ఇండియాకార్యదర్శి ఆంధ్రుల సాంఘిక, విజ్ఞాన, రాజకీయ వ్యక్తిత్వములను గమనించి, ఆంధ్రులు రాష్ట్రస్వీకారమున కర్హులని విశ్వాసము జెందునంతవరకు ఆందోళన జరుపవలెను. ముందు రానున్న

రోజులు సగములు కావు. కాని గుహామధ్యము నిబిడాంధకారబంధురమైనను గమ్యస్థానమున జగజ్జేగీయమానమయిన మార్గరశ్మికలగు.

## ఆంధ్రరాష్ట్రోద్యమము

ఆంధ్రరాష్ట్రోద్యమము పకిస్థాన్ వంటిదని చెప్పుట సాహసము. పకిస్థాన్ 'పాకిస్థానమే'. మనము కోరుచున్న ఆంధ్రరాష్ట్రము వేరు విధమైనది; పకిస్థాన్‌తో సంబంధం కలదికాదు. ఆంధ్రరాష్ట్రోద్యమము అన్ని జాతులకు వర్తించునది. అల్పసంఖ్యాకు లెవ్వరును ఆంధ్రరాష్ట్ర నిర్మాణము నభ్యంతర పెట్టలేరు. జాతీయ రాజ్యాంగవిషయములలోను, అంతర్జాతీయ రాజ్యాంగ విషయములలోను ముఖ్యసిద్ధాంతములు మూడు మాత్రమే: జాతి, మతము, భాష. రాజ్యాంగ తంత్రమున, నవీన సిద్ధాంతముల ప్రకారము మతమునకు తావు లేనేలేదు. ఆంధ్రులు ఒకేజాతికి చెందినవారు. ఆధునిక ప్రపంచమున జాతియే ముఖ్యాంశముగా ఎంచబడుచున్నది. ఒకేజాతి అనేకప్రభుత్వముల యధీనతలో వుండడముకూడా కలదు. "జాత్యైక మాత్రబోధ్య సిద్ధాంతము" బలీయముగ ప్రచారము చేయుటచే హిట్లరిజముగ పరిణమించినది. భాషాసంరక్షణము, భాషాప్రాముఖ్యతాంగీకారము ఆధునికరాజ్యాంగ సూత్రములలో ముఖ్యముగా నున్నది. ఒకే భాష మాటాడుచు సామాన్యరాజకీయఆర్థికప్రతిపత్తులు గలిగినయెడల రాజ్యాంగ ఐక్యతకు లోపముండదు. ఇదియే ఆంధ్రరాష్ట్రోద్యమతత్వము. అందువలన జాతీయ స్వయం ప్రకాశము, పరిపాలనసౌష్టవము ఏర్పడుటయేగాక బాధ్యతాయుతప్రభుత్వమునకు మూలకందమగును.

బీహారు, ఒరిస్సా, అస్సాము, పశ్చిమోత్తర పరగణాలు, సింధు దేశములు ప్రత్యేకరాష్ట్రములుగ విభజింపబడినప్పుడు ఆంధ్రరాష్ట్రముమాత్ర మేల ఆ కారణములచేతనే నిర్మింపబడకూడదు?

## ప్రాంతీయుల అవరోధములు

పరిసరప్రాంతీయుల అవరోధము రెండుమార్గముల త్రొక్కుచున్నది: ౧. రాష్ట్రపరిహద్దులు, ౨. ఉపేక్షాభావము. పరిహద్దుల నేర్పరచుటలో కష్టముండదు. నిష్పక్షపాతముగ వర్తించు నిబుద్ధిమంతుల ఉపసభరైనను పరిహద్దులను సరిగా నిర్ణయించగలదు. భూగోళవిషయములయిన హద్దులు వగయిరాలు శాశ్వతములు; మార్పుతగినవికావు. ఆంధ్రరాష్ట్రము వాంఛనీయమని సమ్మతించినందులకు తమిళరాష్ట్ర కాంగ్రెసు వారికి కృతజ్ఞులము. భాషాప్రయుక్తరాష్ట్రవిభజనను అఖిలభారతసమస్యగా జేసినపిదప ఆమార్గమున అనేక రాష్ట్రములు నిర్మింపబడినతరువాత మనము ఇంకను వేచియుండజాలమని మన తమిళసోదరులకు మనము తెలియజేయవలెను.

## రాయలసీమ ఐక్యావసరము

రాయలసీమయందు గర్భితమై యున్న ఆంధ్రోద్యమప్రాతికూల్యతను మనము అవజ్ఞ చేయదగదు. శ్రీబాగ్ ఒడంబడిక ఈ సమస్యను సంపూర్ణముగ పరిష్కరించి యుండెనుగదా? రాయలసీమవారికి పునరాశ్వాసన మేవలయుచో, వారు సూచించిన వెంటనే వారు పొందగలరు. దేశాభిమానముగల ఏ ఉత్తరమండలాంధ్రుడైనను కండ్లుమూసికొని రాయలసీమాంధ్రులకు కావలసిన వన్నియు నిచ్చుటకు సమ్మతించునేగాని సంశయింపడు. హిందూసమష్టి కుటుంబముమాదిరి వారు, మనము సోదరులము గనుక కష్టసుఖముల సమానముగ ననుభవించుటయే ఒప్పిదము. మత, ఆర్థిక, రాజకీయ సంబంధములు బలీయములగుటచే మనలోని వైమనస్యములు చాలకాలముండజాలవు. మన జిల్లాల ఆదాయము ఇతర జిల్లాలమీద వ్యయపడు ఈ సమయముకంటె భవిష్యదాంధ్రమహాజాతిసమితి యందు రాయలసీమాంధ్రులు వారి ఔత్తరాహ్య సోదరుల సౌహార్దముచే ఎక్కువ లాభము పొందగలరని గుర్తించెదరుగాక! దత్తమండలములు ఆంధ్రరాష్ట్రములో, ఐర్లాండుదేశములో అల్‌స్టర్‌రీతిని ప్రవర్తించ కూడదు.

## ప్రధాన నగరముగురించి వివాదము

రాజధాని నగర విషయమై భేదాభిప్రాయములు కల్పించుకొనుట అనవసరమని నామనవి. అలూలేదు చూలూలేదు కొడుకు పేరు సోమలింగమన్నట్లు ఇప్పుడే ఏమి తొందర? తాత్కాలికముగ చెన్నపట్టణము ప్రధాననగరముగ నుండవచ్చును. తరువాత నిదానముగ అందరూ ఆలోచనచేయవచ్చును. విశేషప్రయాణ సౌకర్యములుగల ఈరోజులలో ముఖ్యపట్టణ విషయమున చింతయేల? కావలసినచోట క్రొత్తనగరమును సృష్టింపవచ్చును. హిందూదేశ ముఖ్యపట్టణము అడవి నేలయైన క్రొత్తఢిల్లీలో ఏర్పాటుచేసినప్పుడు, కేంద్రస్థానమును ఒక నూతనస్థలమందు మనము ముఖ్యనగరమును ఏల సృష్టించలేము? ఆధునిక నౌకాయుద్ధవిధానమునుబట్టిచూడ సముద్రతీరమునకు దగ్గరలో ప్రధాన

నగర ముండుట వాంఛనీయముకాదు. మనము గమనించవలసిన ముఖ్యఆదర్శము అఖిలాంధ్రతత్వము మాత్రమే. సంస్థానము లన్నియు అదృశ్యమై విశాల భారతఖండమున ఐక్యమగు సుదినమునకై ఉవ్విళ్లూరుచున్నాము. అట్టితరి ప్రధాననగరము విషయమై ఆంధ్రులలో ఆంధ్రులుగాని, ఆంధ్రులు తమిళులుగాని వివాదించవలసిన విషయముగాదు.

### ఆర్థికవసతి

ఆంధ్రరాష్ట్ర సందర్భమున ఒకటి రెండువిషయములు మనవిచేయవలచినాను. ఆంధ్రరాష్ట్రమునకు వలయు ఆర్థికవసతి మెండటిది. ఆంధ్రరాష్ట్ర పరిపాలనమునకు వలయు ధన మంతయు ఆంధ్రరాష్ట్ర ఆదాయమునుండియే దొరకగలదని ఇదివరకే నిరూపింపబడినది. ముమ్ముందు మనదేశ పదార్థసంపదను ఎక్కువ అభివృద్ధిలోనికి దెచ్చి మన ఆర్థికసంపదను వృద్ధిపొందించుకొనుట కవకాశము గలదు. ప్రజాప్రభుత్వము ఏర్పడినప్పుడు ఆదాయవ్యయములను సరిపుచ్చుటలో కష్టముండదు. మన రివిన్యూవిధానమును సంస్కరించి ఎక్కువ ధనమును జమపరచుట కవకాశము లుండును. ఆర్థికబలము, ఆర్థికస్వాతంత్ర్యము ప్రత్యేకరాష్ట్రనిర్మాణమునకు ప్రాథమికములని అంగీకరించేయెడల ఆంధ్రదేశమున కీ ప్రాథమికములు నిస్సంశయముగ ఇదివరకే సిద్ధించినవి. అందువలన ఆర్థికపరిస్థితినిగురించి భయపడ నవసరములేదు. రాజకీయ పరిస్థితులుగూడ ఆంధ్రరాష్ట్రమునకు చేయూత నిచ్చుచున్నవి. భావి భారతప్రభుత్వము సమాఖ్యవిధానమునై ఆధారపడియున్నది. హిందూదేశము నానారాజ్యసమ్మేళనమున ప్రత్యేకస్థానము వహింపనున్నది. మన ఆంధ్రమంత్రులు, ఆంధ్రశాసనసభ్యులు, ఆంధ్రనాయకులు ఈవిషయమై తగినంత శ్రద్ధతో కృషిచేయకపోవుట చోద్యముగ నున్నది. రౌండుటేబిలు సమావేశమున ఆంధ్రరాష్ట్రమునుగురించి గట్టిగా మనవారలు వాదించవలసి యుండెను. గొప్ప అవకాశమును పోగొట్టుకొనుట మన అదృష్టలోపము.

### ఆంధ్ర విశ్వవిద్యాలయము

మానవసృష్టిపథములో మార్పు గలుగునట్టుల విద్యావిధానము సంస్కరింపబడిననేకాని దేశమున కేమాత్రమును లాభముండదు. ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు సర్ రాధాకృష్ణను, డాక్టరు రామలింగారెడ్డిగార్లు ఒకరి తరువాత ఒకరు ఆధిపత్యము వహించుట విద్యాలయముయొక్క భాగ్యము. వారు విశ్వవిద్యాలయ కార్యక్రమమును ఆదర్శప్రాయముగా దక్షతతో నిర్వహించిరి. ప్రజలు, ప్రభుత్వమువారును విశ్వవిద్యాలయమునకు సాయముచేయుట ప్రథమకర్తవ్యము.

"మనసిచ పరితుష్టే కోఽర్థవాన్ కో దరిద్రః" అను నార్యోక్తిని నిరాడంబరమైన తమ జీవితముఖమున సర్వప్రపంచమున కుపదేశముచేయుచు మానవవ్యక్తిలో అంతర్గతమైయున్న దైవాంశను బోధచేయుచున్న మహాపురుషులు శ్రీ జయపురం మహారాజులుంగారు విశ్వవిద్యాలయపోషకులలో అగ్రగణ్యులు. వారివంటి మహారాజులు, రాజర్షులు మరికొంతమంది యుండినయెడల ఈరోజున మన భారతమాతయొక్క స్థితి యిప్పటివలె గాక వేరువిధముగ నుండెడిది.

పశ్చిమాంధ్రమండలములు ఆంధ్రవిశ్వవిద్యాలయమును విడనాడుటకు ముఖ్యకారణము ఈ సంస్థయందు తగిన కళాసౌకర్యములు లేకపోవుటయే. ప్రజాప్రభుత్వవిధి యటులుండ శ్రీ గవర్నరుగారి ప్రస్తుత 'తాత్కాలికసలహాసమితి'స్నీ, ప్రజలున్నూ విశ్వవిద్యాలయము స్వయంపోషిత మగునటుల తోడ్పడ వలసియున్నది. ఇంజనీరింగు కళాశాల, వ్యవసాయకళాశాల, నివాసగృహము అత్యవసరము. ఇట్టి సమయమున మన రాయలసీమ సోదరులు ఉత్తరాంధ్రులతో చేరి ప్రయత్నములు చేయుట హితమగుపద్ధతి. ఆంధ్రరాష్ట్ర సంపాదనానంతరము మన యిష్టానుసారము మనలో మనము అన్ని యేర్పాటులను గావించుకొనవచ్చును. రాయలసీమవారడిగినవా టన్నిటికిని మనసమ్మతి తెలియపరచుట యుక్తము.

'ఆంధ్రపత్రిక' అనేకసంవత్సరములనుండి చేసిన ఆంధ్రమాతృసేవ నిరుపమానము.

### ఆంగ్ల దినపత్రికావసరము

మన ఆంధ్రదేశమునకు వేరే ఒక ఆంగ్ల దినపత్రిక యుండవలెనని నాఅభిప్రాయము. ఈవిధముగ నను టచే జాతీయపత్రికలని కీర్తివహించిన హిందూ, ఇండియన్ ఎక్స్‌ప్రెస్‌లు మనకు సహాయముచేయుట లేదని చెప్పుట ఎంతమాత్రముకాదు. అయినను ప్రత్యేకాంధ్రరాష్ట్రము మనకున్నప్పుడు మనకొక ఆంగ్లదినపత్రికయుండుట సమంజసము.

నేను విశ్వకళాపరిషద్విద్యాపారంగతుడను కాను. విద్యావిషయములలో నెన్నడు నేను జోక్యము కలిగించుకొనలేదు. అయినను అధునికవిద్యవలన ఏ

మాత్రము లాభముకలిగినదని యెవ్వరైనను ప్రశ్నింపవచ్చును. రక్తసంబంధసోదరులు, ఏకగర్భ జనితులు చేతను పరస్పరసంహారము గావించుకొనుచున్నారు. శాస్త్ర విజ్ఞానము, అభివృద్ధి మానవక్లేశమును పెంపొందించుచున్నవి. భౌతిక, రసాయనశాస్త్ర విజ్ఞానాభివృద్ధి మానవసౌఖ్యమును చేకూర్చుటకు బదులుగా హింసను, వినాశనమును హెచ్చుచేయుచున్నది. ఉన్మత్తత వృద్ధిచెంది ప్రజలను హింసచేయుట, దోచుకొనుటయే పరమావధిగా గణింపబడుచున్నది. మానవదౌష్ట్యాంధకార నివృత్తికొరకు విద్య జ్ఞానదీపికగా నుండవలెను. యువజనలోకము నంతను నూతనసంస్కృతిచే ప్రకాశమానముగా చేయవలెను. ప్రస్తుత పాశ్చాత్య కాంక్ష మంతమొంది, భూతదయ, న్యాయ బుద్ధి, సత్యసంధత, సన్మార్గ ప్రవర్తనము అఖండజ్యోతులవలె వెలిగి మానవహృదయోద్దీపనము గావించవలెను. హృదయపరివర్తనము లేనిదే శాంతిసభలవలనను, ఆయుధ విసర్జనసభలవలనను, ఒడంబడికలవలనను లాభ ముండ నేరదు. గతములో ఒడంబడికల సంగతి ఏమైనది? సిరాయైనను ఆరకమునుపే ఒడంబడికపత్రము ఉల్లంఘింపబడినవి. అందువలననే విశ్వకల్యాణమునకు, మానవౌన్నత్యముకొరకు, శాశ్వతశాంతి సంపాదనకు మన నాయకోత్తముడు ఒకేమార్గమును సూచించియున్నాడు. అదియే ఉత్తమమార్గము. సత్యదీక్ష, అహింసావలంబనము.”

---

## ఆమోదించిన తీర్మానములు

### ౧. ఆంధ్రరాష్ట్ర తీర్మానము

ఆంధ్రుల రాజకీయ, సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక అభ్యుదయమునకు, అభివృద్ధికిని సత్వర ఆంధ్రరాష్ట్ర మత్యావశ్యకమగుటచేతను, అట్టి ఆంధ్రరాష్ట్రస్థాపన కావలయునన్న ఆశయము గత పాతికయేండ్లకుపైగా ఆంధ్రదేశ మెల్లయెడలను అనేక సార్లు ప్రకటితమగుటవలనను, లోగడ చెన్నపురి శాసనసభలలో ఉభయవర్గములవారును కాంగ్రెసు పార్లమెంటరీబోర్డువారి అనుమతిని, కాంగ్రెసు వర్కింగుకమిటీవారియొక్క అనుమతిని పొంది, సత్వర ఆంధ్రరాష్ట్ర స్థాపననుగూర్చి తీర్మానించియుండుటచేతను ప్రభుత్వమువారు వెంటనే ఆంధ్ర రాష్ట్రస్థాపన గావించవలయునని ఈ మహాసభవారు తీర్మానించుచున్నారు.

మళ్లీ రాష్ట్రాలలో ప్రజాప్రభుత్వమును ఏర్పరచుటకు తగిన అవకాశం కలిగినప్పుడు, అనగా మద్రాసులో మళ్లీ ప్రజాప్రభుత్వం ఏర్పడినప్పుడు ప్రత్యేకాంధ్రరాష్ట్రమును ఏర్పరచడం విషయంలో కలిగే నిరోధాల నన్నిటిని తొలగించడంవిషయంలో ఆంధ్ర ప్రతినిధులు తమ శక్తిసామర్థ్యాల నన్నిటిని వినియోగించవలెను. అతిశీఘ్రంగానే ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడడానికి వీరు గట్టికృషి చెయ్యవలెను. అలాను చేసినాకూడా ప్రత్యేకాంధ్రరాష్ట్రం ఏర్పడకపోయినట్లయితే, దాని నిమిత్తం ఆంధ్రప్రజలున్నూ, వారి ప్రతినిధులున్నూ కూడా సర్వవిధములా త్యాగం చెయ్యవలెను.

### ౨. ఆంధ్రులకు పరిపాలనసౌకర్యములు

ఆంధ్రప్రజాజీవితమునకును పరిపాలనకును చెందిన ముఖ్యావసరములయెడల ప్రభుత్వమువారింతవరకు జూపిన నిరాదరణను ఈసభవారు ఖండించుచు, అత్యవసరముగ ఈ దిగువమార్పులను గావించుటకు యత్నింపవలెనని స్థాయిసంఘమువారిని కోరుచున్నారు:

౧. అన్యోన్యఅంగీకారముతో ఆంధ్రబడ్జెట్టును విభజించి ఆంధ్రశాసనసభ్యులే యోచించుట; ౨. చాల కాలమునుండి ఆలోచనలో నున్న తుంగభద్ర మున్నగు ముఖ్యమగు రాయలసీమ ప్రాజెక్టులను సత్వరముగ నమలుపరుచుట; ౩. ఆంధ్రవిశ్వకళాపరిషత్తుయొక్క జ్యూరిస్‌డిక్షనులో నిఖిలాంధ్రభూమిని చేర్పించునట్లు యూనివర్సిటీ ఆక్టును సవరించుట; ౪. ప్రస్తుత చెన్నపురి హైకోర్టు అధికారమునకు లోబడి ఆంధ్రజిల్లాలకు సంబంధించిన న్యాయస్థానపు పనులన్నిటికిని ఒక ప్రత్యేకశాఖ ఏర్పరుచుట; ౫. సర్ విజయ రాఘవాచారి నివేదికననుసరించి యొక ఆంధ్రసహకార శిఖర బ్యాంకియు, కేంద్రభూమి తనఖా బ్యాంకియు, ౧౯౨౭ సం. నెం ౨కు ఆక్టు ౧౦-వ సెక్షను ననుసరించి ఆంధ్రజిల్లాల కొక ప్రత్యేక హిందూదేవాదాయ బోర్డును, ఆంధ్ర యూనివర్సిటీ శిక్షాశిబిరము, రేడియోస్టేషను, స్కూల్ ఫైనల్ బోర్డు, మెడికల్ కౌన్సిల్, వ్యవసాయకళాశాల, లా కాలేజీ, ఇంజనీరింగ్ కళాశాల మున్నగు సంస్థలను స్థాపించుటకై యత్నించుట; ౬. ప్రభుత్వోద్యోగములందు ఆంధ్రులకు న్యాయమును, అర్హమునగు పాలుకై యత్నించుట; ౭. ఆంధ్రకార్మిక పారిశ్రామికవర్గముల అభ్యుదయము; ౮. ఆంధ్రదేశమందలి అల్పసంఖ్యాకుల మత, సాంఘిక, ఆర్థికాది హక్కులను కాపాడుట; ౯. ఆంధ్రుల

ఆర్థిక, సాంఘిక, రాజకీయ విద్యాభివృద్ధి కనువగు అన్ని పనులందు తోడ్పడుట.

## ౩. ఆంధ్రదేశ ఉత్తర సరిహద్దుల సవరణ

ఒరిస్సారాష్ట్ర నిర్మాణ సమయమున అధిక సంఖ్యాకులగు ఆంధ్రులు నివసించుచున్నట్టి బరంపురం, ఛత్రపురం, గుణుపురం, పర్లాకిమిడి, జయపురం మొదలగు ప్రాంతములు అక్రమముగా అన్యాయముగా ఒరిస్సాలో చేర్చబడియుండుటచేతను, అర్థికముగాను చరిత్రాత్మకముగాను వైజ్ఞానికముగాను వ్యావహారికముగాను ఈ భాగములు ఆంధ్రదేశమునకు చేరినవే యగుటచేతను ఈ ప్రదేశములను నిర్మింపబడబోవు ఆంధ్ర రాష్ట్రములో చేర్చవలెను.

## ౪. రాష్ట్రేతరాంధ్రుల సమస్యలు

రాష్ట్రేతరాంధ్రుల నెదుర్కొనుచున్న ఆర్థిక సాంఘిక విద్యా ముఖ్యాగు సమస్యల విచారించి వారికి వలయు నివారణోపాయముల కలుగజేయుటకు ఈ క్రిందివారి నుపసంఘముగా ఎన్నుకోవడమైనది:

౧ గంటికోట సత్యనారాయణగారు పర్లాకిమిడి, ౨ దూర్వాసుల కామేశ్వరరావుగారు జయపురం, ౩ దేవరాజు వెంకటకృష్ణారావుగారు బరంపురం, ౪ సుమ్మలూరి లక్ష్మీనృసింహశర్మగారు ఖరగ్‌పూర్, ౫ బి. సదానందమూర్తిగారు బెజవాడ, ౬ బళీ నారాయణమూర్తిగారు జంషెడ్‌పూరు, ౭ వాయువేగుల వెంకటసుబ్బారావుగారు కల్యాణి. ౮ సుమ్మకిదల వెంకటసుబ్బారావుగారు బెజవాడ, ౯ సాధు వరద రాజంపంతులుగారు తిన్నవెల్లి, ౧౦ మాగంటి బాపినీడుగారు, ౧౧ పంద్రంగి కేశవరావుగారు, ౧౨ ఆవటపల్లి నారాయణరావుగారు, ౧౩ మద్దిరాల గోపాలరావుగారు కాశి.

## ౫. ఇండియా - బర్మా ఒడంబడిక

ఈ సభవారు బర్మా-హిందూదేశ ఒడంబడికను తీవ్రముగ ప్రతిఘటించుచున్నారు. ఇండియా ప్రభుత్వ చట్టము ఏర్పడినప్పుడు, బర్మాలో నిరాటంకముగా ప్రవేశించుటకును, అక్కడ వర్తకము చేయుటకును మున్నుగాగల హైందవుల హక్కులనుగూర్చి శాసనపూర్వకముగాను, ఇతరవిధములను యివ్వబడిన వాగ్దానములకు ఈ ఒడంబడిక విరుద్ధముగా నున్నదని ఈ సభవారు భావించుచున్నారు. బర్మా ప్రభుత్వచట్టము వలన హైందవ వర్తకమునకును, వృత్తులలో నియుక్తులైనవారికిని కల్పింపబడిన సంరక్షణను ఈ ఒడంబడిక నిరర్థకము జేయుచున్నదని ఈ సభవారి అభిప్రాయము.

ఈ ఒడంబడిక తగినవిధమున సవరింపబడి, హైందవుల నితరులనుండి వేరుపరచి వారికి అవమానము కలుగజేయు విషయముల నందుండి తీసివేసినగాని యెట్టి ఆర్డర్-ఇన్-కౌన్సిలైనను జారీ చేయబడకూడదని ప్రభుత్వమువారిని కోరుచు కేంద్ర శాసనసభవారిచే గావింపబడిన తీర్మానము ననుసరింపవలయునని ప్రభుత్వమువారిని ఈసభవారు హెచ్చరించుచున్నారు.

అసంఖ్యాకులగు నాంధ్రులు బర్మాకు వెడలుచుండుట గాన ఈసభవారి కీ విషయములో నెక్కుడు నిమిత్త మున్నది. ఇకముందు జరుగగల చర్చయందు ఆంధ్రమహాసభ స్థాయి సంఘమువారి సలహా గైకొనవలెనని ప్రభుత్వమువారిని కోరుచున్నారు.

## ౬. విశాఖపట్నం జిల్లా విభజన

విశాఖపట్టణం జిల్లాకాంగ్రెసు పరిపాలన సౌకర్యముల నిమిత్తమై ఉత్తర దక్షిణ విశాఖపట్నం జిల్లాలు రెండు ప్రత్యేకజిల్లాలుగా విభజింపబడినట్లే ఆంధ్రమహాసభ వ్యవహారముల విషయములో కూడ ఉత్తరదక్షిణ విశాఖజిల్లాలను వేరుగా విభజించవలెనని ఈ సంఘమువారు తీర్మానించుచున్నారు.

## ౭. ఆంధ్ర దేశ నిరుద్యోగనిర్మూలనము

(ఏ) ఆంధ్రదేశములో నిరుద్యోగసమస్య చాలా తీవ్రమైనస్థితిలో యున్నదనిన్నీ, తన్నివారణకు ఆంధ్రదేశములో విస్తారముగా పరిశ్రమలను స్థాపించుట ఆత్యావశ్యకమనిన్నీ ఈ సభవారు గుర్తించుచు, పారిశ్రామికముగ ఈ రాష్ట్రము వెనుకబడియుండుటచే మున్ముందు జరుగు నేషనల్ ప్లానింగునందు ఆంధ్రదేశమునకు అగ్రస్థాన ముండవలెనని నేషనల్ ప్లానింగుకమిటీ వారిని, (బి) ఆంధ్రదేశములోని నిరుద్యోగమును తొలగించుటకై ఆంధ్రదేశీయులనే స్థానిక పరిశ్రమలలో ఉద్యోగులుగా తీసుకొనవలెనని ఆంధ్రదేశములో నున్న పరిశ్రమాధికారులను, (సి) అందునిమిత్తమై మద్రాసు ప్రభుత్వమువారు గవర్నమెంటుఆఫ్ ఇండియా ఆక్టు ఆఫ్ 1935 సెక్షన్ 293 క్రింద ఫేక్టరీలలోను, వ్యాపారములయందును ఉద్యోగస్థులుగా నియమించుటలో గల నిబంధనలను అమలులో పెట్టవలసినదనియు ఈ సభవారు కోరుచున్నారు.

## ౮. ఆంధ్రపరిశ్రమలలో ఆంధ్రకార్మికులనే నియమింపవలెను

ఆంధ్రదేశ పరిశ్రమలలో కార్మికులను నియమించుటలో మొదట ఆంధ్రులను తీసికొనవలె న్యాయమై నప్పటికిని ఆంధ్రేతర కార్మికులకు ప్రాముఖ్యత నిచ్చుచు తీతబత్తెములలో ప్రత్యేకతజూపుట అసంతృప్తికి అశాంతికి కారణ మగుచున్నందున ఈ అన్యాయమును తొలగించుటకును, ఆంధ్రకార్మికుల హక్కులు భద్రపరచుటకును గట్టికృషి వెంటనే చేయవలసినదిగా ఈ సభవారు తీర్మానించుచున్నారు.

## ౯. ఆంధ్రులచరిత్ర

ఆంధ్రదేశపురోభివృద్ధికి సమగ్రమైన ఆంధ్రదేశచరిత్ర ముఖ్యము గనుక అట్టిచరిత్ర రచించుటకు ఈక్రింది ఉపసంఘమును మహాసభవా రేర్పరచుచున్నారు: ౧. మామిడిపూడి వెంకటరంగయ్యగారు, ౨. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, ౩. భావరాజు వెంకటకృష్ణారావుగారు, ౪. డా. పుట్టపర్తి శ్రీనివాసాచారిగారు, ౫. డా. మారేమండ రామారావుగారు, ౬. రాళ్లభండి సుబ్బారావుగారు, ౭. ప్రాతి నరసింహం పంతులుగారు, ౮. శ్రీరాం వీరబ్రహ్మకవిగారు, ౯ దిగవల్లి వెంకట శివరావుగారు, ౧౦. గండికోట సత్యనారాయణగారు, ౧౧. పింగళి లక్ష్మీకాంతంగారు, ౧౨ చేకుమళ్ల రామచంద్రరావుగారు.

## ౧౦. ఆంధ్రవిశ్వవిద్యాలయము

ఆంధ్రుల అభ్యుదయమున కీక్రింది కార్యక్రమము ముఖ్యావసర మగుటచే ఆంధ్ర విశ్వవిద్యాలయమువారు వీటిని నిర్వహించువిషయమై వెంటనే శ్రద్ధవహింపవలెనని ఈ మహాసభవారు హెచ్చరించుచున్నారు.

౧. వ్యావసాయిక కళాశాల, ౨. లా కాలేజీ, ౩. ఇంజనీరింగు కళాశాల (మెరీన్ ఇంజనీరింగుతో సహా), ౪. సంగీతములోనూ పబ్లికు అడ్మినిస్ట్రేషన్‌లోనూ డిప్లొమాలు, ౫. సైనిక, నౌకాశాస్త్రములు, ౬. గ్రంథాలయశిక్షణ, ౭. భారతదేశ చరిత్రను, ముఖ్యముగ ఆంధ్రదేశచరిత్రను సంస్కృతులను పరిశోధించు ప్రత్యేకశాఖ, ౮. యూనివర్సిటీ ట్రెయినింగ్ కోర్, ఇంటర్మీడియేటుతరగతులలో మాతృభాషలో బోధనము, ౯. స్త్రీలకు ఒక ప్రత్యేకకళాశాల, వసతిగృహము, ౧౦. తెలంగాణములోని పాఠశాలలను మదరాసు యూనివర్సిటీనుండి ఆంధ్రవిశ్వకళాపరిషత్తు పర్యవేక్షణలోనికి మార్చుట.

## ౧౧. స్త్రీల కాంధ్రవిశ్వవిద్యాలయమం దుచితవిద్య

ఆంధ్రదేశములోని స్త్రీలు ఉన్నతవిద్యను సంపాదించుటకు కావలసిన వసతులు కల్పించుట అత్యావశ్యకమగుటచేత (౧) అనర్సుతరగతులలో చేరు విద్యార్థినులవద్దనుండి జీతములు పుచ్చుకొనక ఉచితముగ వారికి విద్య నొసగవలెనని ఆంధ్ర విశ్వవిద్యాలయాధికారులను, (౨) జిల్లాబోర్డులు, మునిసిపాలిటీలు ఆంధ్రవిశ్వవిద్యాలయమున కిచ్చు గ్రాంటులలో కొంతభాగమును అనర్సు తరగతులందును, పరిశోధకశాఖలందును ఉండువిద్యార్థినుల సహాయార్థమై ఉపయోగించునట్లు ఏర్పాటు గావించవలెనని జిల్లాబోర్డులను, మునిసిపాలిటీలను ఈ మహాసభవారు కోరుచున్నారు.

## ౧౨. రాష్ట్రేతరాంధ్రులవద్దకు సౌహార్ద రాయబారము

రాష్ట్రేతరాంధ్రులను కలసికొని వారితో సంబంధ బాంధవ్యములు పెంపొందించు నిమిత్తం సౌహార్దరాయబారము నొకదానిని పంప ఈ మహాసభవారు స్థాయిసంఘంవారిని కోరుచున్నారు.



# విమర్శనము

## "తీరనికోరిక - తరువాత"

గ్రంథకర్త: శ్రీ రావు వేంకటమహీపతి గంగాధరరామారావు-పిఠాపురం యువరాజుగారు.

ఇది ఒక చక్కని సాంఘిక నాటకం. నల్లటిరాతి బొగ్గులో అమూల్యములగు రంగురంగుల సుగంధిపదార్థములు ప్రకృతిసిద్ధముగా నుండులాగున వ్యభిచారులూ, త్రాగుబోతులూ, హంతకులూ, పతితులూ, జారిణులూనైన పంచమహాపాతకులయందు కూడ ఔదార్యమూ, సౌజన్యమూ, ధైర్యమూ, స్థిరత్వమూ మొదలగు సుగుణపుంజములు అంతర్గర్భితములై యుండు ననే విషయము ఈ నాటకరూపమున చిత్రింపబడినది. నాటకమందలి ప్రధానరసము కరుణాత్మకము. నాయికా నాయకులవదగిన తిలోత్తమా, నరేంద్రులు పతితోద్ధరణమునకై పాటుపడుతూ అంగుల కొక ఆశ్రమమును స్థాపించి నిర్వహిస్తున్న రోజులలో మదాంధులూ, దురహంకారులూనైన ప్రభువుల అత్యాచారములకు లోనై బలియైపోవట మిందులోని ప్రధానవస్తువు. కాని నాగనాశనుడను వ్యక్తిద్వారా నాందీవాక్యం మొదలు భరతవాక్యంవరకూ హాస్యరసం ఒలుకుతూవుంటుంది. తను కబళింపనున్న ప్రాణులశరీరవర్ణములకు తగినట్లు తనఒడలి రంగునుగూడా క్షణక్షణమునకు మార్చుకొనుచుండు ఊసరవెల్లిలాగు ఈనాగనాశనుడును తనచుట్టూనున్న వ్యక్తుల ఉద్దేశాలనూ, భావాలనూబట్టి తన మనోగత భావాలనుకూడా మార్చుకొంటూ చూపరులకు నవ్వు కలిగిస్తూ ఉంటాడు. అతని కీనైజగుణము ఇహమందే గాదు, పరమందుకూడా మారదు. ఈ పాత్ర చాలా నిపుణంగా చిత్రింపబడినది. తోడుకులోదు తక్కినరసాలున్నూ ఆయాసందర్భాలలో ప్రకట మవుతూవున్నాయి. మొత్తంమీద నరేంద్ర తిలోత్తమల ఆదర్శంవల్ల పతితులుగూడ జ్ఞానమునొంది పావనులవుతారు. కాబట్టి—

"అపిచేదసి పాపేభ్యః సర్వేభ్యః పాపకృత్తమః,
సర్వం జ్ఞానప్లవేనైవ వృజినం సంతరిష్యసి"

అను సూక్తికి ఈనాటకము యావత్తూ ప్రభావాన్వితమైన చిత్రణమనందగినది. ఆగర్భశ్రీమంతుడైన యువరాజు కటికదరిద్రులూ, అనాథులూ, పశ్యతోహరులూ, పంచమహాపాతకులూనైనవారి మనస్సులలోని ఉచ్చనీచాభిప్రాయములను ఇంతసూక్ష్మంగా గ్రహించి ఇంతనిపుణంగా చిత్రించగలుగుట కొనియాడతగినది.

---

## స్వాతంత్ర్యదీక్ష

రచయిత: రామనరేశత్రిపాఠిగారు. అనువాదకుడు: చర్ల గణపతిశాస్త్రిగారు, నిడదవోలు, పశ్చిమగోదావరిజిల్లా. వెల రూ. ౦-౮-౦.

అసలిది హిందీపద్యకావ్యము; 'మిలన్' అను పేరుగలది. దానిని చక్కనిపద్యములలోని కనువదించి శాస్త్రిగారు ఆంధ్రుల కృతజ్ఞతకు పాత్రులైనారు. ప్రియాప్రియు లిద్దరు నౌకాప్రయాణము చేస్తూ ప్రవాహమధ్యమున నావ మునిగిపోగా ఇద్దరూ వియుక్తులై ఒకానొక సాధుపుంగవునిచే రక్షింపబడి కొంతకాలమునకు మరల నిరువురును కలసికొని దేశస్వాతంత్ర్యమునకై పాటుపడిన కథ ఇందు చక్కగా వర్ణింపబడినది. ఇది హిందీ పద్యములకు తెలుగుపద్యములలోని కనువాదమయ్యు మూలమున కెంతమాత్రమును తీసిపోక మిగుల రసవంతముగ నున్నది.

---

## శ్రీ రామకృష్ణవాక్యావళి

మైలాపూరు (మదరాసు) శ్రీ రామకృష్ణమఠమువారిచే ప్రకటింపబడినది. అనువాదకులు: శ్రీ మాధవచైతన్యబ్రహ్మచారిగారు. ద్వితీయముద్రణము. ౫౦ + ౮౯౧ పుటలు. వెలసాదాబైండు రూ.౧-౧౨-౦; మేలైన అట్టబైండు రూ. ౨-౮-౦.

ఇది శ్రీ రామకృష్ణ పరమహంస సంగ్రహజీవితసహితము. ఇంచుమించు ౨౦ నీతికథారత్నములతోగూడిన యీ గ్రంథమున ౧౧౨౧ మహోపదేశ

ములు గలవు. ఈ దివ్యోపదేశము లన్నియు శ్రీ రామకృష్ణ లీలాప్రసంగాది మూలగ్రంథములనుండి యేర్చి కూర్చబడినవి. బోధ లిందు చక్కని విధానమున పొందు పరుపబడియున్నవి. ఉపనిషత్తులు, గీత, భాగవతము మున్నగు గ్రంథములనుండి ప్రమాణవాక్యములుగూడ ఉదాహరింపబడియున్నవి. శ్రీ రామకృష్ణ వాక్య విశిష్టతనుగూర్చి "రామకృష్ణుని యుపదేశము లొక పండితమాత్రుని వాక్యములు కావు. అవి జీవిత మను గ్రంథమునందలి పుటలు, స్వానుభవనిదర్శనములు. కావుననే వానిని జదువునప్పుడు పాఠకుని కనివార్యమైన చిత్తసంస్కారము గలుగుచుండును..." అని మహాత్మగాంధి ప్రకటించిన యభిప్రాయమే చాలు, ఈ గ్రంథప్రాశస్త్యము నగ్గడించుటకు. శ్రీ మాధవ చైతన్య బ్రహ్మచారిగారి యనువాదము సరళమై, మృదుమధురమై యున్నది.

---

## శృంగారరస తరంగిణి

ప్రకాశకులు: గంటి సూర్యనారాయణశాస్త్రి గారు, విజయనగరం. వెల రూ. ౧-౦-౦.

పూర్వకవి రచితములైన ప్రబంధములనుండి యేర్చి కూర్చిన రసవంతములైన శృంగార పద్యముల సంపుటి. తరంగిణి నిరంతర రసవాహిని. వాహినికి రెండు ప్రక్కలా నెలకొనియున్న శృంగార ప్రబంధము లనెడి ఫల వృక్షములనుండి రస మెల్లప్పుడు తరంగిణిలోనికి ప్రవహిస్తూనేవుంటుంది. శృంగారరస పిపాసులగువారికి మరెక్కడికీ పరుగెత్త నక్కరలేదు దాహం తీర్చుకోడానికి. ఒడ్డున కూచుంటే చాలు. ఎంతరసమైనా త్రాగవచ్చు.

---

## శ్రీ రామకృష్ణ పరమహంస జీవితోపదేశసంగ్రహము

ప్రకాశకులు: చెన్నపురి శ్రీ రామకృష్ణమఠము వారు. రచయిత: శ్రీ మాధవ చైతన్య బ్రహ్మచారిగారు. వెల ౦-౩-౮.

---

## చైత్రరథం

రచయిత: జి. వి. కృష్ణరావుగారు. తెనాలి రాడికల్ పబ్లికేషను వారి మూడవ ప్రచురణము. ఇందులో ఫ్రెంచి కామెడీ, భిక్షాపాత్ర అనే రెండు నాటికలున్నూ, పక్షిపూర్తి, స్వేచ్ఛాప్రణయి, బొమ్మరిల్లు, అమాయకుడు అను నాలుగు కథానికలున్నూ గలవు. వెల ౦-౮-౦.

---

## శ్రీ రామకృష్ణ పరమహంస నీతికథారత్నములు

శ్రీ రామకృష్ణవాక్యావళినుండి ౬౩ నీతికథా రత్నము లిం దేర్చి కూర్చబడియున్నవి. కథలు మనోహరములై యున్నవి. ఇదియును చెన్నపురి శ్రీ రామకృష్ణ మఠ ప్రచురణమే. ౭౯ పుటలు. వెల అరణా.

---

## రక్తాశ్రువులు

రచయిత: శీలా రాజులురెడ్డిగారు, C/o ఎ. గోపీనాథంగారు, ౨౦౬ - స్ట్రాండ్ రోడ్డు, రంగూను, బర్మా. వెల రూ ౦-౪-౦.

---

## ఆంధ్రహిందీ సుబోధిని

గ్రంథకర్త: ఎడలువాడ కోటి నరసింహంగారు, ఏటూరు, కంచకచర్లపోస్టు, నందిగామ తాలూకా, కృష్ణాజిల్లా. వెల రూ ౦-౪-౦.

---

## కుసుమావళి

రచయిత: నరజీకోట శ్రీరాంగారు. ప్రకాశకులు: నాగరంపూరు సూరి, నెల్లూరు. వెల రూ. ౦-౧-[illegible]-౦.

---

## గురుదేవోపహారము

జయంతి గంగన్న పంతులుగారి కొన్ని రచనలు. వారు రాజమహేంద్రవరమునందలి వీరేశలింగ స్త్రీ కోన్నత పాఠశాల ప్రధానోపాధ్యాయపదవినుండి విరమించినప్పుడు వారి ఛాత్రసమితి కృతజ్ఞతాపూర్వకముగ ప్రకటించిన చిన్న సంపుటి.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press,
No. 7, Thambu Chetty St, Madras. Editor:— S. Sambhu Prasad.

గవద్గీత (సంస్కృతము): శ్రీ శంకరభాష్యముతోను, దానికి కీ. బెల్లంకొండ రామారావుగారిచే …యబడిన భాష్యార్క ప్రకాశమను …ల సంస్కృత వ్యాఖ్యానముతోను …తము. (నాలుగు సంపుటములు).

వెల 6-0-0.

…పభాతము: ఇదికూడ ఒక సాం… నవల. సుప్రసిద్ధ కథకులయిన …వెంకటరమణిగారు ఇంగ్లీషు… సిన Murugan the Tiller అను నవలకు ఇది చక్కని ఆంధ్రీకర… కర్షకజీవితము, కర్షకప్రబోధము …లో అతిసుందరముగా చిత్రింపబడి …వి. రమణీయమైన రచన.

వెల 1 0-0.

ఆంధ్రశబ్దచింతామణి: ఆంధ్రభారతలక్ష్యములతోను, సంప్రదా…యార్థములతోను, పారినంది రామశాస్త్రులుగారు రచించిన ఉద్యోతిని సంస్కృ, తాంధ్ర వ్యాఖ్యానము సమేతమైన నన్నయభట్టు…ము. వెల 0-12-0.

శతకమంజరి: భక్తిసంపుటము. ప్రాచీన శతకముల క్రోడీకరణము.

వెల 1-0-0.

భగవద్గీత (తెలుగు): సంస్కృత మూలము, శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు వ్రాసిన టీకాతాత్పర్య విశేషార్థ వివరణములు గల 600 పుటల గ్రంథము. గీతాధ్యయనము చేయువారికి మిక్కిలి ఉపయుక్తమైనది. ఖద్దరుగుడ్డబైండు. వెల 1-0-0.

[మూడవకూర్పు అచ్చగుచున్నది.]

**ఆంధ్రవిజ్ఞాన సర్వస్వము**

విజ్ఞానమును సంపాదించుటకు తెలుగులో దగిన ప్రతి విషయమును ఈమహాగ్రంథములో సవిస్తరముగా ప్రతిపాదింపబడియున్నది. ఇట్టి గ్రంథము నిదివర కెవ్వరును ప్రచురించినది లేదు. ఇందలి విషయములను ప్రశంసించి చెప్ప… నట కొలదిమాటలలో అలవి గాదు. ఇది ప్రతి ఆంధ్రుని యింటను ఉండి తీరవలసిన గ్రంథము. ఏవిషయమును గురించి సంశయము వచ్చినను దీనిని ఒకమారు విలోకించి సంశయనివృత్తి గావించుకొనవచ్చును. ప్రస్తుతము రెండు సంపుటములు ప్రచురితములై యున్నవి. వీనిలో 'అ' మొదలు 'అశ్వక్రాం' వరకును గల సమస్త విషయములనుగురించిన వ్యాసములు గలవు. ఏకవర్ణ, ద్వివర్ణ, త్రివర్ణ చిత్రపటములుగూడ అనేకము జతపరుపబడియున్నవి. ప్రతి సంపుటము చక్కని స్వదేశీచర్మముతో పూర్తిగా బైండు చేయబడి, బంగారురేఖల అక్షరములతో తీర్చబడియున్నది. ఒక్కొక్క సంపుటములోను 600 పుటలున్నవి. సంపుటము 1-8 వెల 10-0-0

Regd. No. M. 1856. 7th July 1

# అత్యంతమనోహరము

సురాజ్ మల్ కంపెనీవారి ఆభరణములు చూపరుల
కర్షించును. నవీనమైనవి. చూచినవస్తువుపై ఒకమా
నకు వ్యామోహము కలుగనివారికికూడ వచ్చేనగలు,
రకములు సురాజ్ మల్ కంపెనీవారి దుకాణము

# మేలైనరకము

సురాజ్ మల్ కంపెనీవారివద్ద మేలైనరకమున
చునను వాడుకగలరు. మేలైనరకము నగలను ప్ర
టలో చి శేవ.మున్నది.నగలకుగూడ అదృష్టమున
నగల అదృష్టము ఆ నగలలో కూర్చిన రత్నము
ముపై ఆధారపడియుండును. మేలురకముల
నగలు అత్యంత మనోహరముగా ఉండును. స
పనివాండ్రున్న దుకాణమున తయారుచేయించిన
అధిక్యత ఉండును. ఇట్టిపనితనము సురాజ్ మల్ క
వారి వస్తుసామాగ్రిలో గలదు. అందుచేతనే సురాజ్
వారి నగలు రమణీయముగా ఉండును.

ప్రత్యేక వ్యాపారము
సాగించి, లాభమును
పొందుడు.

# విశ్వసింపదగినవి

సురాజ్ మల్ కంపెనీకి 1895 సం॥నుండీ మార్కెటులో పేరు
న్నది. భారతదేశమున బర్మాలోను ప్రసిద్ధిగాంచినది. ఈకంపెనీలో
అందరికి ఒకేధర, నిశ్చయమైన ధర. మీరుగూడ మీ నగలను
సురాజ్ మల్ కంపెనీలోనే కాని వాణ్యమైన నగలను సంపాదిం
చుకొని తృప్తిపొందుడు. స్వయముగా దుకాణమునకు వచ్చినను
పోస్టుద్వారా తెప్పించుకొనినను ఒకేధర మీకొకధర, మీ ఇరుగు
పొరుగువారికి ఇంకొకధర ఉండదు.

# సురాజ్ మల్

"విశ్వసించదగిన నగల వర్తకులు"

వజ్రముల వర్తకులు, బంగారు, వెండి సామాగ్రిని తయారుచేం

313, ఎస్ప్లనేడు — మదరా